# 'అనాసిన్'

## నొప్పిని జయించుటకు

## నాలుగు మందుల కూడిక

1. క్వినైన్ సల్ఫేట్  2. ఫినాసిటిన్

3. కఫిన్  4. అసిటిల్ సాలిసిలిక్ ఏసిడ్

'అనాసిన్'—గొప్ప బాధానివారిణి—వైజ్ఞానికంగా కూర్చబడిన నాలుగుమందులను, గలిగియున్నది, అవి నరములముఖ్యస్థానములందు సంయుక్తచర్యను జరిపి, తలనొప్పులు, జలుబులు, జ్వరము, దంతబాధ, కండ నొప్పులనుండి రూఢిగా, సురక్షితమైన శీఘ్రవిముక్తిని గలిగించును. బాధానివారణకు 'అనాసిన్' కంటె అతివేగముగా పనిచేయునట్టిది మరేదీ లేదు. సేవించుటకు 'అనాసిన్' కంటె అతిసురక్షితమైనట్టిది మరేదీ లేదు. జ్ఞాపకముంచు కొనుడు! 'అనాసిన్' వైద్యుని ఔషధయోగము వంటిది. అది గుండెలకు హానిగాని కడుపు ఉబ్బరముగాని కలిగించదు. 'అనాసిన్' లక్షలాది జనులకు బాధానివారణి ఎందుకనగా ప్రతివారున్ను 'అనాసిన్' ను కొనగలరు.

ఒక ప్యాకెట్ దర 2 అణాలు మాత్రమే.

**నాలుగు మందుల సూత్రమైన 'అనాసిన్' వాడుడు**




V 102

"రోహిణి"

చిత్రకారుడు: నక్కల మునుస్వామి—మద్రాసు.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.




సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 51
సంచిక 24
13-2-57

దుర్ముఖ మాఘ శుద్ధ చతుర్దశి బుధవారం


 విషయానుక్రమణిక 

# శ్రీరామ రక్ష

దేశ వ్యాప్తంగా జరుగుతున్న ఎన్నికల మహా సంరంభంలో మొట్ట మొదటి కాంగ్రెసు విజయాన్ని సాధించిన ప్రతిష్ఠ ఆంధ్ర ప్రదేశ్ కే లభ్యమైంది. రాజమండ్రీ నియోజకవర్గం ఈనాందీగీతాన్ని ఆలాపించింది. ఆనియోజకవర్గం నుంచి లోక్ సభకు (కాంగ్రెసు) అభ్యర్థిగా ఒక్క కర్నల్ డి. ఎస్. రాజు మాత్రమే నామినేషన్ దాఖలు చేసినందువల్ల, వారు పోటీలేకుండా గెలిచినట్లు ప్రకటించారు. చిత్తూరు రిజర్వుస్థానంలో కాంగ్రెసు అభ్యర్థిగా నిలచిన శ్రీ గంగాధరశివకు కూడా ఇదే మాదిరి విజయం చేకూరింది. ఇక్కడ మన రాష్ట్రంలో వీరిద్దరి మాదిరిగానే, ఈశాన్య భారతదేశ రాష్ట్రమైన అస్సాంలో కూడా మరొక కాంగ్రెసు అభ్యర్థి శ్రీ విజయచంద్ర భగవతి లోక్ సభకు పోటీలేకుండా గెలిచారు. ఈవిధంగా కాంగ్రెసు విజయపరంపరకు ఆంధ్రప్రదేశ్ బోణీ చేసింది; అస్సాం అనుసరించింది. మన రాజ్యాంగంలోని రాష్ట్రాల జాబితాలో ఆంధ్రది అగ్రస్థానం; అస్సాంది ద్వితీయ స్థానం. లోక్ సభ స్థానాలకు పోటీలేని విజయాలు సాధించడంలో కూడా అస్సాం ఆంధ్ర ప్రదేశ్ లు చెట్టాపట్టాలు వేసుకుని "పహిలాబోణి—పంచకళ్యాణి" అన్నట్లు ముందంజవేయడం దేశహితాభిలాషులందరూ హర్షించవలసిన విషయం.

* * *

"తెలంగాణాలో మద్య నిషేధశాసనం అమలు జరిపితే, కొత్తగా ఏర్పడిన అంధ్రప్రదేశ్ బడ్జెట్ లో లోటు మరీఎక్కువవుతుంది. అందుచేత ఆజిల్లాలలో 1960 వరకూ మద్యనిషేధం ప్రవేశపెట్టం" అన్నారు రాష్ట్ర అబ్కారీశాఖమంత్రి శ్రీ మందుముల నరసింగరావు, ఇటీవల తాడేపల్లిగూడెం కాంగ్రెస్ కార్యకర్తల సమావేశంలో ప్రసంగిస్తూ. ఇదికేవలం మంత్రి వ్యక్తిగత అభిప్రాయమో, మంత్రివర్గ నిర్ణయమో తెలియదు. ఇది మహాత్ముని ప్రబోధానుసారం యావద్భారత విధానానికి సంబంధించిన విషయం కాబట్టి, ఐదేళ్లలో దేశవ్యాప్తంగా మద్యనిషేధం అమలు జరగాలని విచారణ సంఘం ఇదివరకే సిఫార్సు చేసివున్నది కాబట్టీ అప్పటికైనా ఆసిఫార్సును అమలు జరపక ఎలాగూ తప్పదు. బడ్జెట్ లో లోటువస్తున్నదనే సాకుమీద ఉత్తమోత్తమమైన సాంఘిక సంస్కరణ అని చెప్పుకునే మద్యనిషేధాన్ని వాయిదా వేయడం ఏమంత భావ్యమైన పని? భారీ ఎత్తున పంచవర్ష ప్రణాళికలు అమలు జరిగినంతకాలం రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల బడ్జెట్లలో లోటు చూపించక తప్పదు. లోటు భర్తీకి ఇతర మార్గాలను అన్వేషించి కృతకృత్యులు కావాలిగాని, పాటకజనం పొట్టలు కొట్టి ఆర్జించే ఈ "పాపపు డబ్బు" మీదే ఆధారపడడం ఏమంత సబబు? అంతగా డబ్బు అవసరమైతే, అన్ని జిల్లాలలోనూ ఒకేసారిగాక పోయినప్పటికీ, కనీసం అంచల వారిగా ఏడాదికి ఏఒకటి రెండుజిల్లాలనైనా తీసుకుని మద్యనిషేధం అమలు జరపడానికి రాష్ట్ర ప్రభుత్వం ఇప్పటినుంచే ప్రయత్నించడం శ్రేయస్కరం.

* * *

"ఆంధ్రులందరూ రాజకీయంగా ఏకమైనారు. ఆంధ్రభూభాగాలన్నిటినీ చేర్చి ఆంధ్రప్రదేశ్ స్థాపించుకున్నారు. అయితే ఆంధ్రుల మధ్య వున్న మానసిక అవరోధాలు ఇంకా సమసిపోలేదు. సర్కారుజిల్లాలు అనీ, రాయలసీమ అనీ, తెలంగాణమనీ ఇప్పటికీ వ్యవహరిస్తూనే వున్నాము. ఈ ప్రాంతీయ విభేదాలు కూడా తొలగిపోయేలా చూసుకుని మనం అందరం ఆంధ్రులం అనే భావం పెంపొందజేసుకోవాలి" అని హితవు చెప్పారు, రాష్ట్రప్రభుత్వ రహదారులశాఖ మంత్రి శ్రీ మందుముల నరసింగరావు, ఈమధ్య కాకినాడ పురపాలక సంఘ స్వాగత పత్రానికి సమాధానం ఇస్తూ. నిజంగా అక్షరలక్ష లివ్వదగినమాట చెప్పారు మంత్రి. ప్రాంతీయ విభేదాలను ఎంత త్వరగా మన మనస్సులలోనుంచి తుడిచివేస్తే అంత మంచిదే. కాని, తరతరాలుగా ఉపయోగిస్తూవచ్చిన ఈ ప్రాంతీయపదాలను వాడడం మానివేసే మార్గమేమిటన్నది ప్రశ్న. ప్రాంతీయ విభేదాలకు స్వస్తిచెప్పాలన్న శ్రీ నరసింగరావే, అదే సభలో అదే ఉపన్యాసంలో, "తెలంగాణాప్రాంతం" అన్ని విధాలా వెనుకబడివున్నది. దాన్ని అభివృద్ధి చేయడానికి అందరు కలసి కృషిచేయాలి అని చెప్పక తప్పలేదు. అలవాటు అన్నది అంత బలీయమైనది. ఈ అభ్యాసాన్ని వదిలించుకోవాలంటే, సువిశాలమైన మన ఆంధ్రప్రదేశ్ ను రాజధానిని కేంద్రంగా భావించి ఉత్తర దక్షిణాంధ్ర ప్రాంతమనీ, తూర్పు ఈశాన్య ఆగ్నేయాంధ్ర భాగాలనీ దిశలవారిగా ఉచ్చరించి వ్యవహరించడం మంచిదేమో ?

* * *

"కమ్యూనిస్టుల కంచుకోట అని చెప్పుకుంటున్న నల్గొండ జిల్లాను మనం చేజిక్కించుకుందాం. ఇది పూర్తిగా కాంగ్రెస్ వాదుల కంచుకోట అని ఈ ఎన్నికలలో రుజువుచేసుకుందాం," అన్నారు. రాష్ట్ర సహకారశాఖ మంత్రి శ్రీ సంజీవయ్య, ఈమధ్య ఆ జిల్లా కాంగ్రెస్ అభ్యర్థుల సమావేశంలో ప్రసంగిస్తూ. ఎన్నికలలో కాంగ్రెస్ విజయభానూదయంతో తెలంగాణా జిల్లాలలోని కమ్యూనిస్టు కంచుకోటలన్నీ మంచుకోటలలా మాయమై పోయేట్లు చూడాలి.

* * *

"హత్యా నేరానికి ఉరిశిక్ష విధించే ఆచారాన్ని రద్దు చేయాలనడం మంచిది కాదు... క్రూరమైన పనులు చేసేవారిని ఎందుకు క్షమించాలో నాకు అర్థం కావడం లేదు. బ్రిటన్ కూడా ఉరిశిక్షను రద్దు చేయలేదు. ఐదేళ్ళపాటు మాత్రమే నిలుపుదలచేసి ఫలితాలను పరీక్షించదలిచింది," అన్నారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రీయ వ్యవహారాల మంత్రి శ్రీ గోపాలరెడ్డి, జనవరినెలాఖరున రాజధానిలో జైళ్ళ అధికారుల సమావేశాన్ని ప్రారంభిస్తూ. క్రూరమైన, ఘోరమైన నేరం చేసిన వ్యక్తికి తగినట్లుగా క్రూరమైన, ఘోరమైన శిక్ష విధించాలనడం మహాత్ముని ప్రబోధాలకు అనుగుణమైన విధానమవునో, కాదో కాంగ్రెస్ పాలకులే నిర్ణయించుకోవాలి. క్షణికోద్రిక్త పరిస్థితులలో ఒక వ్యక్తి దారుణాతి దారుణమైన నేరాన్నే చేసి వుండవచ్చు. అతడికి తగిన శిక్ష విధించవచ్చు. శిక్షాకాలంలో ఆవ్యక్తి పశ్చాత్తప్తహృదయుడయేట్లు, అతడిలో కావలసిన మానసిక పరివర్తనం వచ్చేట్లు చేయవలసిన బాధ్యత పరిపాలకులమీద వున్నది. ఇందుకు కావలసిన పరిసరాలను, పరిస్థితులను కలిపించవలసిన బాధ్యతకూడా పరిపాలకులదే. ఉరిశిక్ష పడేవారిలో ఐదింట నాల్గువంతులమందికి ఆశిక్ష యావజ్జీవ కారాగార శిక్షగానో, ఇతర స్వల్పకాలిక శిక్షగానో మారిపోవడం జరుగుతున్నదనీ, నూటికి 20 మందికి మాత్రమే ఉరిశిక్ష అమలు జరుగుతున్నదనీ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి చెబుతున్నారు. ఈ మార్పుకు చాలావరకు ఖైదీల సత్ప్రవర్తనా ధోరణే కారణమై వుండాలి. మానసిక పరివర్తనకు, పశ్చాత్తాపానికి జైళ్లలో సంపూర్ణావకాశాన్నీ, పరిస్థితులను కలిపించినట్లయితే, ఉరిశిక్ష అమలుకు

# ★ శ్రీరామరక్ష ★

అసలు అవకాశమే వుండదనికూడా చెప్పవచ్చు. శ్రేయోరాజ్యస్థాపన లక్ష్యంతో వివిధ రంగాలలో అభ్యుదయానికై కృషి చేస్తున్న మనం, ఇతర పురోగామిదేశాల మాదిరిగా, కొన్నేళ్లపాటు ఉరిశిక్షా విధానాన్ని మన దేశంలో కూడా ఎందుకు రద్దు చేయకూడదు?

* * *

ఉరిశిక్షను రద్దుచేసే విషయమై కేంద్ర ప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాల అభిప్రాయాన్ని అడిగినప్పుడు, చాలా రాష్ట్రాలు అందుకు వ్యతిరేకతను తెలియజేసినవనీ, ఉత్తరప్రదేశ్, మదరాసు, బొంబాయి, బీహారు మొదలైన రాష్ట్రాలకు ఏ విధానం మంచిదో, ఆంధ్ర తెలంగాణా జిల్లాలకు కూడా అదే మంచిదై తీరుతుందనీ రాష్ట్రీయ వ్యవహారాల మంత్రి ఖండితంగా చెబుతున్నారు. దేశంలోని ఇతర రాష్ట్రాలతో పోల్చదలచుకున్నప్పుడు, మన రాష్ట్రంలోని జైళ్లకు ఇతర రాష్ట్రాలలోని జైళ్లకు ఎంత వ్యత్యాసమున్నదో కూడా గమనించడం అవసరం. మహాత్ముని నాయకత్వాన జాతీయోద్యమాలు ప్రారంభమైనప్పటి నుంచీ గత ముప్ఫయేళ్లలో దేశంలోని జైళ్ళలో అనేక సంస్కరణలను సాధించిన మాటనిజమే. ఖైదీలకు ఆహారంతోపాటు మజ్జిగ ఇవ్వవచ్చు. అందుకై సాలీనా 90 వేల రూపాయలు ఖర్చుపెట్టవచ్చు. ఇంత మాత్రం చేత జైళ్ళ పరిస్థితులు మారిపోయినవని చెప్పగలమా? నిన్న, మొన్నటివరకూ జాతీయోద్యమ ప్రభావమే సోకని హైదరాబాదు రాష్ట్రమే ఒక పెద్ద కారాగారంగా వుంటూండేది. అందుచేత అక్కడి జైళ్ళలో గాలి, వెలుతురు మొదలైన అతి సాధారణ సౌకర్యాలు లేకపోవడంలో ఆశ్చర్యమేమీ లేదు. కానిరాష్ట్రంలోని మిగతా జైళ్లు ఎంతవరకు సంతృప్తికరంగా వున్నవి?

* * *

మిగతా రాష్ట్రాలమాట అలావుంచినా, ఉత్తర ప్రదేశలోని కొన్ని జైళ్లతో పోలిస్తే మన రాష్ట్రంలోని జైళ్ళ పరిస్థితి ఎలా వున్నదో బోధపడుతుంది.

గత సంవత్సరం సరిగా ఈ రోజులలోనే ఉత్తర ప్రదేశ్ లోని రెండు ఉత్తమ కారాగారాల పరిస్థితులను నేను స్వయంగా చూడడం సంభవించింది. వీటిలో ఒకటి బారెల్లీ పట్టణంలోని బాలనేరస్థుల జైలు. ఇది దాదాపు పాతిక ఎకరాల ఆవరణంలో వున్న బ్రహ్మాండమైన జైలు. మొదట దీన్ని ఆడఖైదీలకోసం ఉద్దేశించి, 68 ఏళ్ళక్రితం (1889 లో) ఏర్పాటు చేశారు. ఉత్తరోత్తరా బాలనేరస్థుల కారాగారంగా మార్చివేశారు. పది మొదలు పంధొమ్మిదేళ్లలోపు వయస్సువున్న పిల్లవాళ్లను మాత్రమే ఇందులో చేర్చుకుంటారు. గత ఏడాది చూసినప్పుడు, అక్కడ పదేళ్ళ వయస్సుగల పిల్లలుకూడా కొంతమంది వున్నారు. జైలు ఆవరణంలోనే బాల నేరస్థుల జీవనోపాధికి ఉపయోగపడే వృత్తులు నేర్పడానికి ఒక పాఠశాల వుంది. అందులో వడ్రంగం, చేనేత, చిత్రలేఖనం మొదలైన వాటిని నేర్చుకోవచ్చు. ఒక విశాలమైన నాటకశాల, ఆటస్థలం కూడా అదే ఆవరణంలో వున్నవి. ఖైదీలలోనే కొంతమంది బ్యాండు వాయిద్యాన్ని తీరిక సమయంలో అభ్యసిస్తుంటారు. తమ జైలు పరిస్థితులను చూడడానికి వచ్చే అతిథులకు బ్యాండు వాయిద్యంతో స్వాగతం చెప్పి, గౌరవాభివందనం సమర్పిస్తారు. నాటకశాలలో నాటకాలు ప్రదర్శించి ఆహ్లాదం కలిగిస్తారు. ఈ జైలు సూపరింటెండెంటు శ్రీ ఎస్. ఎం. హాఫిజ్ (ఇప్పటికీ వారేపని చేస్తున్నారనుకుంటా) అక్కడ వృత్తివిద్యలలో నేర్పరితనం సంపాదించిన బాలఖైదీలకు, బారెల్లీ సమీపంలోనే వున్న ఇజత్ నగర్ పశువైద్యపరిశోధనా కేంద్రంలోగాని, అక్కడేవున్న కేంద్ర ట్రాక్టర్ కర్మాగారంలోగాని, ఇతరత్రా గాని, తగిన ఉద్యోగాలు ఇప్పిస్తుంటారు. ఖైదీలు జైలు విడిచి ఆయా సంస్థలలో ఉద్యోగాలు చేయడానికి వెళ్ళేటప్పుడు, వారి వెంట ఏ విధమైన పోలీసు బందోబస్తు వుండదు. పనిలోకి వెళ్ళిన ఖైదీలు సాయంత్రమయేసరికి వాళ్లింతట వాళ్లే తిరిగి జైలుకు ఇళ్లకువచ్చినట్లు వస్తుంటారు. హత్యాభియోగానికి జైలులోవుంచిన ఒక కుర్రవాడు, ఉన్నత విద్యాభిలాష సూచనలను కనబరిచినందున, అతణ్ణి పట్టణంలోని కాలేజీలో చేర్చారు. జైలులో వుంటూనే పట్టభద్రుడై ప్రస్తుతం ఒక ఉన్నతపాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్నాడు. ఇద్దరు కుర్రవాళ్లు ఒక చెరువులో ఈతకొట్టడానికి ఒకేసారి దిగారట. ఇద్దరూ ఒకేసారి ఈత పూర్తి చేసి బయటికి రావాలని ముందుగానే ఒక ఒప్పందం చేసుకున్నారట. ఒప్పందంమాట మరిచిపోయి, ఇద్దరిలో ఒకడు గబగబా బయటికి వచ్చేసరికి, రెండో కుర్రవాడికి పట్టరాని ఆగ్రహంవచ్చి ఒక పెద్దబండ విసిరి నెత్తిమీదవేసి ఆ కుర్రవాణ్ణి హత్యచేశాడట. శవం కనిపించకుండా దొంగచాటుగా దహనంచేయబోతున్న సమయంలో, నేరం కనిపెట్టి ఆ కుర్రవాణ్ణి అరెస్టుచేసి శిక్షవిధించారట. ఇతడు బాలఖైదీగావచ్చి కొన్ని ఏళ్ళలోనే పూర్తిగా మారిపోయి, విద్య నభ్యసించి ఏదో ఉద్యోగం చేసుకుంటున్నాడని చెప్పి సూపరింటెండు ఎంతో గర్వించాడు. మామూలు పరిస్థితులలో హత్యాభియోగానికి వీరు ఏ అతికఠినశిక్షనో అనుభవించవలసిందే కదా? బారెల్లీ బాలల జైలులో దాదాపు 180 మంది ఖైదీలున్నారు. వీరందరూ జైలులో వున్నట్లుగాకుండా, ఒక హాస్టలులో వున్నట్టుగా కలిసిమెలిసి సంచరిస్తుంటారు. బాలఖైదీలసహాయార్థం ఖైదీలు స్వయంగాఆర్జించి పెట్టిన డబ్బు దాదాపు 12 వేల రూపాయలవరకూ జైలు అధికార్ల ఆధీనంలో వున్నది. పండగ, పర్వంవచ్చినప్పుడేగాక, అక్కడి ఖైదీలలో అనుదినం ఉత్సాహం వెల్లివిరుస్తుంటుంది. బారెల్లీ బాలల జైలు లాంటిది మన ప్రాంతంలో మచ్చుకైనా వున్నదా? ఇకపోతే నేను చూసిన రెండోది లక్నోలోని "మోడల్ జైలు." దాని సంగతి మరొకమారు తెలియజేస్తా. ★

5-2-57 — భార్గవ]



# బుడుగు! చిచ్చుల పిడుగు

## పాపాయి కోపం ఖద

అసలు పాపాయిలు ఎందుకు?

అమ్మ ముద్దు పెట్టకుందుకు.

అందుకనే గదా పాపాయిలు మనకి ముద్దొస్తారు.

మరి అలాంటప్పుడు అమ్మ వెళ్ళి వాళ్ళని ఎత్తుకొని ముద్దు పెట్టుకోవాలి గదా. లేకపోతే పాపాయికి కోపం రాదుమరీ.

పాపం, ఆ పాపాయిలు అలా కోపం వస్తే ఎలాచెప్తారు? వాళ్ళకి తెలుగు రాదుగదా మరీ.

అందుకని వాళ్ళు వుంగా ఉంగా బావలో ఘట్టిగా ఛాలా సేపుచెప్తారు.

మరి పెద్దవాళ్ళకి తెలుగు ఒకటే ఒచ్చుగదూ. ఉంగా ఉంగా అంటే తెలీదుగా. అందుకనేమో వాళ్ళు యాడవకు పాపాయీ అంటారు.

అప్పుడు పాపాయికి ఇంకా ఛాలా కోపం వచ్చేస్తుంది. నాకు కోపం వస్తే అమ్మేమో యాడవద్దూ అంటుందేమిటీ అని ఇంకా గట్టిగా ఉంగా ఉంగా అంటారు.

అంటే, నేను అస్సలు యాడవటం లేదూ, కోపం పడుతునానూ అని అర్థం.

మరి ఇంకెలాగ? పాపాయికి కోపం అని అమ్మకి తెలీదు. అమ్మకి తెలీదని పాపాయికి తెలీదు.

మరి పాపాయి పాపం చిన్నది గదా. అందుకని అమ్మదే తప్పు. మా అమ్మమంచిదే అనుకో.

అయినా, చిన్నపిల్లలు ఎప్పుడూ తప్పు చెయ్యరుట. చిన్నపిల్లలు దేముళ్ళుట. నాన్న కొడ్తేస్తానంటాడేం, అప్పుడేమో బామ్మ



ఇలా అంటుందిలే అదీ సంగతి.

పెద్దవాళ్లే తప్పు చేసేసి ఉత్తినే అలా అంటారు అని బామ్మ చెప్పింది.

యేం, పాపాయికోపం అప్పుడెలా పోతుందంటే మరీ, అమ్మేమో యాడవకు పాపాయీ అని ఎత్తుకుని ముద్దు పెట్టుకుంటుందిగా అప్పుడూ.

యెప్పుడూ అలాగే పోతుంది పాపాయి కోపం. యవళ్లైనా ముందస్తుగావచ్చి ఎత్తుకున్నా సరే, అమ్మ వస్తే అమ్మదగ్గిరికేవెళ్లిపోతారుగదా.

ఏ పాపాయికైనాసరే వాళ్లరాధ అంటేనే ఎక్కువ యిష్టం. రాధంటే అమ్మ. నాన్నకన్నా బామ్మకన్నా, పిచికకన్నా, బొమ్మకన్నా సీ.గానపెసూనాంబకన్నా రాధంటేనే ఎక్కువ ఇష్టం అన్నమాట.

అసలు అలాగే ఉండాలిగదా మరి. ఇప్పుడు యిలాటి కద ఓటి చెప్తాను. ఆ కదకి అర్థం ఇదే.

ఒక్క పిచికకన్నా, రెండుపిచికలకన్నా, ఇంకా చెప్తే చింతచెట్టుమీద పిచికగూడుకన్నా, చెరుకుగట్టుకన్న, ప్ఫది పిచికలకన్నా పాపాయికి వాళ్లరాదంటేనే చాలా యిష్టమూ అని.

నేను రేపో నిన్ననో బాబాయికిఇలాటిఖదచెప్తే, ందస్తుగా ముఖద చెప్పాలీ, తరవాతేమో నీతి చెప్పాలీ అని చెప్పాడు. నీతిఅంటే ఏమిటో నాకు తెలీదు.

నీతిఅంటే కోత అని బాబాయే చెప్పాడు.

బాబాయి ఎప్పుడుప్పుడి సార్లేనా కోతలు కోస్తాడుట. కోత అంటే నాకు తెలీదు.

కోతసంగతి పోతేపోనీ కానీ, కథ ఏమిటంటే,

ఓ పాపాయి, వాళ్లి అన్నయ్య, వాళ్ళ రాధా. వాళ్ళందరూ ఇంచక్కా వాళ్ళ పెరట్లో పడుకుని నిదరోయారు. అంతట్లోకి పొద్దుల్న ఒచ్చేసిల్ది.

అయినా యింకా ఇంత చిన్న చల్దమామ ఆకాశంమీద ఉన్నాడు. వాడు చూట్టానికి, అచ్చు జీడిపప్పులా ఉన్నాడన్నమాట, ఆ చల్దమామ.

పాపాయేమో కళ్లు మెలిగా తెరిచి వాణ్ణి చూశాడు. ఇంకా రాత్తిరి అయిపోలేదు అనుకుని మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

అప్పుడేమో వాళ్ళరాద లేచింది. లేచి పాపాయిని చూసింది.

హాహా ఈ పాపాయి ఇంకా నిద్దరోతున్నాడు అనుకుంది. అనుకుని,—




# నీలి తెరలు

అంగర సూర్యారావు

## ఒకటవ అంకం

[స్థలం:- విశ్రాంతిభవనంలో ఒక హాలు.
సమయం :-ఉదయం 7 గంటలు.

హాలులో ఒక వైపు ఒక సోఫా, మరో వైపు రెండు కుర్చీలు వున్నాయి. మధ్య ఒక టేబిలు వుంది. హాలులోనుంచి మేడమీదికి వెళ్ళడానికి మెట్లు కన్పిస్తున్నై. దినకర్ సోఫాలో కూర్చుని తన్మయుడై ఏదో రాసుకుంటున్నాడు. రాస్తూ మధ్యలో ఆగి తిరిగి చదువుకుంటున్నాడు.]

దినకర్ :-(చదువుతూ) ప్రపంచం ఒక రంగ స్థలం. ఓ మనిషీ, నీపాత్రను బాగా అర్థంచేసుకొని నటించు. అపుడే నీవు ఉత్తమ నటుడవవుతావు. రంగస్థలంనుండినీవు నిష్క్రమించక తప్పదు. ఉన్న కొద్దిక్షణాలలోను నీ పాత్రను ప్రతిభావంతంగా నిర్వహించి కీర్తిని సంపాదించుకో.

[కుడివైపునుంచి ఆనంద్ వస్తాడు. పొట్టిగా వున్నాడు. మాసిపోయిన బుష్‌కోటు, ఫోల్డింగుల దగ్గర చిరిగిపోయిన ఫుల్‌పాంటు వేసుకున్నాడు. భుజాన్ని హోల్డాలు వుంది. దినకర్ ఒకసారి ఆనంద్ కేసి చూసి తిరిగి రాసుకుంటున్నాడు.]

ఆనంద్: (హోల్డాలు దించి దినకర్ కేసి తిరిగి చేతులు జోడించి) అయ్యా! నమస్కారం!

దిన: (అతనికేసి నిర్లక్ష్యంగా చూసి) కృత్రిమపు తెరలను తొలగించి చూస్తే నువ్వూ నేనూ ఒకటే. నమస్కరించేవాడు, నమస్కరించబడేవాడు యీ ప్రపంచంలో వుండకూడదు.

ఆనంద్: అయితే తమరెవరు?

దిన: నేనా? నేనీ మహానాటకానికి సూత్రధారుణ్ణి. మరి నీ వెవరవు?

ఆనంద్: మీ రీ నాటకానికి సూత్రధారులయితే నేను పాత్రధారుణ్ని.

దిన: నీది ఉదాత్తమైన నాయక పాత్రా? ఆనంద్ : కాదు.

దిన: వంచకుని పాత్రా?
ఆనంద్ : కాదు.

పాత్రలు

దినకర్
కిశోర్
నిరంజన్
ఆనంద్
జయరాం
వామనమూర్తి
దామోదరం
దండపాణి
చిత్ర

దిన: అయితే నీది శుద్ధ హాస్యపాత్రయి తీరాలి.

ఆనంద్: (సంతోషంతో) అద్భుతంగా కనిపెట్టారు. నేను ప్రఖ్యాత హాస్యనటుణ్ణి.

దిన: సమయం సందర్భం లేకుండా నువ్విలా రంగభూమిమీదికి రావడానికి కారణం?

ఆనంద్ : ఉదర నిమిత్తం.

దిన : దారిద్ర్యం కళను మెరుగుపెడుతుంది. కళను నాశనంచేసే శక్తి దానికిలేదు. కడుపునిండితే కళాకారుడు హాయిగా కళ్లు మూసుకు నిద్రపోతాడు. అతనిలోని కళా నిద్రపోతుంది.

ఆనంద్ : అయితే అతగాడు అర్థాకలితో మాడి చావాలనా తమ అభిప్రాయం ?

దిన : నూటికి నూరుపాళ్లు అదే నా అభిప్రాయం—ఉదాహరణకు నన్ను చూడు. రోజుకు ఒకపూటమాత్రం భోజనంచేస్తాను. ఈ విశ్రాంతిభవనానికి ఉత్తరపు కొసగది నా బస. నా గదిని ఆనుకొని మునిసిపాలిటీ వారి మురికికాలవ ఒకటి వుంది. రాత్రింబవళ్లు నా గదిలో దోమలు విశృంఖల విహారం చేస్తూ వుంటాయి. కళ్లు మూతలు పడే రాత్రిసమయంలో అవి నాకు మేలుకొలుపులు పాడతాయి. వెనువెంటనే కలం తీస్తాను —అర్థాకలి, మురికికాలవ, దోమలు లేకపోతే నేను యిన్ని ఉత్తమకావ్యాలు రాయగలిగేవాడినా ?

ఆనంద్ : ఓహో ! తమరు కవులన్నమాట ! ఓ కవిరాజా ! మీ పరిచయం కలిగినందుకు చాలా ఆనందిస్తున్నాను.

దిన : రాజులూ పోయారు : రాజ్యాలూ పోయినవి. సామ్రాజ్య శిథిలావశేషాలలా కవిరాజులు, కవిసమ్రాట్టులూ యింకా నిలిచివున్నారు. నాయనా, నేను కవిరాజును కాను. కేవలం సామాన్య భావకవిని. నన్ను అహంభావకవి అన్నా నాకేమీ అభ్యంతరం లేదు.

ఆనంద్: (విచారంగా) రాజ్యాలు పోయి

నందువల్లనే మా బ్రతుకు ఇలా రచ్చకెక్కింది.

దిన: (ఆశ్చర్యంతో) అరే భాయీ! ఇధర్ దేఖో! రాజ్యాలు పోయినందుకు ఏడ్చేవాడవు నీ వొకడవు వున్నావన్న మాట.

ఆనంద్: నేనొక్కడినే కాదు మహానుభావా! నాలాంటివాళ్లు వేలకొద్దీ వున్నారు. మా రాజాగారు దివాళాతీశారు; మా నాటక కంపెనీ దివాళాతీసింది. దానితో మేం చెట్టుకొకరం, పుట్టకొకరం చెదరిపోయాం.

దిన: విచారించకు. రోజులు మారుతున్నాయి. మరో ప్రపంచం వస్తోంది. కళ ప్రజలకోసమనే వాదం గెలిచింది. ప్రజలే కళలను పోషిస్తారు. ఆనాడే నీకళ చిరస్థాయిగా నిలుస్తుంది.

ఆనంద్: మీ మాటలు నాలో ఆశలను చిగురింప చేస్తున్నాయ్. ఆనందాన్ని కలిగిస్తున్నాయ్.

దిన: నువ్వు ప్రతి చిన్న విషయానికి ఆనందిస్తున్నావు. కనక నీ పేరు 'ఆనందం' అయి తీరాలి.

ఆనంద్: (ఆనందంలో) అత్యద్భుతంగా కనిపెట్టేశారు. నా పేరు సరిగా అదే! తమది ఎంత కుశాగ్రబుద్ధి! ఇంత తెలివిగల మీరు ఒక మంచి నాటకం ఎందుకు రాయకూడదూ?

దిన: సిరా వున్న కలం, సిగరెట్టుపెట్టె, అర కప్ కాఫీ, అరదస్తా కాగితాలు యిచ్చి చూడు. ఈ కవితాసామగ్రి లేనిదే ఎలా రాయగలను భాయీ.?

ఆనంద్: సెహభాష్! చాలా బాగా చెప్పారు. వెనుకటి కొకవి సిగరెట్టుయిస్తే శతకం చెబుతానన్నాడు. సరే దానికేం. అసలు విషయంలోకి వద్దాం. ఈ విశ్రాంతి భవనానికి ప్రొప్రయిటరుగారు ఎవరు?

దిన: వామన మూర్తిగారు.

ఆనంద్: ఆయన ఎటువంటివారు?

దిన: పరకాంత ఎదురైన తల వంచుకు పోవునతడు. కీర్తికాంతను గ్రుచ్చి కౌగలించు కొనును.

ఆనంద్: కీర్తిప్రియుడయితే మరీ మంచిది. నేను మరో నాలుగురోజులు తిష్ఠ వెయ్యవచ్చును.

దిన: చూడు భాయీ! నా మహాకావ్యం మధ్యలో ఆగిపోయి వూరుకొంది. ఒక సిగరెట్టువుంటే యిలా పారెయ్.

ఆనంద్: (దినకర్‌కు దగ్గరగా కుర్చీ లాగి కూర్చుని) ఈ వూరు నేనెప్పుడూ చూడలేదు. [జేబులోంచి సిగరెట్టుపెట్టె తీస్తాడు. యిద్దరూ చెరో సిగరెట్ వెలిగిస్తారు.]

దిన: [సిగరెట్ గట్టిగా పీల్చి] చూడక పోయినందువల్ల నష్టం యేమీ లేదు.

ఆనంద్: మా నాటకం కంపెనీ దివ్యంగా వెలుగుతున్న రోజులలో నిరంజన్ అనే యువకుడొకడు మా చుట్టూ తిరుగుతూ వుండేవాడు. అతని వేషభాషలను బట్టి ధనవంతుడని గ్రహించాం. మా నాటక మండలి రద్దవడం అతను కళ్ళారా చూశాడు. అతను నన్ను తనవూరికి రమ్మని ఆహ్వానించాడు. అందుకోసం యిప్పుడు వచ్చాను.

దిన: అతను నిన్ను ఆహ్వానించడానికి కారణం!

ఆనంద్: కొంతమంది నటులను చేరదీసి ఒక నాటకమండలి స్థాపించడంకోసం.

దిన: ఇంకా ప్రారంభదశలోనే వుంది వ్యవహారం.

ఆనంద్: ఈవూరుగురించి నాకేమీ తెలీదు. ఈవూళ్ళో నివసించే ప్రజలు ఎటువంటివారు? కళలను ఆదరించి గౌరవిస్తారా?

దిన: మావూరిని నీకు పరిచయం చెయ్యనా? మా పురవాసులెలా వుంటారో చెప్పనా? అదిగో! కనిపిస్తోంది. అదే మావూరు, ధనవంతులు, సామాన్యులు, నిరుపేదలు, వర్తకులు, నర్తకులు, దళారులు, కళాకారులు, కవులు, గాయకులు, జారులు, చోరులు, దగాఖోరులు—అపారపారావారంలాంటి మావూళ్ళో అందరూ వున్నారు.

ఆనంద్: (సంతోషంతో) ఓహో! యీపురం అన్నివిధాలా మాకు నివాసయోగ్యంగా కనిపిస్తోంది.

దిన: ఇపుడిపుడే చీకటి తెరలను తొలగించాడు సూర్యుడు. వెలుగులోకి వస్తున్నారు కొందరు. వెలుగును చూడలేక చీకటిగదులలోకి తిరోగమిస్తున్నారు కొందరు–రాజవీధి కళకళలాడుతోంది. అచట తిండి, వస్త్రం, విజ్ఞానం, వినోదం, సుఖం, శాంతి, సుందరాంగి వలపు అన్నీ వెలకుదొరుకుతాయి.

ఆనంద్: [నవ్వుతూ] హా! హా! కాళిదాసుగారి గంధర్వనగరం కంటె మీపురమే బాగుంది.

[ఎడమవైపునుంచి దండపాణి వస్తాడు. లావుగా, పొడవుగా వుంటాడు. ముఖంలో అజ్ఞానం కనిపిస్తూ వుంటుంది.]

దండపాణి: ఏమండోయ్ సార్! ఇక్కడ మీరు గోలాగీలా సెయ్యడానికి వీల్లేదు. కొన్ని సెణాలలో ఇక్కడికి పెద్దలొస్తున్నారు.

ఆనంద్: పెద్దలనగా ఎవరు? ఈవూరికి పెద్దలా? రాష్ట్రానికి పెద్దలా? లేక దేశానికి పెద్దలా?

దండ: ఓహో! బాగుందయ్యోయ్ యవ్వారం! నీతో సోదేసు కూర్చోడానికి నాకు తీరుబాటు లేదు. పెద్దలంటే పెళ్ళి పెద్దలు.

దిన: మీ ప్రొప్రయిటరుగారు తిరిగి పెళ్ళి చేసుకుంటున్నారా?

దండ: ఛ! లేదు బాబూ! అమ్మాయిగారి పెళ్ళికోసం.

చిత్ర: (నేపథ్యంలోంచి కోపస్వరంతో) దండపాణి! దండపాణీ.

దండ: (హాలు ప్రతిధ్వనించేలా బిగ్గరగా) ఇక్కడ వున్నానండి అమ్మాయిగారూ!

చిత్ర: (నేపథ్యంలోంచి) యు! ఫూల్! కమ్ హియర్!

దండ: (బిగ్గరగా) అదేంటో సరిగా నాకు తెలవలేదండి. పువ్వులు తెమ్మంటారా?

[చిత్ర మేడమెట్లు దిగి బిరబిరా వస్తుంది. ఎత్తు మడమలజోడు, జార్జెట్ చీర, పెదవులకు 'లిప్ స్టిక్' ఎరుపు, రెండు జడలు—నవనాగరికత అంతా ఆమెలో ప్రతిఫలిస్తోంది. ఆమె ముఖంలో చురుకుతనం, తెలివి కనిపిస్తాయి.]

చిత్ర: (కోపంతో) ఇండియన్సుకు 'పంక్చ్యుయాలిటీ' తెలియదు. సరిగా ఏడు గంట లయ్యేసరికి నువ్వు నా టేబిల్ మీద కాఫీ ఎందుకు పెట్టలేదు?

దండ: (భయభక్తులతో) పెళ్ళి తొంద



# ★ నీలి తెరలు ★

రలో పడి మరిచిపోయా నమ్మాయిగారు. యిప్పుడే తెస్తాను.

(తొందరగా కుడివైపు నిష్క్రమిస్తాడు.)

ఆనంద్: [దినకర్ తో] ఇండియన్సును విమర్శిస్తోంది. అమ్మాయి యూరోపియన్ కాదుగదా?

దిన: కాదు. ఇంతవరకూ యీమె యూరోపియన్ స్కూల్లో చదువుకొంది.

చిత్ర: (ఆనంద్ కేసి ఒకసారి నిర్లక్ష్యంగా చూసి దినకర్ తో) మిస్టర్, దినకర్! నిన్న మీరిచ్చిన తెలుగు పుస్తకం కొంత చదివాను. సరిగా బోధపడలేదు.

దిన: పద్యకావ్యంలో వున్న విశేషమే అది. చదవగానే భోధపడిపోకూడదు.

చిత్ర: అసలు తెలుగుపుస్తకం ఒక్కసారి చదవడమే వేస్ట్ ఆఫ్ టైం! నాలుగైదుసార్లు చదవడం కూడానా! మై గాడ్!

ఆనంద్: తెలుగురాని వాళ్లు తెలుగు పుస్తకం ఎలాగూచదవరు. ఇంగ్లీషు చదివిన తెలుగువాళ్ళు తెలుగు పుస్తకంకేసి చూడనైనా చూడరు. అందుకే తెలుగురచయిత యీనాడు అరకప్పు కాఫీకి దిక్కులేక అలమటిస్తున్నాడు.

[దండపాణి ట్రేతో కాఫీ తీసుకొని కుడివైపునుంచి వస్తాడు.]

దండ: ఏమండోయ్ డింకర్ బాబుగారూ ఒకగంటసేపు మీ రీ హోలు కాళీసెయ్యాలి.

చిత్ర: నో! నో! లెట్ దెమ్ సిట్!

(అర్థంకాక దండపాణి నోరు తెరచి చూస్తాడు.)

ఆనంద్: పాపం! అర్థంకాలేదు. నేను తెలుగులో అనువాదంచేసి చెబుతాను. [చిత్రను అనుకరిస్తూ] 'వద్దు! వద్దు! వారిని కూర్చుండనిమ్ము!'—అంటున్నారు.

దండ: (కోపంతో ఆనంద్ కేసి చూసి) చాలు చాల్లేవయ్యా నువ్వు చెప్పొచ్చావు. అది అయ్యగారి ఆర్డరు అనుకున్నావా? మరొకరేమైనా అనుకున్నావా? నీ గదిలో కెళ్ళి కూర్చో.

ఆనంద్: నే నింకా గది తీసుకోలేదు.

దండ: మేనేజరుగారి దగ్గరకెళ్లి రాయించుకో.

ఆనంద్: ఆయన ఎక్కడ వున్నాడు?

దండ: ఓహో? నీకో అంతా ఎకసెక్కంగా వుందే, నేనొచ్చి తీసికెళతాను. వుండు.

[దండపాణి ట్రేతో మేడమీదికి నిష్క్రమిస్తాడు.]

చిత్ర: దినకర్. మీరు కాఫీతాగారా?

దిన: [పుస్తకంలోంచి తలపైకెత్తి] లేదు.

చిత్ర: ఎందుకు తాగలేదు?

ఆనంద్: కవిగారి హృదయం బరువుగాను, జేబు అతి తేలికగాను వుండడమే కారణం.

చిత్ర: [ఆశ్చర్యంలో] కాఫీకి డబ్బులు లేనివాళ్లు కూడా వుంటారా?

దిన: నీకు యింకా యీ ప్రపంచంతో పరిచయం లేదమ్మా, తిండిలేక రోజులకొద్దీ పస్తులువున్నవాళ్ళు, వుండడానికి కొంప లేనివాళ్ళు, శరీరంలోని శక్తి నశించి జీవనయాత్రలో అడుగు ముందుకు వెయ్యలేనివాళ్ళు—అభాగ్యులు, అనాధులు వేలకు వేలున్నారమ్మాయీ యీ లోకంలో.

చిత్ర: కొందరు ధనవంతులు, మరికొందరు దరిద్రులు అవడానికి కారణం ఏమిటి?

ఆనంద్: మీ పాశ్చాత్య విద్యాలయాలలో—బుర్ర బద్దలుకొట్టుకున్నా—యీ ప్రశ్నకు జవాబు దొరకదు.

(దండపాణి మేడమీదినుంచి తిరిగి వస్తాడు.)

దండ: అమ్మాయిగారూ! నాన్నగారు పిలుస్తున్నారు.

చిత్ర: మిస్టర్ దినకర్! రండి. ఈ వేళ మీరు కాఫీ నాతో తీసుకోండి.

(ముందు చిత్ర వెనుక దినకర్ మేడమీదికి నిష్క్రమిస్తారు.)

ఆనంద్: (దండపాణిని క్షమించి మంచిచేసుకొనే ధోరణిలో) మిస్టర్. దండపాణీ నిన్ను యిదివరకు ఎక్కడో చూసినట్లుందోయ్. (సిగరెట్ పెట్టెలోనుంచి ఒకసిగరెట్ తీసి) సిగరెట్ కాలుస్తావా?

దండ: (ప్రసన్నుడై సిగరెట్ తీసుకొని) మెరుస్తోంది. ఏం సిగరెట్ బాబూ యిది?

ఆనంద్: (సగర్వంగా) దీన్ని కేప్‌స్టన్ అంటారులే! ఒక సిగరెట్ ఖరీదు ఒక అణా మాత్రమే!

దండ: (ఆశ్చర్యంతో) అణా ఖరీదయిన సిగరెట్ కాల్చి పారెయ్యటమే! మీరు సేసే ఉద్యోగం ఏమిటి బాబూ?

ఆనంద్: నాటకాల్లో వేషాలు వెయ్యడం. డబ్బు చేతికందినరోజున పాదుషాలా ఖర్చు పెట్టడం, డబ్బు అయిపోయినరోజు ఫకీరులా తిరగడం.

దండ: (సంతోషంతో) నాకు నాటకాలంటే శానా యిష్టం. సిన్నప్పుడు సెంచు నాటకంవోళ్ళు నాకో యేసం యిచ్చారు. రాజు రంగంమీదకి పాడతావస్తాడు. ఆపాట యేదోగాని మరిసిపోయాను. నా సామిరంగా ఆ పాట యెంత మజాగా వుందనీ!

ఆనంద్: ఓహో! నీకు కూడా నాటకాలంటే యిష్టమేనా? సెహభాష్! సెంచు నాటకంలోని పాట పాడి వినిపిస్తాను.

[పాట] రాజూ వెడలెను సభకు
రవి తేజము లలరగ
రాజూ వెడలెను సభకు!

[అభినయిస్తూ పాడతాడు]

దండ: (సంతోషంతో) అద్గదీ! అదే! అదే వరస!

ఆనంద్: మిస్టర్ దండపాణి! మేం ఈవూళ్లో పెద్ద నాటకకంపెనీ ఒకటి స్థాపిస్తున్నాం.

దండ: [మొహమాటంపడుతూ] నేను ఏ యేసానికైనా సరిపోతానంటారా బాబూ?

ఆనంద్: ఓహో! దివ్యంగా సరిపోతావు.

దండ: సూడండి బాబూ! నేను యింత లావు ఇంతపొడుగు వున్నానుగదా. ఏ యేసానికి సరిపోతానంటారు?

ఆనంద్: ఘటోత్కచుడు, మాయల మరాఠీ, భేతాళుడు, మొద్దబ్బాయి మొదలైన వేషాలకు అమోఘంగా సరిపోతావు.

దండ: [ఉత్సాహాన్ని పట్టలేక] అబ్బో! యిక నేం! యీ దొండపాణి తార మారతిందన్నమాట!

[ఊహాజగత్తులో విహరిస్తున్నవాడిలా నెమ్మదిగా అడుగులు వేస్తూ మేడమెట్లు దిగి వస్తాడు దినకర్.]

దిన: [సోఫాలో కూర్చుని చేతిలోని

(55-వ పేజీ చూడండి)




# కయ్యానికి కాలుదువ్వే పాకిస్థాన్

పాకిస్థానీయుల సంస్కారమెటువంటిదో ఈమధ్య బాగా వెల్లడైంది. ఒక పాకిస్థానీ పత్రిక ఒకరోజున భారత దేశాన్ని, భారత ప్రధానినీ చెప్పరాని బూతులు తిడుతూ 19 కాలాల చెత్త రాసింది. ఇటీవలే భారత అగ్రనాయకుల ప్రతిమలను బజార్లలో ఊరేగించి, చివరికి తగలపెట్టారు. భారత రాయబార కార్యాలయాలపై రాళ్లవర్షం కురిపించారు. భారత సరిహద్దుకు మూడువందల మైళ్లదూరంలో ఒకచోట ఓ పెద్దజన సమూహం గుమిగూడి, భారతదేశం మీదికి దండయాత్రకు సిద్ధమైందట. ఐక్యరాజ్య సమితి ఏదో ఒకటి త్వరలో తేల్చేస్తుందని నాయకులు నచ్చచెప్పి జనాన్ని శాంతి పరిచారట. ఇలాగని ఒక పాకిస్థానీ పత్రిక రాసింది. ముస్లిం రాజ్యాల ధైర్య సాహసాలు, ముఖ్యంగా పాకిస్థానీ ముస్లిముల సాహసం జగద్విదితం. మధ్య ప్రాచ్యం మధ్యలో ఉన్నట్టుండి ఒకరోజున యూదురాజ్యం వెలిసింది. ఆ యూదు రాజ్యం ఈనాటికీ చెక్కు చెదరకుండా ఉంది. కిందటి ఏడాది చివరలో ఈజిప్టు మీద ముట్టడి జరిగినప్పుడు పాకిస్థాన్ మహా నాయకులు బాగ్దాద్ కూటమి సమావేశాలకు హాజరై కూర్చున్నారు. ఇస్లాం సంస్కృతిలో మునిగి తేలుతున్న పాకిస్థాన్‌లో ఇటీవల జరిగిన అసభ్య ప్రదర్శనలు చూసిన తర్వాత పాకిస్థానీలకు ఇస్లాం గూర్చి తెలుసునా అని అనుమానం కలుగుతోంది. ఇస్లాం మత ప్రవక్త జీవితచరిత్ర చదివితే, ఆయన ఎన్నడూ తన శత్రువుల ప్రతిమలను తగలపెట్టించినట్లు గాని, వారిని అసభ్యంగా తూలనాడినట్లుగాని ఒక్క ఉదాహరణ అయినా కనిపించదు. ఆ ప్రవక్త నిర్వచించిన ఇస్లాం మత ధర్మం ఒకానొక జీవిత మార్గాన్ని నిర్దేశిస్తుంది. ఆ జీవిత మార్గం ఇటీవల పాకిస్థాన్‌లో ప్రదర్శితమైన జీవిత మార్గానికి పూర్తిగా విరుద్ధమైనది. మన దేశంలోని పాకిస్థానీ కార్యాలయాలను భారతీయులు భస్మం చేసెయ్యలేదంటే దానికి కారణం భారతీయులకు దేశభక్తి లేకపోవడం కాదు. అలాచేస్తే మతకల్లోలాలు తిరిగి చెలరేగుతాయనీ, ముసల్మాను సోదరులు ధ్వంసమై పోతారనీ, ఊహిస్తున్నారు.

**శ్రీ కృష్ణ**
[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

కాని పాకిస్థాన్ ప్రభుత్వం వెనకాల ఉండి, భారతదేశాన్ని, భారత ప్రధానినీ అవమానం చేయిస్తోందన్న సంగతి మరవ కూడదు. ఒక వంక పాకిస్థాన్ మనతో చేసుకున్న ప్రతి ఒడంబడికనీ బుట్టదాఖలు చేస్తూ, మన ప్రధానిని అవమానిస్తోంది. మరోప్రక్క పాకిస్థాన్‌తో మనం వ్యాపార ఒడంబడిక చేసుకున్నాము. ఇదే చిత్రంగా కనిపిస్తోంది. పాకిస్థాన్‌తో ఈ ఒడంబడిక చేసుకోకపోతే భారతదేశానికే ఎక్కువ నష్టమని కొందరి వాదన. ఏమైనా, దేశ ప్రతిష్ఠ నేల మట్టమైపోయే పరిస్థితిలో డబ్బు లెక్కలు వేసుకుంటూ కూర్చోవడం తగదు.

* * *

## జనవాక్య సేకరణ

భద్రతామండలి చేసిన కాశ్మీర్ తీర్మానంపై ప్రపంచ పత్రికలన్నీ వ్యాఖ్యానిస్తున్నాయి. భారతీయ పత్రికలు కూడా వ్యాఖ్యలతో నిండిపోతున్నాయి. మన అభిప్రాయాన్ని చెప్పవలసినంత ఘాటుగా, ధాటిగా మనం చెప్పలేక పోతున్నామని కొందరు విమర్శిస్తున్నారు. లండన్ "డెయిలీ టెలిగ్రాఫ్" (1956 జూన్ 8) పత్రికలో సంపాదకునకు లేఖ ఒకటి ప్రచురింపబడింది. ఆ లేఖ పాఠమిది:—

"అయ్యా—కాశ్మీర్‌ను, చిత్రాల్‌ను గూర్చి బాగా తెలిసిన వారెవ్వరూ చిత్రాల్ భారతదేశపు పరిపాలనలో ఉండాలనే వాదాన్ని సమర్థించరు.

కాని ఆప్రాంత భవిష్యత్తువంటి విషయాలను జనవాక్య సేకరణ ద్వారా నిర్ధారించాలని ప్రొఫెసర్ ఎల్. ఎఫ్. రష్‌బ్రూక్ విలియమ్స్ వంటివారు సూచించడం కొంచెం తీవ్రమైన విషయమే. అసలు జనవాక్య సేకరణ ద్వారా ఏ వివాదాన్నైనా న్యాయంగా పరిష్కరించ వచ్చునని సంగతి సందర్భాలు తెలిసిన వారెవరూ చెప్పరు.

కాశ్మీరులో అధికసంఖ్యాకులైన ముస్లిముల వోటుపై ముల్లాల ప్రచార ప్రభావం ఉంటుందనేది నిస్సందేహం. ఆ వోటు ఫలితాలు కాశ్మీర్ ఆర్థిక ప్రయోజనాలకు ఏవిధంగానూ తోడ్పడవు.

# ★ న్యూఢిల్లీ లేఖ ★

అంతేగాక, 1947 లో కాశ్మీరుపై దురాక్రమణ జరిగినప్పుడు, భారతదేశం జోక్యం చేసుకోవడం పూర్తిగా న్యాయసమ్మతమైనది. భారత జోక్యాన్ని కాశ్మీర్ లోయలోని హిందూ, ముస్లిములందరూ కృతజ్ఞతాపూర్వకంగా హర్షించారు, బారమూలా, సోపూర్ మొదలైనచోట్ల జరిగిన లూటీలు, వినాశమూ ఇతరచోట్లకు ప్రాకకుండా కాపాడినందుకు భారతదేశానికి వారు కృతజ్ఞత తెలిపారు.

సైప్రస్‌ను ఉదాహరణగా తీసుకోవచ్చును. సైప్రస్‌లో జనవాక్య సేకరణ పెడితే, ప్రజలను గ్రీకు ఆర్తడాక్స్ చర్చి అధికారులు ఒత్తిడిచేస్తారు గనుక అదికేవలం నాటకంగా తయారౌతుంది.

జనవాక్య సేకరణలో మత సంస్థలకు బాగా పలుకుబడి పెరుగుతుంది. ఎవరైనా వాటికి విరుద్ధంగా వోటుచేయదలిస్తే వెలివేయ బడతాడు.

అందుచేత సరైన పరిష్కారం ఏమిటంటే—కాశ్మీర్‌ను దాని మానానదాన్ని ఒక పాతికేళ్లపాటు వదిలివేసి ఊరుకోవడం ఉత్తమం. అప్పుడు కనీసం అక్కడైనా హిందూ ముస్లిములు సోదరభావంతో శాంతంగా కలిసి మెలిసి జీవించేపరిస్థితి ఏర్పడవచ్చును.

ఇంతకీ చిత్రాల్ సంగతి వివాదగ్రస్తం కానే కాదు.

ఆర్. డెంటన్ విలియమ్స్."

ఇంతకంటే ప్రమాదభరితమైన అంశం మరోటుంది.

కాశ్మీర్‌లో మతఘర్షణలు చెలరేగితే, భారతదేశమంతటా హిందు ముస్లిమ్ సంబంధాలు ప్రమాదించవచ్చును. ఎంతో కష్టపడి ఏర్పరచిన మత సామరస్యం త్రుటిలో భగ్నమైపోవచ్చును. పాకిస్థాన్‌కు ఈ బాధ లేదు. అది మతరాజ్యం; మతద్వేషాలమీద బ్రతికేదేశం. పశ్చిమపాకిస్థాన్‌నుంచి హిందువుల్ని తోలేసింది. తూర్పు పాకిస్తాన్‌నుంచి ఇంకా తోలేస్తోంది. భారతదేశంలో ముసల్మానులు గౌరవనీయులైన పౌరులుగా ఇతరులతో సమానమైన హక్కులు అనుభవిస్తూ జీవిస్తున్నారు. ఇక్కడి ముసల్మానులకీమాత్రం గౌరవం, భద్రతా ఉన్నాయి గనకనే పాకిస్తాన్‌నుంచి బోలెడుమంది ముస్లిములే వలసవచ్చేస్తున్నారు. చూసిపోదామని వచ్చినవారు కూడా అనుమతించిన కాలానికిమించి ఇక్కడఉండిపోతున్నారు. కాని ఒకసారి మతద్వేషాలు గనక విజృంభించాయో ఇదంతా తల్లక్రిందు లౌతుంది. జనవాక్య సేకరణ జరిపితే కాశ్మీరులో జరిగేది ఇదే.

"ప్రపంచ మత ప్రవక్తలు" అనే పుస్తకం మీద బయలుదేరినఆందోళననూరుగుర్ని పొట్టబెట్టుకుంది. భారీ ఎత్తున మతద్వేషాలను రెచ్చగొడితే ఏంజరుగుతుందో దానివల్ల తెలుస్తుంది.

ఈ మతఘర్షణలదృష్ట్యా భారతీయ దృక్పథాన్ని పాశ్చాత్య రాజ్యాలకు తెలియపరచడానికి ఇంతవరకూ ప్రయత్నం జరగలేదు. మన దృక్పథాన్ని పాశ్చాత్యులు అర్థం చేసుకోవాలంటే ఆ ప్రయత్నం జరగాల్సిందే.

* * *

## కంటక కిరీటాలు

మృతవీరుల స్మారకదినం జనవరి 30-వ తేదీన న్యూఢిల్లీలో జరిగింది. వేలాది జనులు గాంధీజీ సమాధిని దర్శించారు. గాంధీజీ చెప్పిన కొన్ని విషయాలు యీనాటికీ వర్తించేవి జ్ఞాపకంచేసుకోవడం అవసరం. 1937 ఆగస్టు 7-వ తేదీన ఆయన "హరిజన్‌లో ఇలా వ్రాశారు.

"నాకు ఉత్తరాలు రాసే వ్యక్తులు చాలమంది, మంత్రిపదవులు తమ త్యాగప్రతిఫల

(48-వ పేజీ చూడండి)

(డిటెక్టివ్ కథ)

# ఆ రోజున 'బ్లేజ్‌వాడ'లో

శ్రీ రామమూర్తి



విజయవాడ—పాత బెజవాడ—నిజంగా బ్లేజ్‌వాడే! పైన చురచురలాడే ఎండ—కింద సిమెంట్ రోడ్డుమీదపడి మొహం మీదకు ఎగదన్నే ఎండ. ఈ చెవిలోంచి ఆ చెవిలోకి రివ్వున వీచి మస్తిష్కాన్ని శుష్కింపజేసే వెచ్చని వడగాలి...మాడ్చేస్తోంది ఎండ! అదేం విచిత్రమో ఈ వేడికి ఒళ్లు ఓవంక కాలిపోతూనే ఓ చెంప చమటలు కక్కుతోంది—ఓవంక విలవిల్లాడిపోతూనే చిటచిట్లాడిపోతోంది దేహం...

ఇంటి దగ్గర్నుంచి బయల్దేరి ఇరవై గజాలైనా దాటని రామానుజం అప్పుడే చికాకు పడసాగాడు. కుర్రవెధవ—జ్వరమొచ్చినవాడు కిక్కురుమనకుండా పడుకోరాదూ? ఇప్పుడే పుట్టాలా వాడికి చిరుతిండిమీద బుద్ధి? పుట్టిందిబో—ఇవాళే ఇంట్లో రస్కు—చాక్‌లెట్ ముక్కొక్కటైనా లేకుండా పోవాలా?...

వేళాపాళా లేకుండా కుర్రాణ్ణి పట్టుకున్న జ్వరాన్ని తిట్టుకున్నాడు...అసలంతకు ముందురోజు వొళ్ళూపై యెరక్కుండా పిచ్చికోపంతో వాణ్ణి చావచితక్కొట్టి జ్వరపడటానికి కారకుడైన తన్ను తాను తిట్టుకున్నాడు...ఆరిపోతున్న పెదవులు తడుపుకుంటూ 'వుస్సు'రంటూ పేవుమెంటు ఎక్కి జయా ఎంపోరియంవైపు నడవసాగేడు రామానుజం...

స్పెషలాఫీసరుగారి పుణ్యమా అని రోడ్డు వెడల్పై పేవ్‌మెంట్లంటూ ఏర్పడ్డా ఇంకా డ్రెయినేజ్ కాలవలు తయారు కాలేదు. వాటిల్లో మునిగి తేలుతూ సవిలాసంగా తోకలాడించుకుంటూ ఐస్‌బాక్సుల్లో కూర్చున్నట్లు ఆనందిస్తున్న సూకరాల్ని చూసి రామానుజం మనసులో కొస్త ఈర్ష్యపడకపోలేదు.

జయా ఎంపోరియం అంటే అరుణాచలం షాపు. ఎనిమిదేళ్ళ క్రితం చిన్న బడ్డీ దుకాణం ప్రారంభించిన అరుణాచలం ఈనాడు గవర్నరుపేట సెంటర్లో ముచ్చటైన బిల్డింగ్ కట్టి అందులో ఓ పెద్ద వెరైటీస్టోర్స్ పెట్టాడు. పచారీ సామాన్ల దగ్గర్నుంచీ—స్వీట్స్, రస్క్స్, బన్స్, కేక్స్—పూలు, నూలు రెడీమేడ్ డ్రెస్సులు, బ్లౌజెస్, బ్రేజియర్స్, స్పోర్ట్స్, టాయిలెట్, ఫ్యాన్సీ సామాన్లు, అన్నీ బిల్డింగ్ నాలుగు పక్కలా ఏ సెక్షనుకి ఆ సెక్షను వేరే వేరే ఏర్పాటు చేశాడు. ప్రతి సెక్షనుకీ ప్రత్యేకంగా ఒకరిద్దరు సేల్స్‌మెన్ వెనక తామిద్దరమూ చదువుకునే రోజుల్లో ఎప్పుడూ మొద్దబ్బాయిగావుండే వాడికి ఈ నాడు వ్యాపారంలో ఇంత తెలివితేటలెల్లా అబ్బాయో యేమోగాని...

కథా రచయితగా నలుగురిలోనూ గౌరవం సంపాదించుకున్న రామానుజం నురుగలు గక్కుకుంటూ జయా ఎంపోరియంలోకి అడుగుపెట్టాడు. అంత ఎండలో కూడా బాగా బిజీగానేవుంది స్టోర్స్. రామానుజం తిన్నగా అరుణాచలం గదిలోకి వెళ్లాడు.

"అయ్యా అయ్యా—నమస్కారం పంతులుగారూ—రండి—మిడసరి లగ్గం పెట్టుకొచ్చారేంటి? ఇలా కూర్చోండి," అంటూ ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించాడు అరుణాచలం.

'ఆ. లగ్గంలాగే వుంది మనపని. ముందు కాసిని మంచినీళ్లు ఈ గొంతులో పోయించు, నీకు పుణ్యం వుంటుంది.' అన్నాడు రామానుజం గదిచుట్టూతా కలయజూస్తూ.

బిల్డింగ్‌కి సరిగ్గా మధ్యగావుంది గది. గదిలో ఎక్కడా గాలికూడా వచ్చేమార్గం లేదు. ఇక్కడెల్లా కూర్చోగలుగుతున్నాడో అరుణాచలం....'అబ్బ—ఈ కూపంలో నే కూర్చోలేనయ్యా. త్వరగా ఓ పాను

# ★ ఆ రోజున బ్లేజ్ వాడలో ★

రక్కులూ ఓ పావుపాను శాకొలెట్లూ కట్టించి తెప్పించావంటే ఈ తంటల్లోంచి బైటపడతాను. గాడిపొయ్యిలావున్నా రోడ్డు బాగుంది—'

అరుణాచలం 'బోయ్'చేత తెప్పించిన స్నానుడు నీళ్లూ గటగటా తాగేసి జేబురుమాల్తో ముఖం తుడుచుకొని మళ్లీ అన్నాడు రామానుజం—

'ఏమిటి అరుణాచలం! మరీ ఇంత పిసినారివైపోతే యెలా? బైట సేల్స్‌రూమ్స్‌లో వున్నాయి. నీ గదిలో ఫేన్ లేకపోవడమేం ఖర్మయ్యా?'

అరుణాచలం మొహం చిరునవ్వుతో నీటులు వారింది. ఏదో అనబోయాడు గాని అంతలోనే దక్షిణపు వైపు వింగ్‌లోంచి ఏవో కేకలు వినిపించాయి.

'ఏమిటమ్మా నువ్వనేదైతే? అసలు మా షాపుకు వచ్చి కొంటున్నందుకు సంతోషించక మమ్మల్నేదో కనికరిస్తున్నట్టు మాట్లాడతావేమిటి? ఇదేనా వ్యాపార లక్షణం? కాస్తయితే పదిరూపాయలూ నాశనమేనా?'

అని ఎవరిదో స్త్రీ కంఠస్వరం ఎవర్నో దుయ్యబడుతోంది.

అంతవరకూ చెవి అటు ఒగ్గి వింటున్న అరుణాచలం 'ఇప్పుడే వస్తాను కూర్చోండి పంతులుగారూ' అంటూ గబగబా లేచి నేప్కిన్‌తో ఇబ్బందుల అద్దుకుంటూ బైటకు వెళ్ళాడు.

మరో ఐదు నిముషాలకు ఓ పటాలాన్ని వెంటబెట్టుకుని గదిలోకి తిరిగివచ్చాడు... అసలే ఉక్క ఉడకబోస్తోంది. దానికితోడు ఈ చుట్టూ మూగిన జనం. ఓ అందమైన యువతి-ఓ చిన్న పిల్లాడు, పిల్ల-వుమన్స్ సెక్షన్ సేల్స్‌వుమన్ కమలమ్మ-కుతూహలం కొద్దీ చుట్టూమూగిన మరికొందరు కస్టమర్స్.

ఊపిరాడక చిరాకు పడుతూనే అరుణాచలం చెప్పినసంగతంతా విన్నాడు రామానుజం. తలంతా చిటచిటలాడి వెర్రెత్తిపోతోంది. ఇందుకా తానీ యెండలో పడి ఇక్కడికొచ్చింది? వీళ్ళ తగూలూ ధర్మ సందేహాలను తీర్చడానికా?...

"ఈ వ్యవహారం ఇంతటితో వదలిపెట్టడం నాకిష్టం లేదు—"

. రామానుజం తలయెత్తి ఆ మాటలంటున్న సుందరివంక చూశాడు. వయస్సు 20-22 కు మించి వుండదు. చదువుకున్న పిల్ల. కొంచెం స్థూలకాయమే అయినా అందంగా వుంది. మొహంలో మటుకు చిరాకు కోపం కొట్టవచ్చినట్లున్నాయి. చేతిలోని 'వేనిటీబ్యాగ్' మాటిమాటికీ తెరుస్తూ మూస్తూ, చుట్టూ మూగిన జనంవంక ఓసారిచూసి మళ్ళీ అంది ప్రక్కనే నిలబడ్డ కుఱ్ఱవాణ్ని నిర్దేశిస్తూ—

"ఆ దొంగముండలా అక్కడ చూడండి. వీణ్ణి ఇలా వొదిలిపెడితే ఇంకేమున్నా వుందా? దొంగని పట్టుకున్నందుకు సంతోషించక, సాడబ్బు పోకుండా దొరికినందుకు సంతోషించ మంటుందేమిటీ పెద్దమనిషి?"

కమలమ్మ ఏమీ అనలేక కిక్కురుమనకుండా నిలబడి పోయింది.

రామానుజం మనసు పరిపరివిధాల పోయింది. నిజానికి ఎందుకా అమ్మాయికంత ఆక్కసు? కమలమ్మ అన్నట్టు ఈ పళానచూస్తే ఆమె కొచ్చిన నష్టం వీసమెత్తు లేదు. పోయిందనుకున్న ఆమె పదిరూపాయలనోటు ఆమె పర్సులోనే వుందిప్పుడు భద్రంగా. ఇంకెవళ్లైనా ఐతే వ్యవహారం ఇంత సానుకూలంగా ముగిసినందుకు దేవుడికో దణ్ణంపెట్టుకుని ఇంటికి పోయేవారు. కాని, ఈవిడ మటుకు—

ఉఁహుఁ—ఎడమచేతి నడిమి వేలి గోటితో తలమీద గోక్కుంటూ రామానుజం అనుకున్నాడు—ఆమె ఎందుకంత పట్టుబట్టాలి? ఎందుకింత రభస? ఆమె చిరాకుక్కూడా కారణం ఈ ఎండ, ఉక్కేనా? వాటికి తోడు కమలమ్మ అన్న మాటతో అగ్నిలో ఆజ్యం పోసినట్లైవుంటుంది... లేకపోతే దీనిమీద ఏదైనా ప్రఖ్యాతి సంపాదిద్దామనా? ఆమె ధోరణి వింటుంటే, పాపం కళ్ళనీళ్ళపర్యంతమై నిలువునా కంపించిపోతూ తనముందు నిలబడ్డ పసికుంక గజదొంగై వుండాలి...

'మరీ దొంగ వెధవలా కనిపిస్తున్నాడు'

'పది రూపాయలు కాజేశాడా! నాలుగు తన్ని వదిలేస్తే సరి!'

'వెధవ వేలెడు లేడు—ఇప్పట్నుంచీ దొంగతనాలా?'

'పిదపకాలం...పదేళ్లు లేవు—పది రూపాయలు దొంగతనమా!'

చుట్టూ మూగిన నలుగురూ నాలుగు రకాలుగా అన్నారు.

రామానుజం అటూ యిటూ చూశాడు. తా నడిగిన రక్కులూ, చాక్లెట్లూ ఇంకా తెప్పించనేలేదా ఈ అరుణాచలం! ఈ కూపంలోంచి తక్షణం బైటపడితేగాని ప్రాణానికి సుఖంవుండదు....

సుందరి మళ్లీ రెట్టించింది—

'ఏమండీ-ఏం చేద్దాం వీణ్ణి?'

అరుణాచలం కాస్సేపు బుఱ్ఱ గోక్కున్నాడు. ఇల్లాంటి వ్యవహారాలు రోజూ జరిగేవా యేమన్నానా ఏం చెయ్యడానికీ ఓ పద్ధతంటూ వుంటానికి! కొందరు జులాయి వెధవలు అప్పుడప్పుడు చేతిదెబ్బ కొట్టేస్తూంటారు. కొందరు పట్టుబడకుండా తప్పించుకుపోతారు-కొందరు పట్టుబడి తన్నులుతిని పోతారు. కాని వీడు...పాపం, వీడు మరీ పసివాడు....

'ఎందుకండీ అల్లా నీళ్లు నములుతారు?... మీ రైనా చెప్ప రేమండీ—సంగతంతా విన్నారుగా? జరిగిన నేరంవిషయంలో అనుమానం ఏమైనా వుందా? ఒక్క క్షణం కనుమరుగయ్యేసరికి పదిరూపాయల కాగితం కొట్టేస్తాడా వీడు!—'

రామానుజం ఆమెవంక సూటిగా చూశాడు. ఇంత పెద్దరభస చెయ్యడం ఆమెకూ నిజంగా ఇష్టం వుండి వుండదు. కాని తీరా మొదలెట్టాక నలుగుర్లోనూ తనంత తాను తగ్గడమూ ఇష్టంలేదు...

'ఎందుకమ్మా అంత గొడవ? అనుమానమని ఎవరన్నారు? వాడు కాగితం కొట్టెయ్యడం నువ్వు కళ్లారా చూసినసంగతేగా-'

లేదు. ఆమె కళ్ళారా చూడలేదు. ఆమే చూడలేదు-కౌంటరువెనక వున్న కమలమ్మ చూడలేదు. ఆ సంగతి రామానుజానికి తెలుసు. ఐనా ఆలోచన పాలుపోక ఇదమిత్థమని తేల్చలేక ఏదో అనాలని అన్నాడు. ఐనా ఎద్దుల్లా వున్నారు-ఆ పెద్దవాళ్లిద్దరూ వరీ అంత బెఘరవాగా పది రూపాయల కాగితం ప్రతివాడికీ కళ్లు చెదిరేట్టు కౌంటరుమీద వదిలేసి వూరుకోవడం యేమిటి? అందులోనూ కుర్రవెధవ! ఎల్లా వణికిపోతున్నాడో భయంతో! ఎంత భయపడ్డా ఏదో పౌరుషం కనిపిస్తుంది మొహంలో...

రామానుజానికి వెంటనే తన కొడుకు 'రవి' గుర్తుకొచ్చాడు. వాడూ అంతే మొన్న-తానెన్ని దెబ్బలు కొడుతున్నా ఏదో పౌరుషంగా చూట్టమేగాని పెదవి కదిపి 'నే నెరగను నాన్నా' అనలేక పోయాడు: పాపం వీడూ అంతేనా? నిజానికి వీడూ అమాయకుడేనా? మరి-ఆమె యెందుకు నిష్కారణంగా ఇంత నిష్కరుణతో నేరం మోపుతోంది? అబ్బ-పాడు ఉక్క! ఇదొకటి అందరి మనసులూ చీకాకు పెడుతూ-! రామానుజం అన్న మాటలతో సుందరికి మరీ కంపరమెత్తినట్లుంది—

'కళ్లారా చూడాలా యేమిటండీ? కళ్లారా చూస్తేగాని నేరంకాదా? ముందు నేనో వస్తువు సెలక్ట్‌చేసుకుని పది రూపాయల కాగితం కౌంటరుమీద పెట్టాను. అంతలోనే ఇంకేదో వస్తువుమీద దృష్టిపడి అది తెమ్మన్నా నావిణ్ణి. ఒక్క క్షణంసేపు వీపు తిప్పానో లేదో-అంతే-మళ్ళీ ఇటు తిరిగేసరికి బల్లమీద డబ్బులేదు. ఈ కుఱ్ఱాడూ పిల్లా అక్కడే గుమ్మంలోనుంచుని వున్నారు. పది రూపాయల కాగితం వీడి చేతుల్లో వుంది-' అంటూ సుందరి ఆ కుఱ్ఱవాడివైపు తిరిగి అడిగింది—

'ఏం రా-అది నా కాగితమే కదూ?... ఏం?' పాపం, పిల్లవాడి నొసటిమీద, పై పెదవిపైన ఆణిముత్యాల్లా చిరుచెమటలు కమ్మాయి. వాడినోట మాట రాలేదు. అవునన్నట్టు ఒక్కసారి మాత్రం తలపైకీ కిందికీ ఆడించాడు.

'బల్లమీంచే తీశావుకదూ?' అని మళ్లీ నొక్కింది సుందరి.

ఇంకోసారి కుఱ్ఱాడు తల ఆడించాడు.

'నీ కెన్నేళ్లు బాబూ' అని అడిగాడు రామానుజం.

కుఱ్ఱవాడు అతి కష్టంమీద ఫిర్యాదిమొహంమీదనుంచి తనదృక్కులు ఊడబెరుక్కుని రామానుజంవైపు తిరిగాడు. కదిలీకదలని పెదవుల్లోంచి 'ఎనిమిది' అని నూతిలోంచి అన్నట్టు వినిపించీ వినిపించకుండా క్షీణస్వరం పలికింది. ఆ కుఱ్ఱవాడి చెయ్యి గట్టిగా పట్టుకుని వదలకుండా వున్న చిన్నపిల్లవంక చూశాడు రామానుజం. చిదిపి దీపం పెట్టొచ్చు. అప్పుడే విచ్చిన బొడ్డుమల్లెపువ్వులా ముచ్చటేస్తోంది చిట్టితల్లి. వయసుకి మించిన నల్లని నిడుపాటి శిరోజాలు పైకిదువ్వి నాపసానిలా ముడుచుకుంది. వొంటికి వేసుకున్న తెల్లపూల వసుప్పచ్చ ఆర్గండీ ఫ్రాక్ బోర్లించిన గంధపుగిన్నెలా వుంది. పాపం రామానుజం వంక భయోద్విగ్న నయనాలతో చూస్తోంది. 'నీ చెల్లాయి కెన్నేళ్లు బాబూ?' అని మళ్లీ లాలనగా అడిగాడు రామానుజం కుఱ్ఱవాడి వంక చూసి.

ప్రగాఢమైన విశ్వాసంతో తనవంక చూస్తున్న తన చిట్టిచెల్లెలువంక చూసి కుఱ్ఱవాడు ఓ గుటక వేసి—

'మూడండీ' అన్నాడు — మాట అతని గొంతులోనే వురిబోసుకున్నట్టువచ్చింది.

'ఎందుకు తీశావ్ బాబూ ఆ డబ్బు?'

కుఱ్ఱవాడు తలవంచుకుని రామానుజం కాలిబూట్లవంక చూస్తూ గొణిగాడు—

'ఏమోనండీ—'

రామానుజం నిట్టూర్చాడు, వెధవ ఉక్క!—ఓ చెంప వడ ఈడ్చికొడ్తోంది. వొంటికివున్న బట్టలమీదే చిరాకు పుట్టుకొస్తోంది. కుర్చీలో వెనక్కి జేరగిలబడి కనుబొమలు ముడివేశాడు. అసలు దోషమంతా ఈ ఎండతాపంది అని అనిపించింది. పది రూపాయల కాగితం ఆ పసికుంక ఎందుకు తీశాడో భగవంతుడికే తెలియాలి. బల్లమీద కాగితం చూడంగానే బహుశా ఐస్ ఫ్రూట్లు వాడికళ్ళముందు నృత్యంచేసివుంటాయి. ఈ భరించరాని తాపం—ఈ ఎండ వడే దీనికంతటికీ మూలం. ఆ సుందరి రౌద్రానికికూడా అదే కారణక. లేకపోతే ఆ పసికందుమీద ఆమెకేమైనా పగా?......

సుందరి తనవంక జేవురించిన కళ్ళతో చూడటం గమనించి మళ్లీ ఈలోకంలో పడ్డాడు రామానుజం. తనూ గుడ్లెర్రజేసి చూసేవాడేగాని ఎందుకో మానేశాడు. నిజంగా చూస్తానేమోనని వెంటనే దృష్టి కుర్రాడిమీదికి మళ్ళించాడు.

'ఎండ మండిపోతోందే—ఈ మిట్ట మధ్యాహ్నమప్పుడు నువ్వసలు షాపుకెందుకొచ్చావ్ బాబూ?'

# ★ ఆ రోజున బ్లేజ్ వాడలో ★

కుఱ్ఱవాడింకా వంచిన తల యెత్తకుండా రామానుజం బూట్లకేసే చూస్తున్నాడు—

'బొమ్మలు చూట్టానికొచ్చాం మండీ... మా చెల్లాయి చూస్తానని ఏడుస్తేనూ...'

'నేనేం ఏడవలా' అంది వెంటనే మరో చిన్నని కంఠస్వరం రోషంతో.

రామానుజం మళ్ళీ కొంత ముందుకి వంగి ఆచిన్నపిల్ల వల్లని విశాలమైన కళ్ళల్లోకి చూశాడు. అవును...ఏడ్చివుండదు...యీ మగధీరుడే తనకంతా తెలుసు—చూపిస్తా రమ్మని తీసుకొచ్చి వుంటాడు...

ఫిర్యాది సుందరికి వొళ్ళంతా తేళ్ళూ పాములూ పాకినట్లుంది—

'ఇహ లాభంలేదు. కేసు పోలీసుల కప్ప గించి తీర్తాను'—

అంటూ రుసరుసలాడింది.





రామానుజానికి వొళ్ళు మరొక్కసారి భగ్గుమన్నట్లయింది...అరుణాచలం కూడా ఎంత తీక్ష్ణతకి తట్టుకో లేకపోతున్నాడు. వాడి, విలవిల్లాడిపోతున్నట్టున్నాడు మనిషి. అతని బట్టతలమీద మిలమిల్లాడుతున్న స్వేదబిందువులమధ్య వున్న నాలుగువెంట్రుకలూ నాలుగు వెండితీగల్లా మెల మెల వెరిసిపోతున్నాయి. అతనూ కమలమ్మకూడా సుందరి సూచించిన దారుణ కృత్యం ఎల్లాచేయడమోఅవగాహనకానట్లు దిగ్భ్రాంతులై చెమ్మగిలిన అరిచేతులు బట్టలకు తుడుచుకుంటూ నిలబడ్డారు,...

రామానుజానికి సుందరిమీద నాలుగు క్షణాలపాటు చెప్పరాని అసహ్యం పుట్టుకొచ్చింది. ఆల్ రైట్ -ఆవిడకంతగా పోలీస్ రిపోర్టు ఇవ్వాలనివుంటే ఇచ్చుకోనీ!...

కాని...కాని...పాపం-కుఱ్ఱాడుఏకోశానా దొంగ అనిపించడంలేదు. వాడి రియాక్షన్స కూడా నేరంచేసినవాళ్ళ రియాక్షన్స కావు. ...ఇందులో ఏదో కిటుకు వుంది...ఏదో అతకటంలేదు...అంతు చిక్కడంలేదు...

కాని, తానేం చెయ్యగలడు-కుఱ్ఱాడం కొగితం తీశానని ఒప్పుకుంటుంటే...!

వెంటనే రామానుజానికి మళ్ళీ తన 'రవి' ముఖం గుర్తుకొచ్చింది. దీనంగా, పౌరుషంతో, మాట్లాడకుండా, పెల్లుబికి వచ్చే కన్నీళ్ళతో తనవంక చూసిన రవి! రామానుజం చిరాకు దిగమింగి కొంత స్థిమితంగా జాగ్రత్తగా ఆలోచించాలనుకున్నాడు.

అసలు ఏం ఆలోచించడానికీ ఏం తోచకుండా వుంది-వెధవ ఉక్క! ఇప్పుడే గనక ఈ గదిలో ఒక ఫేన్ వుంటే ఎంత బాగుండును. రేపు అరుణాచలంతో దెబ్బలాడైనా ఒకటి ఇక్కడ పెట్టించాలి-అధమం ఓ చిన్న టేబిల్ ఫేనైనా సరే!

రామానుజం బుఱ్ఱలో ఏదో కలుక్కుమంది. అదేమిటో అంతుపట్టక తలయెత్తి చుట్టూ చూశాడు. ఇంకా సుందరి మొహం చిట్లించుకుని చేతులు విసుక్కుంటూనే వుంది. ఏదో వింత ధోరణిలో పరుగిడుతున్న తన ఆలోచనలకు అంతరాయం కలగనీయకుండానే రామానుజం తను కూర్చున్న కుర్చీ వెనక్కి నెట్టి లేచి నిలబడ్డాడు. జేబులోంచి సిగరెట్ ఒకటి తీసి వెలిగించి—

'అసలీ గొడవంతా ఎక్కడ ఎలా జరిగిందో కొంచెం చూపిస్తారూ?' అన్నాడు.

సుందరి విసుక్కుంటూ వెనక్కి తిరిగి చుట్టూ మూగిన జనంలోంచి దోవ చేసుకుంటూ వుమన్స సెక్షన్ కౌంటరు దగ్గరకు వెళ్ళింది. రామానుజం కనుసన్నల ప్రకారము పిల్లలిద్దరూ కూడా ఆమె ననుసరించారు. తన పరిస్థితే

అయోమయంగా వున్నా ఆ పిల్లబాధ్యత తనదైనట్టు, అది తప్పిపోకుండా తను జాగ్రత్త వహిస్తున్నట్టు ఆ కుఱ్ఱవాడు తన చెల్లెలు చేతిని గట్టిగా పట్టుకునివున్నాడింకా.

దక్షిణపువైపు వింగులో కొంచెం చల్లగా వున్నట్లుంది. పైనుంచి వ్రేలాడుతున్న పంకాలు రెండు నీరసంగా తిరుగుతున్నాయి. కొల్లగా జేరిన జనంలోంచి దారిచేసుకుని వుమన్స్ సెక్షన్‌లోకి ప్రవేశిస్తూ సుందరి ముఖంవంక ఓసారి దృష్టి సారించాడు. ఇందాకటంత రౌద్రంగా లేనట్లు తోచింది. అసలా కూపంలోంచి బైటపడటమే ఓ పెద్ద తెలివిగలపని అనుకున్నాడు రామానుజం. ఇంకో రెండునిముషాలుకనక ఆ కూపంలోనే కూర్చునివుంటే అంతా జేరి ఆ కుర్రవెధవని అక్కడే ఉరితీయించిగాని వూరుకునే వారు కారేమో......

కమలమ్మ కూడా తన సెక్షనులో అడుగు పెట్టంగానే కొంత కోలుకున్నట్లుంది. ఇందాకటికంటె కొంత చురుగ్గా—కొంత తేరుకున్నట్టు మొహంమీద అనుకోకుండానే సెల్ఫ్‌వుమన్ లక్షణమైన ప్రశాంతత, మందహాసలేశం ద్యోతకమైనాయి. దానికి కారణం ఆమె కూర్చునే స్టూలు వెనక కౌంటరు ఎత్తునవున్న ఆసిలేటింగ్ టేబుల్ ఫేనే కావచ్చు. చూడ ముచ్చటగా వున్న ఆ 'మార్కెల్లి' ఫేన్ అర్ధ చంద్రాకారంగా అటూ యిటూ తిరుగుతూ చిత-చిత లాడుతున్న మొహాలకు కొంత చల్లటిగాలి సోకించసాగింది.

రాని చిరునవ్వు బలవంతాన పెదవుల మీదకు తెచ్చుకుని రామానుజం సుందరిని ప్రశ్నించాడు—

'ఊఁ — ఎక్కడ పెట్టారండీ మీరు డబ్బు?' ఆమె మొహంకూడా కొంత తేరుకున్నట్లున్నా ఇంకా కోపం, చిరాకు, మంకుతనం తొంగిచూస్తూనేవున్నై. ఈ అప్రయోజకుడెవడ్రా మధ్య అన్నట్లు చూస్తోంది రామానుజంవంక. అదిగాక అతనా పిల్లవాడిమీద పక్షపాతం చూపిస్తున్నట్టుకూడా గోచరించి వుండవచ్చునామెకు.

పెదవులు బిగించి ముభావంగా కౌంటరు మీద ఓ స్థలం చూపించింది.

'సరిగ్గా అక్కడేనా?'

'అవును సరిగ్గా అక్కడే అదుగో—ఆ క్యాష్‌బాక్స్ పక్కనే పెట్టాను.'

అవునని కమలమ్మకూడా తలవూపింది.

రామానుజం కౌంటరుమీద వున్న సీసామూతతీసి పిప్పరమెంట్ల పాకెట్ ఊడదీసి ఒకటి నోట్లో వేసుకున్నాడు. మరొకటి తీసి చిన్నపిల్లకు అందిస్తూ నవ్వుతూ అడిగాడు—

"పిప్పర మెంటు-పాపా!... కావాలా?"

మంత్రబద్ధలైన తన విశాలనయనాలతో



బావకోసం

చిత్రకారుడు: చావలి నమశ్శివాయశర్మ, విజయనగరము.

దాని వంకే దృష్టి నిగుడ్చి ఓ క్షణం సేపు చూసి వెన్నెల లొలకబోసే చిరునవ్వు నవ్వి కావాలన్నట్లు తీవ్రంగా తల ఆడించింది పాప.

"అందుకో మరి"

అంటూ రామానుజం పిప్పరమెంటు సుందరి చూపించినస్థలంలో పెట్టాడు.

"ఊఁ తీసుకోమరి...తీసుకు తిను" అని మళ్ళీ రెట్టించాడు రామానుజం.

తను ఉన్నచోటనుంచే పాప బల్లమీద వున్న పిప్పరమెంటు వంక ఆశగా చూసి, అన్న చేతిలోంచి తన చెయ్యి విడిపించుకుని కౌంటరుదగ్గిరికి వచ్చి చెయ్యిజాపి అందుకోబోయింది. పిప్పరమెంటు అందలేదు. ఓసారి రామానుజం వంక చూసి, ఈసారి మడమలెత్తి మునివేళ్ళమీద నుంచుని అందుకోబోయింది. ప్రచండమైన వాతాహతికి ఊగిపోతున్న సంపంగి మొగ్గల్లాగా అటూ యిటూ అల్లల్లాడాయి ఆమె వేళ్ళు. అప్పటికీ అందలేదు పిప్పరమెంటు. ఇంకా రెండంగుళాల దూరంలో వుండి పాపని ఊరిస్తోంది. రామానుజం బల్లమీదనుంచి పిప్పరమెంటుతీసి పాపచేతిలో పెట్టాడు.

ఈసారి మాట్లాడినప్పుడు సుందరిగొంతు కొంత వణికింది—

'బ్రహ్మాండంగా వుంది మీ డిటెక్షను

# ★ ఆ రోజున బ్లేజ్ వాడలో ★

దయచేసి ఇహనయినా పోలీసు స్టేషనుకి ఫోన్ చేయ్యనిస్తారా నన్ను?"

రామానుజం సమాధానం చెప్పకుండా ఆమెకళ్ళల్లోకి కొస్త తీక్షణంగా చూశాడు. ఆ చూపుల్లో ఎంత తూస్కారం ఇమిడివుందో అతనే గ్రహించివుండడు. తటాల్న జేబులోని పర్సుతీసి అందులోంచి పదిరూపాయలకాగితం ఒకటి తీసి కౌంటరుమీద పెట్టాడు. ఆ కాగితానికి అటు కమలమ్మ, ఇటు సుందరీ ఉన్నారు.

ప్రక్కన వున్న ఫేన్ గాలికి రేగిపోయి అల్లల్లాడుతున్న జుట్టు సర్దుకుంటూ కమలమ్మ అలవాటుకొద్దీ ఏం కావాలండీ అని అనబోయి అంతలోనే సంబాళించుకొని అర్థవిహీనంగా ఆ నోటువంక చూస్తూ నిలబడింది.

"మీనోటు బల్లమీద పెట్టిన తర్వాత మీరెటు తిరిగారో ఎక్కడికి వెళ్ళారో దయచేసి చూపిస్తారా?"

అని అడిగాడు రామానుజం సుందరివంకే చూస్తూ. సుందరి మాట్లాడకుండా అటు తిరిగి నోటుకు దూరంగా రెండడుగులువేసి, ఆగి, మళ్ళి ఇటుతిరిగి రామానుజంవంక నిర్లక్ష్యంగా చూస్తూ నిలబడింది.

'నువ్వు కమలమ్మా?'

కమలమ్మ తెల్లబోయి అతనివంక చూసింది. అంతలోనే అతనడిగిన ప్రశ్న అర్థంచేసుకుని గబగబావెళ్ళి సుందరికి ఎదురుగ్గా నుంచుని—

'నేనిక్కడ ఇలా వెనక్కుతిరిగి నుంచున్నాను' అంది.

రామానుజం వాళ్ళిద్దర్నీ అలావదిలేశాడు అతనిదృష్టి ఇప్పుడు పదిరూపాయల కాగితం మీదే కేంద్రీకృతమైవుంది. కౌంటరు అవతల ఎత్తయిన స్టూలుమీద వున్న ఫేన్ కుడివైపు చివరంటా తిరిగి ఓక్షణం సందేహించి మళ్ళి ఎడమవైపు తిరిగి తన అనంతమైన అర్థచంద్రాకృతి ప్రయాణం మళ్ళి సాగించింది. ఎడమవైపు చివరికి వస్తూండగా పదిరూపాయల కాగితం వున్నట్టుండి కొస్త అల్లల్లాడి నెమ్మదిగా కౌంటరు చివరకు జరిగి ఆగిపోయింది. రామానుజం సుందరివంక క్రీగంట చూశాడు. సుందరి నోటు వంకే చూస్తోంది. అకస్మాత్తుగా ఆమె నొసటిమీద చెమటలు గమ్మాయి. ఏదో అనబోయి నోరుతెరిచి అంతలో కాగితం మళ్ళి అల్లల్లాడేసరికి ఒక్కసారి ఎగవూపిరి తీసింది-ఉక్కిరిబిక్కిరై పోయినట్టు.

ఫేన్ ఆ అర్ధచంద్రాకృతి కూడా పూర్తిచేసి మళ్లీ వెనుదిరిగి తన నిరంతర నిర్విరామ ప్రయాణం ప్రారంభించింది. ఈ సారి పదిరూపాయల కాగితం కౌంటరు మీద నుంచి జారి ఇద్దరు పిల్లల కాళ్లదగ్గర పడింది. పాప దానివంక చూసి గబాల్న వంగి చేత్తో తీసి అన్నకందించింది. వాడూ యంత్రంలాగా ఆ కాగితం అందుకుని మొహంలో కమ్ముకునివున్న నిస్సహాయతకు తోడు దిగ్భ్రాంతంగా చూస్తూ రామానుజానికి అందించాడు.

'ఆబల్లమీద నుంచి కాగితం నీ అంతట నువ్వు తీసుకోలేదు—కదూ?' అని అడిగాడు రామానుజం మృదువుగా.

కుర్రవాడు అతనివంక ఓ క్షణం చూసి, ఓ గుటక మింగి తలవూపాడు.

'మీ చెల్లాయి తీసి నీకిచ్చిందిగదూ?'

ఈసారి తలవూపినప్పుడు కుర్రవాడి కళ్లు కొస్త చెమ్మగిల్లాయి.

'అదెక్కణ్ణుంచి తీశావో నువ్వు చూశావా? కుర్రవాడు మళ్ళి ఓగుటక దిగమింగి, కట్లు తెంచుకోబోతూన్న కన్నీటి పొంగు అరికట్టజూస్తూ తలతీవ్రంగా అటూ యిటూ వూపి ఒక్కసారిగా ఎక్కిళ్లుపట్టి ఏడవసాగాడు.

రామానుజం జేబులోంచి చేతి రుమాలు తీసి మోకరిల్లి కుర్రవాణ్ణి దగ్గరకు తీసుకుని గుండెలకు గాఢంగా హత్తుకుని అతని కళ్లు తుడిచి ఏం ఫరవాలేదన్నట్టు వీపుమీద తట్టాడు.

'మరి-మరి-నువ్వు తీశానని ఎందుకు చెప్పావ్ ఆవిడతో?

కుర్రవాడి ఛాతీ పొంగింది. రామానుజం వంకచూసి, తనవేలు పట్టుకుని అన్నెం పున్నెం తెలీక అమాయకంగా చూస్తున్న పాపకళ్లల్లోకి చూచి— అది—అది—అది మా చెల్లెమ్మండీ—' అన్నాడు ప్రపంచంలో అంతకంటే మరి వేరే సమాధానం లేనట్లు. రామానుజం లేచి సుందరివంక చూశాడు. ఆమె చెంపలు మరి కొస్త కెంపెక్కినట్లున్నాయి...

చెమ్మగిలిన తనకళ్లుకూడా ఆ రుమాలుతోనే అద్దుకుని మరి మాట్లాడకుండా అరుణాచలం అందించిన రెండుపాకెట్లూ ఆపిల్లలిద్దరి చేతుల్లోనూ పెట్టి, మరో రెండు పాకెట్లుకట్టించుకుని బయటకు నడవసాగాడు గబగబా.

తను మొదట్నుంచీ తిట్టిపోస్తూనే వున్నాడు. ఈ ఎండనీ ఉక్కనీనూ. అసలు నేరం అంతా వాటిదీ! ★

# పతిత జనోద్ధరణం

గత సంచిక తరవాయి

౭

వర్షాకాలం ప్రవేశించగానే ఆరుణిఆశ్రమంలో అంతటా నవనవోన్మేషం నరతెత్తింది. మోడులైపోయిన ఆశ్రమ వృక్షాలన్నీ చల్లచల్లని జల్లులలో తలలూగిస్తూ నృత్యాలు చేశాయి.

ఆరుణి ఆనాటి ఉదయం నిశ్చలధ్యాననిష్ఠలో నిరుగ్నుడై వ్యాఘ్రాజినంమీద మలిచిన స్వర్ణప్రతిమలా కూర్చున్నాడు.

అంతలో దూరదూరంగా ఒక నల్లనల్లని పిల్లమబ్బు ఆకాశం అంతటా ఆక్రమించడం మొదలు పెట్టింది. కొంతసేపటికి గంగానదీ తరంగ సంగీతంతో కలిసిన చల్లచల్లని పిల్లతెమ్మెర లాశ్రమ లతలతల లూగించాయి.

కారు మబ్బు లింకా ఆకాశం అంతా ఆక్రమించుకోలేదు. చెట కొమ్మలలోనించి బయటపడిన ఎర్రఎర్రని సూర్యకిరణాలారుణి శరీరంమీద, వ్యాఘ్రాజినం మీద ప్రసరించాయి.

తెరలు తెరలుగా గాలి వీచింది. తెరలు తెరలుగా ఆశ్రమం అంతా చల్లని చల్లని జల్లులు పడ్డాయి. అయినా అవి ఆరుణి ధ్యాననిష్ఠకేమీ భంగం కలిగించలేదు. అతడలాగే నిశ్చలంగా ధ్యానించాడు. మళ్ళీ ఒక నిమిషంలో ఇంకొక పెద్ద జల్లు పడింది.

ఆరుణి తన ధ్యానం అంతటితో కొంచెం చాలించి నెమ్మదిగా కళ్లు తెరిచాడు. ఎదురుగా ఆకాశంలో కొంత మేర కారు మబ్బులు కమ్ముకున్నాయి. కాని ఆశ్రమంలో ఎండపొడలింకా అలాగే నిల్చి ఉన్నాయి. మధ్యన మధ్యన మేఘాల కదలికలో అవి ఒక క్షణకాలంపాటు అదృశ్యమై అంతలోనే మళ్ళీ కళ్ళకుమిరుమిట్లు గొలుపుతున్నాయి.

అతని కెదురుగా కొంతదూరంలో రాగమంజరి పూలమొక్కలకు నీళ్ళుపోస్తూ నిలబడింది. అప్పుడప్పుడు చిన్న చిన్న జల్లులు పడినా ఆమె అవిలెక్క చేయకుండా అలాగే ఆ పూలమొక్కలకు నీళ్లుపోస్తూ వనలక్ష్మిలా మెరిసింది.

ఆ సమయంలో ఆరుణి హృదయంలో కూడా అదేభావం స్ఫురించింది. ఒక నిమిషం ఆ భావన అతని హృదయంలో వర్షాకాల మయూరంలా పురివిప్పి ఆడింది. అంతలో దూరం దూరంగా అతనికి పురివిప్పి ఒయ్యారంగా నృత్యంచేసే రంగు రంగుల నెమలి కేక వినిపించింది. క్షణకాలం అతని దృష్టి అటువైపు తిరిగింది. ప్రాతఃకాల సూర్య కాంతిలో ధగద్ధగాయమానంగా మెరిసిపోయే ఆ నెమలిపింఛం చూడగానే అతనికి రాగమంజరి మనోహరాకృతి మళ్లీ స్ఫురణకువచ్చింది. తిరిగీ అతని దృష్టి రాగమంజరి ముఖంపై నృత్యం చేసే ముంగురులవైపు తిరిగింది.

అలాగే ఎంతో ఆహ్లాదంగా పూల మొక్కలకు నీళ్ళుపోసే ఆమె ముంగురులపై లేత లేత సూర్యకిరణాలు ప్రసరించాయి.

ఆ సమయంలో ఆమె అతనికి అచ్చంగా పురివిప్పి ఆడే నెమలిలాగే కనిపించింది. క్షణకాలం అతని దృష్టి ఆమె ముంగురులలో చిక్కుపడిపోయింది.

## ప్రాచీన గాథాలహరి

హఠాత్తుగా అతడు తన మనస్సు నిగ్రహించుకొన్నాడు. తన హృదయంలో అటువంటి భావన కలిగినందు కెంతైనా పశ్చాత్తాప పడ్డాడు.

ఇంతకుపూర్వం ఆమెవల్ల తన శిష్యుల ఏకాగ్రతకేమైనా భంగం కలగవచ్చునని ఆరుణి కొంచెం భయపడ్డాడు. కాని ఇప్పుడతని హృదయమే చలించింది. అది తెలుసుకోగానే అతని శరీరం జుగుప్సతో జలదరించింది.

'నా శిష్యుల నిష్ఠకేమైనా భంగం కలగవచ్చుననుకొన్నాను గాని చివరికీమె నానిష్ఠకే భంగం కలిగించిందే!'

అని తన మనోదౌర్బల్యాన్ని కెంతైనా మథనపడ్డాడు. మళ్లీ మనస్సు నిలవరించుకొని చండీదేవి నొకమారు మనసారా ధ్యానించుకొన్నాడు. యథాప్రకారంగా ధ్యాననిష్ఠలో పడ్డాడు. దృష్టినాసాగ్రంమీదికి మళ్లించాడు. కాని అతని ఏకాగ్రదృష్టి కెదురుగా రాగమంజరి సుందరనాసిక మాత్రమే ప్రత్యక్షమైంది. అతడు తన యావచ్ఛక్తి వినియోగించి, కొంతసేపటి వరకు ప్రాణాయామంచేసి తిరిగీ ధ్యాననిష్ఠలో ప్రవేశించాడు. ఈ మారతని ధ్యాననిష్ఠ ఎక్కడా చెక్కు చెదరకుండా నిశ్చల దీపకళికలా నిలిచింది.

ఏ. గణపతిశాస్త్రి

౮

అటుపిమ్మట వారం పది రోజులు గడిచిపోయాయి. క్రమ క్రమంగా ఆరుణి ధ్యాననిష్ఠలో బిగువు సడిలిపోయింది. ఎంత ప్రయత్నించినా అతనికా దృఢనిష్ఠ తిరిగీ సాధ్యపడలేదు.

దానితో అతనికి తన జీవితంమీద, తన దౌర్బల్యంమీద విపరీతమైన అసహ్యం కలిగింది. ఆరుణి ఏభైయోపడి దాటపోవచ్చింది. ఇన్నాళ్లనించీ కఠినమైన అసిధారావ్రతాన్నో అవలంబించి కృతకృత్యుడనైనా అని అనుకొన్నాడు.

అతడాజన్మబ్రహ్మచారి. ఎన్నడు అతని మనస్సింతగా దుర్బలమై నీరసించిపోలేదు. తన నీచ దౌర్బల్యం తలచుకుంటే అతనికి నిలుచున్నపాటుగా గంగానదిలో ఉరికి ప్రాణపరిత్యాగం చెయ్యాలని అనిపించింది. ఇక మరి అంతకన్న గత్యంతరం లేదని అనిపించింది.

ఆ సాయంత్రమే తిన్నగా గంగానదికి బయలుదేరాడు. దారిలో అతనికి చండీదేవాలయశిఖరం ఎదురుపడింది. వెంటనే లోపలికివెళ్లి ఆ దేవత పాదాలపై వాలిపోయాడు.

"తల్లీ! బాల్యం నించీ నీ పాదపద్మాలాశ్రయించాను. అచిరకాలంలోనే నీ దివ్యస్వరూపం కళ్ళారా సాక్షాత్కరింప జేసుకోగలనని ఆనందించాను. కాని ఇంతలోనే నన్నీవిధంగా ఈ మాయా మోహ జాలంలో కూలద్రోయడం నీకు న్యాయమేనా?"

అని ఆ దేవత పాదపద్మాలపై నిశ్చలంగా దృష్టి నిలుపుకొన్నాడు. క్షణకాలం పాటతని మనస్సాదేవి పాదపద్మాలలో లీనమైపోయింది.



ఆతని కెదురుగా కొంతదూరంలో రాగమంజరి పూలమొక్కలకు నీళ్లు పోస్తూ నిలబడింది.

అతని కాపాదాలేవో దివ్య తేజస్సుతో తళతళా మెరిసిపోతున్నట్లు స్ఫురించాయి. అవి శిలామూర్తిపాదాలలా కనిపించ లేదు. ఎవరో దేవతామూర్తి పాదపద్మాలలా మెరుస్తూఅతనికళ్లలో వెలుగులు విరజిమ్మాయి.

అతడు చండీదేవి స్వయంగా సాక్షాత్కరించిందని అనుకొన్నాడు. కళ్లెత్తి నఖ శిఖ పర్యంతము ఆ దేవీమూర్తి తిలకించాడు.
కాని అవి చండీదేవీ స్వరూపం కానేకాదు. అది చిరునవ్వుల పువ్వులు చిలకరించే రాగ మంజరి మనోజ్ఞమూర్తి!

దేవీ స్వరూపం ఆ విధంగా తన కళ్లె కెదురుగా స్ఫురించగానే అతని హృదయం పశ్చాత్తాపాగ్నిలో పడి దగ్ధమై పోయింది! దేవిపాదాలపై వాలిన క్షణంలో కూడా అతని హృదయంలో రాగమంజరి సౌందర్యమే సాక్షాత్కరించిది! 'నా హృదయం ఎంతగా పాడుపంకిలమై పోయింది!' అని ఒక క్షణంకాలం అతడలాగే నిర్ఘాంతపోయాడు.

ఉత్తర క్షణంలో నాలుగైదు మారులా దేవిశిలాపాదాలపై తలబద్దలు కొట్టుకున్నాడు, ఆ తీవ్రాఘాతాలతో అతని నుదురు బాగా బొప్పికట్టింది. క్షణకాలంపాటతనికి ఒంటి మీద స్పృహతప్పి పోయింది.

స్పృహరాగానే అరుణిమనస్సు బాగా కుదటపడింది. అతడొక గడియవరకు దేవీ పాద ధ్యానంలో నేమునిగిపోయాడు.

ఆధ్యానంలో అతనికేవిఘ్నమైన మనశ్చాంచల్యము కలగలేదు. అతడలాగే మరొక అర గడియవరకు నిశ్చలంగా ధ్యానించాడు. అయినా అతని మనస్సలాగే నిశ్చల దీపకళి కలానిలబడింది.

ఆ సాధనతో అతనికెంతో ధైర్యం కలిగింది. అదేక్షణంలో అతనికొక నిశ్చలసంకల్పం కలిగింది. ఆ సంకల్పం తనకు దేవి అపార కరుణవల్లనే కలిగినదని అతడనుకొన్నాడు. దేవి తన్ను విడనాడ లేదనీ తన మనోదౌర్బల్యం పూర్తిగా నిర్మూలించి

# ★ పతితజనోద్ధరణం ★

వెయ్యడానికే ఆ విధమైన అగ్నిపరీక్ష దనీ అనుకొన్నాడు.

తరవాత ప్రశాంత హృదయంతో చిరునవ్వులు చిలకరిస్తూ నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ తన కుటీరంలోనికి వెళ్ళిపోయాడు. ఆనాటి రాత్రి అతనికి గాఢంగా నిద్రపట్టింది. ఆ మరునాడు నిద్ర లేవగానే తన దృఢ సంకల్పం ప్రకారమే నడుచుకోవాలని నిశ్చయించుకొన్నాడు.

౯

దేవాలయంలోనికి వెళ్ళకపూర్వం ఆరుణికొక సంకల్పం కలిగింది. ఆరుణి మొట్టమొదటి ఆ వేళంలో గంగలో పడి ప్రాణత్యాగం చెయ్యవలెననే అనుకొన్నాడు. చండీ దేవాలయం శిఖరం చూడగానే ఆత్మహత్య మహాపాతకహేతువనీ అంతకన్న రాగమంజరినే ఏదో మిషపెట్టి ఆశ్రమం నించి పంపించివెయ్యడమే మంచిదనీ అనిపించింది. కాని దేవాలయంలో ఒక గడియసేపు ధ్యానంచేసినపిమ్మట ఆసంకల్పం కూడా అతనికంతగా సముచితంగా కనిపించ లేదు.

కామినీ కాంచనాలకు దూరదూరంగా పారిపోయి అరణ్యంలో ముక్కు మూసుకుని కూర్చున్నవారందరు తాము జితేంద్రియులమైనామని మురిసిపోతారు. కాని కించిత్తు కామినీకాంచన సంపర్కం కలిగేసరికి వారి హృదయాలన్నీ తామరాకుమీది నీటిబిందువుల వతుగా చలించిపోవచ్చును. అందుచేత కామినీ కాంచనాలకు దూరదూరంగా పారిపోకుండా వాటిసన్నిధిని నిగ్రహం అవలంబించినప్పుడే అది నిజమైన మనోనిగ్రహం అనిపించుకుంటుంది. కనకనే రాగమంజరివంటి దిక్కులేని పతితవనితను తిరిగి చంపానగరానికి పంపించివేస్తే మాత్రం ప్రయోజనమేమిటి? ఆమె సన్నిధిలోనే దృఢమైన ఆత్మనిగ్రహం అవలంబించి ఉరకలువేసుకుంటూ ముమ్మంగు కురికే ఇంద్రియాశ్వాలను నిగ్రహించాలి. అప్పుడే సముచితమైన ఇంద్రియనిగ్రహం అలవడగలదు. ఆత్మనిగ్రహంలేనినాడు రాగమంజరిని పంపించివేస్తేమాత్రం ప్రయోజనమేమిటి?

ఆరుణి సంకల్పం క్రమక్రమంగా ఆ విధంగా రూపుదాల్చింది.

ఆనాటి సాయంకాలం రాగమంజరి అతని సన్నిధికివచ్చి కూర్చుంది. ఆరుణి చూచీ చూడనట్టుగా ఆమెవైపు చూచాడు. అతనిలో పశ్చాత్తాపాగ్ని మళ్ళీ ప్రజ్వలించింది.

'వల్లమాలిన సంసారవిరక్తితో ఒక పతితవనితమరి వేరే దిక్కు లేదని నాపాదాలాశ్రయించింది. కాయశక్తులా నియమాలు, నిష్ఠలు అవలంబించింది. ఆమె చేసినప్రవర్తనలో అణువంతైనా లోపం కనిపించ లేదు. అయినా నేను ఆమె నాశ్రమం నించి పంపించి వెయ్యవలెనని సంకల్పించాను. కేవలం అది నామనస్సులో ఉదయించిన మనోదౌర్బల్యం కాకమరేమిటి?'

అని కొంచెం పరిశీలనగా ఆమె వైపు చూచాడు. రాగమంజరి కొంతసేపారుణి వైపు చూచి వెంటనే తలవంచుకొని ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టింది. ఆరుణికామెమనో వైకల్యానికి కారణం తెలియలేదు. "ఏమమ్మా ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లున్నావే!"

"ఏమీ లేదు. నాకీవేళ ఉదయమే ఒక పీడకల వచ్చింది. అది తలుచుకుంటే నాకిప్పటికీ భయంగానే ఉంది."

"అమ్మవారిని తలుచుకుంటే అన్ని పీడకలలు హరించిపోతాయి! అయినా ఏమా పీడకల?"

"నావంటి పతితలాశ్రమంలో ఉండడం సముచితంకాదని తాము నన్నీఆశ్రమాన్నించి తిరిగీ చంపానగరానికి పంపించి వేశారట! నిర్దాక్షిణ్యంగా తిరిగీ ఆ నరకకూపంలో వేశారట. అదీ నాకువచ్చిన కల. అది తలుచుకున్న కొద్దీ నాకేమో భయంగా ఉంది!

"నీకలాంటి కల ఎందుకు వచ్చింది? శిష్యులేమైనా అలాంటి మాట లనుకొన్నారా?"

"అవును? వారిద్దరి ప్రసంగం నాకుకొంచెం చూచాయగా వినిపించింది. నాలాంటి వారికి ధర్మదీక్ష ఇవ్వడం సముచితం కాదని వారొకనాడు ప్రసంగించుకుంటూంటే నా చెవిని పడింది!"

"ఎన్నాళ్ళ క్రితం?"

"నే నీ ఆశ్రమానికి వచ్చిన కొత్తలో!"

ఆరుణి కలకల నవ్వాడు.

"దానికా నీవింతగా భయపడుతున్నది. ఇప్పుడు నీకలాంటి భయమేమీ లేదులే."

అని ఆరుణి నామెనెంతో ఆప్యాయంగా ఓదార్చాడు.

ఆ ఓదార్పు మాటలు వినగానే రాగమంజరి కనుగొలుకులలో రెండు చిన్న చిన్న కన్నీటిబిందువులు నిలిచాయి. ఆమె కొంచెం గొంతుక సవరించుకుంది:

"స్వామీ! ప్రపంచంలో సమస్తము క్షణభంగురమేకదా! యౌవనము, భాగ్యభోగాలు, సౌందర్యము, అన్నీ మరుమరీచికలలాగే క్షణంలో నశించిపోతున్నాయే! అయినా ఈ జీవులీ సంసార వ్యామోహంలోపడి తల మునకలై పోవడానికి కారణమేమిటి?"

ఆమె వైరాగ్య ప్రసంగం ఆలకించగానే ఆరుణి కెవరో హఠాత్తుగా వీపుపై చరిచినట్లయింది.

తన హృదయంలో ఇన్నాళ్ళనించీ రేగిన ఆందోళన ఆమె పసిగట్టి వేసిందేమోనని మొట్టమొదటగా అతనికి కొంచెం అనుమానం వేసింది. ఆరుణి అలాగే నిశ్చలంగా ఆమె ముఖవైఖరి పరిశీలించాడు. ఆ వైఖరి కొంచెం గమనించగానే అతని అనుమానం క్రమక్రమంగా పటాపంచలై పోయింది.

'కేవలం నా నీడచూచే నేనీవిధంగా భయపడుతున్నాను.'

అని ఆరుణి తనలో తానే నవ్వుకొన్నాడు:

"రాగమంజరి! దీనిలో ఇంతగా ఆలోచించవలసిందేముంది? అంతా ఆ జగజ్జనని మాయ! హరిహర బ్రహ్మాదులుకూడా ఆ మాయావాగురలోనించి తప్పించుకొని బయటపడలేరు!"

## ★ పతితజనోద్ధరణం ★

అని ఒక్క చిన్ననవ్వు నవ్వాడు. రాగమంజరి ఆ మాటవిని బాగా తలవంచివేసింది. అయినా ఆమె చెక్కుశ్చెక్రబడిన విషయం ఆరుణి గ్రహించాడు. రాగమంజరి అలాగే తలవంచుకుని మళ్లీ అడిగింది :

"స్వామీ స్త్రీలకు మరి మోక్షాధికారం లేదా ?"

"లేకేమి ?"

"అయితే ధర్మశాస్త్రజ్ఞులు వారికి సన్యాసాధికారం ఎందుకు కలిగించలేదు !"

"సామాన్యంగా స్త్రీలకు సన్యాసాధికారం లేనిమాట నిజమే! అయితే అర్హతానర్హతాలనుబట్టి వారికి సన్యాసదీక్ష ఇవ్వవచ్చునని ఆచార్యులాదేశించారు."

తరవాత రాగమంజరి తలఎత్తి ఆరుణివైపు చూచింది: "స్వామీ! నేను సమస్తము పరిత్యజించి మీ పాదాలాశ్రయించాను. నన్ను తిరిగీ ఆ నరకకూపంలో పడద్రోయకండి!"

అని అతని రెండు పాదాలు గట్టిగా పట్టుకుంది. ఆరుణి తన పాదాలు దూరంగా తొలగించివెయ్యాలని అనుకున్నాడుగాని ఆమె గట్టిగా పట్టుకోవడంవల్ల అది సాధ్యపడలేదు :

"అమ్మా! నీవనవసరంగా భయపడుతున్నావు. నేను తిరిగి నిన్నా నరకకూపంలో తోసివెయ్యదలుచుకోలేదు. నామాట నమ్ము."

అని అనేకవిధాలుగా ఆమెనోదార్చాడు. తరవాత రాగమంజరి నెమ్మదినెమ్మదిగా అతని పాదాలొత్తడం మొదలుపెట్టింది:

"స్వామీ! నావంటి దీనురాలిని మీరు కాక ఇంకెవరుద్ధరించగలరు ?"

అని ఎంతో జాలిగా కేవలం పసిపాపలా అతనివైపు చూచి ప్రాధేయపడింది.

ఆరుణి మళ్లీ అలాటి భయమేమీ లేదని ఆమెకు గట్టిగా ధైర్యం చెప్పాడు.

మృదువైన ఆమె హస్తం పాదాలమీద పడగానే అతని హృదయం కొంచెం జలదరించింది. అతడు కళ్లుమూసుకొని చండీదేవతాధ్యానంలో పడ్డాడు. అలాంటి ఘట్టంలో నిశ్చలధ్యానం సాధించినప్పుడే సరియైన ఇంద్రియ నిగ్రహం అలవడగలదని ఆరుణికా క్షణంలో మళ్ళీ జ్ఞాపకంవచ్చింది.

అలాగే కాళ్లు పట్టినా అతని ధ్యానం ఎక్కడా చెక్కు చెదరలేదు. క్రమంగా ఇంద్రియాశ్వాలన్నీ బాగా లొంగిపోయాయని ఆరుణి ఆ క్షణంలో తన ఘనవిజయాని కెంతైనా సంతోషించాడు.

—సశేషం.

# ఇల్లు లేని ఇల్లాలు

నీలాకాశం క్షణంలో మేఘావృతమైపోయింది. ఉరుములు మెరుపులతో వర్షం కుంభపోతగాకురుస్తూవుంది. చండప్రచండంగా వీస్తున్న గాలికి పెనువృక్షాలు ఫెళఫెళమని విరిగి నేలకూలుతున్నయ్.

ఐనా యివేమీ పట్టించుకోకుండా, చీమ కుట్టినట్టయినా చలించకుండా పరమశివుడు, ఒక వృక్షచ్ఛాయను యోగనిష్ఠలో ధ్యాన నిమగ్నుడై వున్నాడు.......

పాపం! పార్వతీ దేవి సంగతి వర్ణనాతీతం! అంతవరకు శివుని సాన్నిధ్యంలో అతనిసేవ చేస్తున్నదల్లా క్షోణీపాతంగా వర్షం ప్రారంభమయ్యేసరికి, చెట్టుకు ఒకమూల నక్కిపోయింది... 'అనన్యా — లోకేశ్వరికదా' అన్నభయం, జాలిలేకుండా, వరుణదేవుడు, దేవిని పూర్తిగా తడిపి ముద్దచేశాడు ... దేవి చలికి గజగజలాడుతూ యింకొక, వృక్షసహాయానికి పరుగెత్తింది!... అక్కడి స్థితి అలాగేవుంది. వర్షం తగ్గుముఖం పట్టి, పరమశివుని ధ్యాననిష్ఠ పరిపూర్తి అయే సరికల్లా, దేవికి చలిజ్వరం వచ్చినంత పనైంది!... ఆదిశక్తికి, ఆది దేవునిమీద, ఆపలేని ఆగ్రహం వొచ్చింది!— అలాగే చకచకా నడుచుకుంటూ శంకరుని వద్దకొచ్చింది!

అప్పుడే కళ్లుతెరిచి పరిస్థితుల్ని అర్థం చేసుకుంటూ, దేవి ఉగ్రరూపం చూసి అగ్నిపర్వతం బ్రద్దలవుతుందని, లోన భయపడుతూ, పైకి చిరుహాసం చేస్తూ "ఏం దేవీ! అలా వణుకుతున్నావ్! వాతావరణం యింత చల్లగా వుంటే, స్నానం ఎలా చేశావ్! అన్నాడు చలోక్తిగా పరమశివుడు.

"మీ పరిహాసం చాలించండి!...ఇంతవరకు ఎన్ని బాధలు పడ్డానో మీకేం తెలుస్తుంది! ఎల్లకాలం మన బ్రతుకు యింతేనా చెప్పండి!...ఆదిదేవులు మీరు? మీకే తల దాచుకోడానికి ఓకొంపంటూ లేదు!...అవసరం వస్తే...మీరు అంతవారు...ఇంతవారు...మీరుతప్ప అన్యులు ఉద్ధరించలేరు" అంటూ దేవేంద్రుడులాంటి పెద్దమనుషులు మిమ్మల్ని పొగిడి, తమ పనులు నెరవేర్చుకుంటారే!...చూడండి. వాళ్లెంతటి రమణీయ భవనాల్లో వుంటున్నారో. కనీసం వారి సేవకులకున్నపాటి భవనమైనా మనకు లేదాయె...ఇటుచూడండి. ఎలా తడిసి ముద్దయ్యానో!...మనకూ ఓ కొంపంటూ వుంటే యిలా వుండునా? అన్నది స్త్రీసహజ కోపంతో.

పరమశివుడు అంతా విన్నతర్వాత, వుండలేక పకపకా నవ్వేశాడు. దానికితోడు పుల్లవిరుపుగా దేవివైపు క్రీగంట చూశాడు. ముఖం చిట్లించి పక్కకు తిప్పుకొంది.

"చూడు దేవీ! ఎందుకంత ఆగ్రహం? కొండగుహల్లోనూ, చెట్ల నీడల్లోనూ, వుంటే కాలం గడిచిపోదూ? మనకు భవనాలు, భోగభాగ్యాలు దేనికి చెప్పు, ముక్కు మూసుకొని తపస్సు చేసుకొనేవారికి కావలసింది ముక్తిగాని...రక్తితో కూడుకున్న ఈ ఆడంబరాల సంబరాలు దేనికి చెప్పు!" అంటూ నచ్చజెప్పబోయాడు.

ససేమిరా, వినమంటే వినదంది. "మీరు ఎన్నయినా చెప్పండి. మనకు భవనంవుండాల్సిందే. వానకు తడిసి, ఎండకు ఎండేకర్మ మనకేం పట్టిందండి?" అన్నది పార్వతి.

***************************

## శింగంపల్లి అప్పారావు

***************************

అంతటి దేవాదిదేవుడు కిమ్మనలేకపోయాడు...ఆడవాళ్ళ మాట కాదనడం గానీ, వారియిష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించడం గాని ఈనాటిది కాదు...ఆనాడూ లేదుమరి...అంచేత దేవిమాట త్రోసిరాజనలేక "సరే...నీయిష్టం. అనుజ్ఞయిచ్చాను ఎలాగైనా చేసుకో," అన్నాడు పరమశివుడు.

ఇకనేం, పార్వతికి పర్వతమంత భవనములో, తూగుటుయ్యాల మీద కూర్చుని, తులతూగుతున్నట్టనిపించింది.

కంటున్న కలల్ని పక్కకునెట్టి విశ్వకర్మకు కబురు పంపించింది. అతగాడు రాగానే "ఇదిగో! కైలాసంలో సుందర రమణీయ భవనం, అన్నిహంగులతో త్రిభువన భవనాలను తలదన్నేట్టుగా నిర్మించాలి" అంటూ ఆజ్ఞాపించింది.

ఆదిశక్తి ఆజ్ఞాపించడంతో, విశ్వకర్మ వినమ్రుడై, తలవంచి నమస్కరించి "అలాగే తల్లీ" అని శలవుతీసుకొని, పనివాళ్ళను రప్పించి, కైలాసంలో భవననిర్మాణానికి పూనుకున్నాడు.

కొన్నాళ్ళకు విశ్వకర్మ భవననిర్మాణం పూర్తిచేశాడు—

"ఎన్నడు చూద్దునా" అని తహతహలాడుతున్న త్రినేత్రుని అర్థాంగి వచ్చి, తన భవనాన్ని చూసి, సంతోషంపట్టలేకతిన్నగా పరమశివుని పజ్జకు చేరుకుంది.

"కోరిక తీరిందికదూ!...ఎలాగైనా, ఆదిశక్తివి!" అన్నాడు ముక్కంటి నవ్వుతూ!

"భవనం తయారవగానే, కోరిక తీరినట్టేనా?...మనం, అందులో గృహప్రవేశం చేయాలి...రకరకాల వస్తుసముదాయాన్ని సేకరించుకోవాలి... యింకా ...యింకా"

పరమశివుడు మధ్యలోనే పార్వతిమాటను త్రుంచేసి "ఐతే దేవి నాకు తెలియకడుగుతాను...నీతొందర నీదేకాని, వెనకా ముందూ ఆలోచించడం లేదా- లేక లేకగృహప్రవేశం చేస్తున్నామాయె. నలుగురు పెద్దల్ని ఆహ్వానించాలా... అఖర్లేదా?-వేదోక్త ప్రకారం, ముహూర్తం పెట్టించి, పూజా అదీ...వేదాచార్యుడు, అన్నీ తెలిసినవాడి చేత చేయించాలికదా!" అన్నాడు.

"దానికేముంది! సమస్త దేవతలకు ఆహ్వానాలు నేను పంపించే ఏర్పాటు చేస్తాను... నాకు తోడుగా లక్ష్మీ, సరస్వతులు రానే వస్తారు. ఇక వేదాచార్యుడి విషయమంటారా...అదంతా మీరే చూసుకోండీ!" అన్నది భోలానాథుని భార్యామణి.

పరమేశ్వరుడు అరనిముషం ఆలోచించిచూద్దానికేముంది. నాకు పరమభక్తుడు, సకలశాస్త్రపారంగతుడు అయిన రావణాసురుడు ఉండనే వున్నాడు. అతనొక్కడే దీనికి సమర్థుడు!" అని చెప్పాడు.

రావణాసురుడు దేవతల్ని గజగజలాడించే రాక్షసుడు ... పరమనీచుడు ... దుర్మార్గుడు...అని పార్వతికి తెలుసు! కాని శంకరుడు ఏరికోరి వాణ్ణే పిలిపిస్తానంటే ఎలా కాదంటుంది. ఇష్టం లేకపోయినా అంగీకరించింది.

"సరే రోజూ నేను లంకకు వెళ్తూనే వున్నాను. రేపు వెళ్ళినపుడు అతనిచేత ముహూర్తం పెట్టించుకొని, పూజచేయడానికి అతన్నే ఆహ్వానించి వస్తాను," అన్నాడు శంకరుడు.

# ★ ఇల్లు లేని ఇల్లాలు ★

## 2

సకల మునిగణం, బ్రహ్మాదిదేవతలు పార్వతిపంపిన ఆహ్వానాలు అందుకున్నారు. చెప్పొద్దూ అందులో కొందరికి, పార్వతి భవనంలో వుండడమే మిటి...అన్న అసూయ పుట్టుకొచ్చింది...కొండల్లో తిరిగే వాళ్లు, ఆకు అలము తిని అడుక్కుంటూ వుండేవీరికి భవనమేమిటి...విడ్డూరం గాక పోతేను అని మరికొందరు ముక్కులమీద వేలేసుకున్నారు...ఎలాగైతేనేం వీరి ఆతిథ్యం రుచిచూద్దామనో పార్వతి కట్టించిన భవనం చూద్దామనో ఆహ్వానాలు అందుకున్న తక్షణం. బయలుదేరి చక్కా వచ్చారు.

కైలాసమంతా కన్నులపండువుగావుంది. అతిథులకు స్వాగతం చెప్పడంలో పార్వతికి తీరిక లేకుండావుంది!

"చక్కటిభవనం కట్టించావక్కా! చూడ ముచ్చటగావుంది ... మా భవనాలూ వున్నాయ్...వెలవెలపోతూ," అన్నది సరస్వతి.

పార్వతి లోలోన, వుబ్బితబ్బిబ్బయింది. కానిపైకి చప్పగా "ఏదో లేవమ్మా..మాకు యిల్లంటూ ఏర్పడింది యీనాటికి: మీ సుందరమందిరాలంత, ధాటిగా లేకపోయినా, ఏదో తల దాచుకోడానికో కొంప," అంది.

లక్ష్మీసరస్వతులు మూతులు ముడుచుకున్నారు.

పూజ ప్రారంభమైంది. ఆదిదంపతులిద్దరూ పీటలమీద కూర్చున్నారు. రావణుడు మంత్రాలు చదువుతూ, వేదోక్తప్రకారం పూజ అయిందనిపించాడు. పార్వతి, పీటల మీదనుంచి లేచివెళ్ళి అతిథులకు ఫలహారాలు పంచిపెట్టడంలో నిమగ్నురాలైంది. శంకరుడు లేచి యింట్లో కాలుపెట్టబోయాడు.

వెంటనే రావణాసురుడు అడ్డుతగిలాడు. "దేవా! మీ కిది ఉచితమేనా? పూజ చేయించిన ఆచార్యుడికి, దక్షిణ యివ్వకుండా, గృహప్రవేశం చేయమని ఏశాస్త్రంలో వుంది. అన్నీ తెలిసిన మీరే ధర్మం తప్పుతారా?" అంటూ నిగ్గదీశాడు.

భోలానాథుడు ఒక్కక్షణం నివ్వెరపోయాడు. రావణుడు తనభక్తుల్లోకల్లా అగ్రగణ్యుడు! అలాంటివాడే దక్షిణ అడుగుతున్నాడే!

"రావణా! నీకు తెలియనిదేముంది. నాలాంటి నిరుపేద యీ ముల్లోకాల్లోనే లేడు. చిల్లిగవ్వ లేనిబికారిని. అంతగా దక్షిణ అడుగుతున్నావు కాబట్టి... వెనకా - ముందూ అన్నారు. "రెండుమూడు రోజుల్లో నీ దక్షిణ నీకు అందేలా చూస్తాను." అంటూ పరమశివుడు ప్రాధేయపడ్డాడు.

"అదేం వీలుపడదు స్వామీ! దక్షిణ యివ్వకుండా గృహప్రవేశం చేశారంటే, పూజాఫలం మీకు దక్కదు. సర్వానర్థాలు సమకూడుతాయి. ఆ తర్వాత మీ యిష్టం." అని, నిక్కచ్చిగాకుండ బద్దలుకొట్టినట్టు చెప్పేశాడు.

దాంతో మహేశ్వరుడికి మతి పోయింది. 'ఏమిటీ రావణుడు! దక్షిణ యివ్వకపోతే ఫలమే దక్కదంటున్నాడు.' అనుకుంటూ, గబగబా దేవి వద్దకు పరుగెత్తుకుంటూ వెళ్ళాడు.

అతిథులతో యిష్టాగోష్ఠి నెరపుతూ, సంతోషసాగరంలో యీదులాడుతున్న పార్వతి, "అదేమండి. అంత ఆదుర్దాగా వచ్చారు," అన్నది భర్తను చూసి.

"ఇంకా ఆదుర్దా అని అడుగుతున్నావా? కొంప మునిగింది. తెలిసిన భక్తుడుకదా ఆ మాత్రం పూజ చేయించకపోతాడా అనుకుంటే దక్షిణ యివ్వనిదే గృహప్రవేశం చేయడానికి వీల్లేదంటున్నాడు" అని చెప్పాడు శంకరుడు.

పార్వతీ దేవి పకపకానవ్వి "భలేవారండి! దానికి యింత కంగారు దేనికి? శుభమా అని గృహప్రవేశం చేస్తున్నాము. పాపం అతన్ని కూడ మనం సంతోషపెట్టాలి. ఏం కోరుకుంటే అది నెరవేర్చండి." అని సలహా యిచ్చింది. అది శంకరుడికి నచ్చింది. తిన్నగా రావణుడివద్ద కొచ్చి "రావణా! నీవు కోరుకున్న వరం యివ్వమని దేవి చెప్పింది. కాబట్టి ఏం కావాలో కోరుకో," అన్నాడు.

రావణాసురుడు వినయంగా చేతులు జోడించి "దేవా! నా రాజ్యంలో బ్రహ్మాండమైన భవనాలున్నాయి...మూడు లోకాల్లోనూ, నా భవనాల్ని తలదన్నే భవనం యింకొకటి లేదు. కాని, మీరు కట్టించిన యీ భవనంముందు, నా భవనాలు, ఎందుకూ కొరగావు. కాబట్టె నాయందు దయ గ్రహించి యీ భవనం నాకు దక్షిణగా యివ్వండి. చాలు!" అన్నాడు.

రావణాసురుడి కోరిక వినగానే మహేశ్వరుడికి మతి పోయింది...ఇవ్వనంటాడా!

అడితప్పడం ఆదిదేవుని తరమా !...భక్తుల కోర్కెలు తీర్చడమేకదా ఆయన పని.

"రావణా ! అనుగ్రహించాను. అలాగే తీసుకువెళ్ళు," అన్నాడు.

దేవతలంతా "అయ్యో, పాపం !" అన్నారు. ఈ దుర్వార్త ఆనోటా ఆనోటా పార్వతికి తెలిసింది...ఇంకే ముంది! రంయ్ మంటూ గాలిలా వచ్చింది.

"ఏమయ్యా రావణా! యిదేనా నీ నిర్వాకం ? తెలిసినవాడివని పిలిస్తే మా కొంపకే ఎసరు పెట్టావు. ఐనా మీ రాక్షస జాతిని నమ్మడం మాది బుద్ధి తక్కువ," అన్నది.

ఆదిశక్తికి ఆగ్రహం వచ్చిందని ఎవరూ ఏమీ మాట్లాడలేక పోయారు. పాపం శంకరుడు శాపం తిన్న మానవుడిలా అయిపోయాడు.

"ఏమండీ! ఏమిటిదంతా," అంటూ కళ్లెరిమి చూసింది.

"నన్నేం చేయమంటావ్? వాడేదికోరితే అది యివ్వమని నీవే చెప్పావు—ఇందులో నా ప్రమేయ మేముంది? ఆడి తప్పకూడదు. తీసుకుపోనీయ్. ఇలాంటి గొడవలు వుంటవనే అసలు మనకు యిల్లు వద్దని ముందే చెప్పాను. వింటేకదా !" అన్నాడు విశ్వేశ్వరుడు.

అడ్డేవారెవరు ? ఆదిదేవుడు అనుజ్ఞ యివ్వనేయిచ్చాడాయె. పునాదులతో సహా పెళ్లగించుకొని, రావణుడు, భవనాన్ని లంకాపురానికి తీసుకుపోయాడు.—

ఈనగాచి నక్కలపాలు చేసినట్టయింది పార్వతికి.

## 3

యథాప్రకారం పార్వతీ పరమేశ్వరులకు, కొండగుహలు, చెట్లు వాసస్థాన మయ్యాయి.

పాపం పార్వతికి సాటివారిలో తలవంపులయింది...ఆమె మనసు, పదేపదే పాత భవనంమీదకు పోతోంది...అదీగాక తల దాచుకోడానికి, ఓ కొంపంటూ లేని సంసారం ఏం సంసారం' అనుకుంది. మెల్లగా పరమశివుని పజ్జకు చేరుకుంది.

"ఏం దేవీ ! అలా వున్నావు ?" అనడిగాడు పరమశివుడు.

ఏం లేదండీ ! ఇల్లు లేకుండా ఎన్నాళ్లీ అరణ్యవాసం. ఎలాగైనా ఒక యిల్లు అమరేలా చూడండి." అన్నది.

ఎందుకో మరి పరమశివునికి కూడ యిల్లంటూవుండడమే 'హాయి!' అనిపించింది. అయినా పార్వతి కోర్కె తీర్చకుండా వుండలేడుకదా.

సరే, మళ్లా విశ్వకర్మకు కబురు వెళ్లింది. భవన నిర్మాణానికి మళ్లీ పని ప్రారంభించబడింది. ముచ్చటైకంటె సర్వాంగ సుందరంగా భవననిర్మాణం పూర్తియింది.

భవనాన్ని చూసి దేవి పార్వతి ఎంతో ముచ్చటపడింది. పరమశివుడు పరమసంతోష పడ్డాడు.

"ఇదిగో చూడండి. పూజలూవద్దు...పునస్కారాలూ వద్దు. ఎవరికీ ఆహ్వానాలు పంపించకుండా గృహప్రవేశం చేసేద్దాం. ముఖ్యులు కాదుగదా, అతిముఖ్యుల్ని గూడ పిలవకూడదు. ... ఆనాడు వేదాచార్యు డన్నారు...వేడుకగా కట్టించుకున్న, భవనంకాస్తా అప్పగించి వూరుకున్నారు... గుట్టుచప్పుడుగా గృహప్రవేశం చేసేద్దాం." అంటూ దేవీ పార్వతి నచ్చజెప్పింది !

సరి, ముఖ్యులకు తెలియకుండా గృహప్రవేశం జరిగిపోయింది. కాని ఎలాగో నారదుడు యీవిషయం పసికట్టేసి, ఓనాడు పనికట్టుకొని, మరీ, హడావిడిగా పార్వతి వద్దకొచ్చాడు.

"ఏంతల్లీ ! మాబోటి సన్యాసిరాయుళ్లకు భోజనాలు పెట్టించకుండా, పూజా పునస్కారాలు లేకుండా గృహప్రవేశం చేశారు! ఇప్పుడు దానివల్ల ఎంత అనర్థం వాటిల్లిందో గ్రహించారా అమ్మా. నాలుగు లోకాలు తిరుగుతుంటాను కాబట్టి సంగతి సందర్భం తెలుసుకొని ఆదరా బాదరా పరుగెత్తుకుంటూ వచ్చాను." అన్నాడు రొప్పుతూ.

అతడలా అనగానే మళ్లా కొంపకేం తిప్పలువచ్చినయ్యోనని పార్వతి భయపడిపోయింది. "ఏమిటి నారదా! వింతగా మాట్లాడుతున్నావు," అన్నది.

నారదుడు కొంతసేపు మౌనముద్ర వహించి, ఆ తరువాత విచారంగా నిట్టూర్చి "అమ్మా మీ మనసుకు బాధకలిగించాల్సి వచ్చిందేనని విచారపడుతున్నాను. అయినా

# ★ ఇల్లు లేని ఇల్లాలు ★

చెప్పక తప్పదుకదా. ఈ భవనం, నిర్మాణ దశలో వున్నపుడు దీనిపై శనికన్ను పడింది. మీ రది తెలుసుకోకుండా ముహూర్తం పెట్టించకుండా శాంతి చేయించకుండా, గృహప్రవేశం చేశారు. శనిదృష్టి పడింది కాబట్టి భవనం భస్మమైపోతుంది." అంటూ చావుకబురు చల్లగా చెప్పాడు.

దాంతో పార్వతికి హృదయం ఆగినంత పనైంది. మేనంతా చల్లబడిపోయింది. "అయ్యో నారదా! ఇప్పు డేంచేయను? ఆ భవనం అలాగైంది...ఇది యిలా కాలిపోతే, దేవతల్లో తలెత్తుకు తిరగ్గలనా. ఎంత అమర్యాద!" అంటూ వాపోయింది.

నారదుడు పార్వతి అవస్థచూసి జాలిపడి "ఏ మమ్మా! అంత బెంబేలౌతావు. శంకరుడు ముజ్జగాలను ముక్కంటితో, మాడ్చి మసి చేయగల శక్తిసంపన్నుడు. అతను తలుచుకుంటే సాధ్యం కానిదంటూ వున్నదా. పిచ్చితల్లీ పరమశివుని ప్రాధేయపడవమ్మా అన్నీ సక్రమంగా జరుగుతాయ్," అంటూ నారదుడు పార్వతివద్ద శలవుపుచ్చుకొని వెళిపోయాడు.

శంకరుడు రాచకార్యాలు చూసుకొని గూటికి చేరుకొనేసరికి పార్వతి గుమ్మంలో, దిగాలుపడి కూర్చొనివుంది.

"ఏం దేవీ! కళావిహీనంగా కన్పిస్తున్నావు—ఇంకొక భవనంమీదికి మనసు పోయిందా...చెప్పు! తక్షణం విశ్వకర్మను పిలిపిద్దాం!" అంటూ ఛలోక్తి విసిరాడు పరమశివుడు.

"ఉన్న భవనం, పూడకుండా వుంటే కొత్తది కట్టించుకున్నంత ఫలం!" అన్నది విసురుగా.

"ఏమి" టంటూ తెల్లమొహం వేశాడు భోలానాదుడు.

"అంత తెలిసినవారన్నమాటేగాని ఏదీ సరిగా ఆలోచించరు. భవన నిర్మాణ దశలో దీనిపై శనికన్ను పడిందట. మనం శాంతి చేయించకుండా గృహప్రవేశం చేశాం. శనికన్ను పడిందికాబట్టి యిది భస్మమౌతుందని తెలిసింది" అన్నది పార్వతి.

"ఓహో అదా విశేషం. బాగానేవుంది, ...గొప్ప చిక్కే నే!" అన్నాడు ఆది దేవుడు నిర్లక్ష్యంగా.

"ప్రభూ! మీరు దేవాదిదేవులు! సృష్టి స్థితి లయకారులు. మీ ఆజ్ఞను ఎవరూ ధిక్కరించలేరు."

"ఏమిటి దేవీ ఈ పొగడ్త! నన్నేం చేయమని నీ ఉద్దేశం." అన్నాడు శివుడు.

"శనైశ్చరుడివద్ద కెళ్ళండి. మీ మాట కాదనలేడు. భవనాన్ని నాశనం చేయవద్దని చెప్పండి. నన్ను నలుగురిలో తలెత్తుకు తిరిగేట్టు చేయండి," అని వేడుకుంది.

అర్ధాంగి ఆర్ద్రనయనాలు చూడగానే శంకరుడిహృదయం జాలితో నిండిపోయింది.

"చూడు పార్వతీ! ఆ శనిగాడు నామాట వింటాడనే నమ్మకం లేదు. వాడు పట్టుపట్టాడంటే ఇంతటి హరిహరబ్రహ్మాదులంగూడ తల వొగ్గాల్సిందే. అంతటి శక్తిగలవాడు. అయినా అడిగిచూస్తాను, నా మాట మన్నిస్తాడా ... అదృష్టవంతులమే ... లేకపోతే ఏం జేస్తాం ... ఫలానా శంకరునిభవనం శనైశ్చరుడు కాల్చిమసి చేశాడనే అపవాదు యుగచరిత్రలో అలా స్థిరంగా నిలిచిపోతుంది. అది మనకే తలవంపు...కాబట్టి ఒక ఉపాయం చెబుతాను...వాడు నామాట మన్నిస్తేసరి...లేకపోతే అక్కడనుంచే వీణానాదం చేస్తాను ..వెంటనే నీవు శనైశ్చరుడు రాకముందే భవనానికి నిప్పంటించు" అంటూ సలహా యిచ్చాడు.

దాని కంగీకరించింది పార్వతి.

శంకరుడు ముస్తాబై శనిలోకం బయలుదేరాడు. వృషభవాహనంమీద వస్తున్న శంకరుణ్ణి అల్లంతదూరంలోనే చూసి ... శని ఎదురువెళ్ళి, సాదరంగా తీసుకువచ్చి, తన సింహాసనంమీద, ఉపవిష్ఠుణ్ని చేసి సకల మర్యాదలూ చేసిన తరువాత "ఆదిదేవులు అవసరం పడితే నేగాని, యీ భృత్యుణ్ణి చూడ్డానికి దయచేయరు. కారణం తెలుసుకోవచ్చునా?" అన్నాడు.

పరమేశ్వరుడు పూసగ్రుచ్చినట్టు యావద్వృత్తాంతము చెప్పి "పరమేశ్వరి నీవు భవనం నాశనం చేస్తావని తెలిసి చాలా విచారిస్తూవుంది...అందుకోసమే వచ్చాను. నీ వేమంటావోనని..." అంటూ నీళ్లనమిలాడు పరమశివుడు.

"అయ్యో ఎంతమాట! మీ రింతదూరం చెప్పాలా? ఆదిశక్తికి నేను అపచారం చేస్తానా?... నేను భవనాన్ని ఏమీ చేయను. మీరు నిశ్చింతగా వుండవచ్చు." అంటూ అభయహస్త మిచ్చాడు శని.

ఉమాపతి హాయిగా వూపిరి పీల్చాడు. యీ వార్త తెలిసి పార్వతి ఎంత సంతోషిస్తుందోకదా, అని ఆనందంతో పొంగిపోయాడు. సరే, శనేశ్వరుడివద్ద శలవు తీసుకొని శంకరుడు కైలాసానికి బయలుదేరబోయాడు.

వెళ్ళబోతున్న శంకరుణ్ణి ఆపి "ప్రభూ! ఒక్కమనవి!" అన్నాడు శనేశ్వరుడు.

"ఏమిటది శనేశ్వరా!" అన్నాడు శంకరుడు.

"ఏమీ లేదు...నా దొక్క చిన్నకోరిక. మీరు వీణానాదంచేస్తుండగావిని బహుకాలమైంది... కాబట్టి తమరు ఒక్కసారి వీణానాదం చేయండి. చాలు...మీ కోరిక నేను కాదనలేదు. అలాగే నాకోరిక కాదనకండి' అన్నాడు.

అప్పుడు పరమేశ్వరుడు చాలా ఆనందంలో వున్నాడుకదూ, శనేశ్వరుడు అలా కోరడమే తడవుగా, శరీరం మైమరచిపోయేలా, వీణానాదం చేశాడు—

అక్కడ కైలాసంలో, పార్వతి కాగడా వెలిగించుకొని సిద్ధంగా కూర్చొనివుంది...

ఎప్పుడైతే వీణానాదం వినిపించిందో గభాలునలేచి "వెధవ శనిగాడు...శనిముఖం వాడూను మేమంటేనే ఎవరికీ గిట్టదు," అంటూ భవనానికి నిప్పంటించింది!

అక్కడ వీణానాదం ముగించి, పరమశివుడు కైలాసం చేరుకునేసరికి, విశ్వకర్మ విచిత్రంగా తయారుచేసిన భవనం కాస్తా కాలి, నుసినుసి అయిపోయింది.

అది చూడగానే, శంకరుడికి తను పార్వతికి సలహాయిచ్చిన సంగతి గుర్తురాలేదు.

తేలుకుట్టిన దొంగలా అసలుసంగతి చెప్పకుండావిచారంగా ముఖంపెట్టి "మాశావా! దేవీ! మనకు భవనాల్లో వుండేయోగం లేదు...లేనిది కావాలంటే ఎలావస్తుంది. పిచ్చిదానా!కొండల్లోనూ, అరణ్యాల్లోనూ, వుంటే కాలం అదే గడిచిపోతుంది. విచారించకు," అంటూ ఓదార్చాడు.

ఏంజేస్తుంది?... 'నిజమేమరి, లేనిది కావాలంటే ఎలావస్తుంది' అనుకొని సమాధానపడింది పార్వతి.

పాపం నాటినుంచి పార్వతి ఇల్లులేని ఇల్లాలే అయింది!... ★

# అపర బుద్ధి




తుమ్మలపల్లి సీతారామారావు

[గత వారం తరువాయి]

ఒక పర్వతాగ్రంనుంచి అగాధంలోకి పడిపోకుండా సురక్షితంగా తప్పించుకోగలిగానని తెలుసుకున్నాను. నామనస్సులో వున్నమాట ఆమెహృదయంలో నాటుకునేటు స్పష్టంగా విడమర్చి చెప్పాను. తిరిగి ఈవిషయం ప్రస్తావించవలసిన అవసరం మాఇద్దరిలో ఎవరికీ వుండదు. ఆమె వెళ్ళేప్పుడు, మర్యాదకోసమైనా లేచివెళ్ళి నేను సాగనంపలేదు. నాకారులో ఆమెను ఇంటివరకు తీసుకువెళ్లి దిగబెట్టలేదు. కాని మరునాడుకూడా వర్షం కురుస్తుందనీ, ఆమె తిరిగి అదేసమయానికి తప్పక ఇంటికివస్తుందనీ అనుకున్నాను. నేను ఊహించినట్టు ఆమె మరుసటిరోజురాత్రి రానేవచ్చింది. ఆమె లోపల ప్రవేశిస్తూ, నన్ను పలకరించలేదు. మేము ఇద్దరం మేడమీద మధ్యగావున్న నాపడకగదిలో కుర్చీలలో కూచున్నాము. ఐదు నిమిషాలవరకూ ఒకరితో ఒకరం మాట్లాడుకోలేదు. మొదట ఆమే సంభాషణ ప్రారంభించింది.

"నిన్నరాత్రి మీరు ఎంత కఠినమైన విషయాలు నాతోమాట్లాడారో!" అన్నది.

"అవి నిజంగనుక, నీవు చేయదలచుకున్న పని అదేగనుక అట్లామాట్లాడాను."

"అయితే, ఇక ఇప్పుడు జరుగవలసింది ఏమిటి ?"

"అదే నేనూ ఆలోచిస్తున్నాను."

"నా ఆవేదన గుర్తించండి; మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. నాజీవితానికి శాంతి, తృప్తి ప్రసాదించండి; నామాటలు మీరు విశ్వసించాలి," అంటూ ఆమె కుర్చీలోనుంచి లేచి నిలుచుంది.

కొంతసేపు గదిలో పచార్లుచేసి, తిరిగి కుర్చీలో కూచుని, నాకళ్లలోకి ఒకసారి చూసింది. ఆ కళ్లలో జాలి, అందం, ప్రేమ, వొలుకుతున్నవి.

"ఈరాత్రి మీదగ్గరకు మళ్లీ ఎందుకు వచ్చానో తెలుసా? రాత్రి మీతో చెప్పిన విషయంఆలోచించాను. నే చెప్పినవాటిలో ఒకటి రెండువిషయాలు మీకు అపోహ కలిగించి వుండవచ్చునేమో ననిపించింది. కాని ఆవిషయంలో మీరు నాకు ముందుగా హెచ్చరిక చేసినందుకు కృతజ్ఞురాల్ని. ఇవే సంగతులు దూరాలోచన లేకుండా ఇతరులతో అనివుంటే అనేక అపార్థాలకు అవకాశం ఏర్పడేది. ఇకముందెప్పుడూ ఇటువంటి విషయాలు నామనసులోనుంచి బయటపడకుండా నన్ను కాపాడాలి."

ఆమె చెప్పిన విషయం చంద్రశేఖర్‌కు తెలియజేసి, అతణ్ణి హెచ్చరిస్తానేమోనని ఊహించి పగలంతా ఆవేదనపడి ఉంటుంది!

"సరేగాని, నీవు మొన్న రాసిన చీటీమీద నీపేరు కోమలం అని వుంది; నిన్ను ఇకనుంచీ ఆ పేరుతోనే పిలవనా?" అన్నాను.

"అలాగే నన్ను పిలవాలి. నాకోసం మీరు మాయింటికి వస్తూవుండాలి. నాకోరిక నెరవేరిస్తే, నేను మీకు సహాయంచేస్తాను."

"నీవా?"

"ఔను."

ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాను. నా చూపులను ఆమె తప్పించుకోలేకపోయింది.

"నాకు సహాయం చేసేవాళ్ళు ఎవరూ లేరనే నా అభిప్రాయం" అన్నాను.

"మీకు సహాయం చేసేవాళ్ళు ఎవరూ లేరా? ఒకవిషయం చెపుతాను. మీకు సహాయంచేసే ఆప్తులు ఒకరైనా వుండాలి. అప్పుడే ఏ పనైనా సులువుగా చేయగలుగుతారు. అప్పుడే జీవితంలో సంతోషం, సంతృప్తి కలుగుతవి. నేను లేనూ?"

"నిజమే. భీమాకంపెనీకి వ్యతిరేకంగా ఏ పని తలపెట్టినా చాలా కష్టం. అయితే నీకోసం ఏపనైనా వెనుకాడను."

"నిజంగానా?"

"నిజంగా నీకోసమే!"

"ఇంకా దేనికి?"

"డబ్బుకోసం!"

"నాకోసం, మనకువచ్చే డబ్బుకోసం భీమాకంపెనీకి నష్టంకలిగించే ఏపనైనా చేస్తారా?"

"సందేహమా? నీ మనసులో వుంటే

(30-వ పేజీ చూడండి)

# మాంత్రికుడు మాండ్రేక్

కల్పన, రచన:
....లీ ఫాక్, ఫిల్ డేవిస్....

గోరీలో మాండ్రేక్ ను బంధించారు.













భేషుగ్గా..ఇదుగో—నీలాటి వదరు
బోతులపీడ వదలించడానికి ఇది
భేషైనచోటు.


నీకూ, నీ నెచ్చెలికీ ఇప్పుడేచోటు
కేటాయించాను బయట..
3


!



వాళ్లకి తమచేతులో పుర్రెలు కనే
బడ్డాయి. ఎదట మాంత్రికుడున్నచోట
పొగలేచి భీకరాకారంలో మీదకి....
ఆహా?..మీరు మాకు
"చోటు"కేటాయించారేం?
..హుం.అది మీకేవాటంగా
సరిపోతుందేమో.
6
CONTINUED-

(ఇంకా ఉంది)

 అపరబుద్ధి 

(27-వ పేజీ తరువాయి)

విషయం మర్మంలేకుండా చెప్పి, నిజాయితీ విషయమై నాకు గట్టినమ్మకం కుదిరేట్టు చేయాలి. అప్పుడే నీ మీద నాకు దృఢమైన అభిమానంకలుగుతుంది. నేనుఏదైనా ఒకపని తలపెట్టితే, దాని మధ్యలో వదిలివేయను తెలిసిందా?"

కోమలం మౌనంగా కూచుని, కళ్లు మూసుకుంది. తిరిగి కళ్లు తెరిచింది. ఆమె కళ్ల వెంట కన్నీరు కారుతున్నది. నా చేతితో ఆమె వీపును స్పృశించాను. ఉత్తేజంతో ఆమె లేచి ఇంకా దగ్గరకు వచ్చి నా కుర్చీ చేతి మీద కూచొని, తన రెండు చేతులతో నా కంఠం పెనవేసుకుంది.

"ఈ బంధం మీకు తప్పదు—మొదటి చూపులలోనే మీరు నా హృదయాన్ని, ఆకర్షించారు. తాము ప్రేమించే వారిలో స్త్రీలు సహజంగా చూసే అందం, ఆకర్షణ నాకు మీలో కనపడ్డవి. అన్నిటికంటే ఎక్కువగా మీ ముక్తసరి సంభాషణ, ఇతరులను గురించి ఎప్పుడూ మంచే చెప్పటం నన్ను మరీ ముగ్ధురాలిని చేసి వేసినవి..." అంది.

కొంచెం సేపు మౌనంగా నా ముఖంలోకి చూసింది. తిరిగి ఇట్లా తన కథ చెప్పడం మొదలు పెట్టింది:

"నేను శానిటోరియంలో హెడ్ నర్సుగా పనిచేస్తూ వుండేదాన్ని. కేంబ్రిడ్జి పరీక్ష ప్యాసైన తరువాత, నర్సు పరీక్షకు చదివి మొదటి తరగతిలో ఉత్తీర్ణురాలినైనాను. శానిటోరియంలో చేరిన కొంతకాలానికి, చంద్రశేఖర్ భార్యకు జబ్బుచేస్తే, ఆమెను అక్కడ చేర్పించాడు. ఆమెకు నేను ప్రత్యేక శ్రద్ధతో పరిచర్య చేశాను. ఇతర రోగు లందరికంటె ఆమెకు ఎక్కువ సేవ చేశాను. ఆమె చాలా చక్కగా వుండేది. హృదయం విప్పి మాట్లాడుతుంది. మానవ హృదయాన్ని అర్థంచేసుకోగల సంస్కారం ఆమెలో వుంది. చంద్రశేఖర్ ప్రతిరోజూ శానిటోరియంకు వచ్చేవాడు. ఆయన భార్య ఆరోగ్యం విషయమై నేను చూపుతున్న శ్రద్ధకు ఆయన కృతజ్ఞత అనేక విధాల వెల్లడించాడు. రోగులకు సేవ చేయడం నా వృత్తి ధర్మమనీ, అందులో నేను చూపుతున్న గొప్పతనం మేమీ లేదనీ ఆయనకు నచ్చచెప్పాను. ఆయన నాతో మాట్లాడటానికి, ఎక్కువ కుతూహలం కనపరిచేవాడు. తీరని ఆవేదనతో ఎప్పుడూ ఆయన నా ముఖం వంక చూసేవాడు. ఆయన పరిస్థితి నాకు జాలికలిగించింది. క్రమేపీ ఆయనకు నా వద్ద చనువు అధికమైంది. నాకు ఒక్కొక్క రోజు పని వుండేది కాదు. అప్పుడు నర్సుల హాస్టల్ లో వుండేదాన్ని. ఒక రోజు చంద్రశేఖర్ హాస్టల్ కి వచ్చాడు. ఆ రోజు సినిమాకి వెడదాం రమ్మన్నాడు. నేను బయలుదేరాను. నాతో ఏకాంతంగా మాట్లాడాలని ఎన్నో రోజులనుంచీ ఎదురు చూస్తున్నానని చెప్పాడు. ఆయన భార్య క్రమేపీ క్షీణించ వలసిందేగాని, ఆ వ్యాధి తగ్గదని తెలుసు నాకు. డాక్టరు కూడా ఈ విషయం ఆయనకు చెప్పాడు. అప్పటినుంచీ ఆయన నా మీద ఏదో ఆశ పెట్టుకొని, నన్ను అనుసరించి తిరగడం మొదలుపెట్టాడు. ఈ విషయం గ్రహించటానికి నాకు ఎక్కువకాలం పట్టలేదు. నా జీవితాన్ని గురించి ఉద్యోగం మానటం గురించి నాకు ఏవో వింత భావాలు వుండేవి. మేము సినిమానుంచి తిరిగివచ్చిన తరువాత, తనను వివాహం చేసుకుని, నర్సు ఉద్యోగం మానేయమని కోరాడు. నేను వెంటనే జవాబు చెప్పలేదు. అప్పటికి నేనే ఒకనిశ్చయానికి రాలేకపోయాను. ఈ సంఘటన జరిగిన వారానికి ఆయన భార్య మరణించింది. చంద్రశేఖర్ కూతురు కమలాక్షి కూడా తన తండ్రితో ఆసుపత్రికి వచ్చేది. నేను ఇక్కడికి వచ్చినతరువాత, ఆమెను కాన్వెంటులో చేర్పించాడు. ఆమె ఎప్పుడూ అక్కడే వుంటుంది. తండ్రిని, నన్ను చూడటానికి మాత్రం అప్పుడప్పుడు కమలాక్షి ఇంటికి వస్తూంటుంది.

"ఇక్కడ నేను ఈకొత్త జీవితం ప్రారంభించి ఆరు నెలలైంది. పదిమందిలో కులాసాగా తిరుగుతూ, కబుర్లు చెప్పటం అలవాటైనదానికి ఇక్కడి ఒంటరి జీవితం త్వరలోనే నాకు విసుగు కలిగించింది. ఆయన కూడా నావల్ల సుఖపడుతున్నట్టు కనపడలేదు. నేను ఊహించిన స్వప్నసౌధాలు కలలో నాకు సాక్షాత్కరించిన సుఖప్రదమైన జీవితం, ఆ అనుభవాలు, ఆయన నాకు సమకూర్చలేకపోయినాడు. నావల్ల ఆయనా ఆనందం పొందలేకపోయాడు. సుఖపడలేని వాళ్ళు జీవించటంవల్ల ప్రయోజనం లేదు. వాళ్లకి మృత్యువే శాశ్వత సుఖం కలిగిస్తుంది. నా స్వభావం ఎందుకో మృత్యువును ప్రేమిస్తుంది. ఎర్రని శిల్కుచీర, అదేరంగు బ్లౌజు ధరించి, తలలో ఎరుపురంగు రిబ్బన్ ధరించి రాత్రి సమయంలో ఎక్కడికైనా దీపాల వెలుతురులో బయలుదేరి వెళ్ళినపుడు, ప్రపంచమంతా నా వెంట పరుగెత్తుకు వస్తున్నట్టు కనపడుతుంది. నేను ఎంత విచారంగా ఉన్నప్పటికీ, ఇతరులు నా బాహ్య ఆకారాన్ని చూసి ముగ్ధులౌతున్నారు. నా స్నేహంకోసం పరితపిస్తారు. కాని ఎప్పుడూ నా హృదయంలో ఏదో తీవ్రమైన ఆవేదనా, బాధా కలత పెట్టుతూనే ఉంటవి. ఇదే నా హృదయంలోని విషాదచ్ఛాయ. అది ఎంత భయంకరంగా, దుర్భరంగా వుంటుందో ఒకసారి ఆలోచించండి! నాబాధ తీర్చలేనివాళ్లతో జీవించటం నిష్ప్రయోజనం. అటువంటివాళ్లు జీవించకపోవటమే మంచిది. నాఅభిప్రాయం మీకు ఇప్పుడైనా స్పష్టపడిందా?" అంది.

"లేదు."

"తెలియకపోవటం మంచిదే; నా మనసులో వున్న భావం ఇతరులకు తెలియకూడదు" అంది.

"అయితే మనం ఆ సాహసకార్యం చేద్దాం."

"చేసి తీరుతాం."

"సరైన దారిలోనే ఉన్నాం ఇద్దరం."

"ఊఁ సరే."

* * *

రెండురోజు లయిన తరువాత కోమలం నన్ను మళ్ళీ కలుసుకుంది. మా సంభాషణ మామూలు ధోరణిలోనే సాగింది. ఆమె తనను గురించి, తన ఆవేదనను గురించి పెద్ద ఉపన్యాసమేదీ ఇవ్వలేదు.

"ఆయనతో ప్రమాద భీమా విషయమై మాట్లాడారా?" అని ప్రశ్నించింది.

"లేదు."

"సరే. అసలు విషయం ఆయనతో ఎలా ప్రస్తాపిస్తారు?"

"మొదట ఆయనచేత భీమా చేయించి, పట్టా సంపాదించాలి."

"ఆయనకు తెలియకుండానా?"

"ఔను."

"అద్భుతంగా వుంది ఆలోచన."

"ఆ పట్టావల్ల నీకు హక్కు ఏర్పడుతుంది."

"తరువాత?"

"సాధారణంగా ఎలాంటి సందర్భాలలో మనుష్యులు మృత్యువుకు గురి అవుతారో లోకానుభవంవల్ల తెలుస్తుంది. ముందుగానే ఒక కార్యక్రమం నిర్ణయించుకుని, అనుకూల సమయం కోసం కనిపెట్టుకుని వుండాలి. సమయం దొరకగానే, కర్తవ్యం నిర్వర్తించాలి. హత్య చేయాలంటే ముఖ్యంగా మూడు అంశాలు గమనించాలి" అన్నాను.

హత్య అనేమాట నా నోటివెంట అప్రయత్నంగానే వచ్చింది. ఆమె భావం గమనించాలని వెంటనే ఆమె ముఖంలోకి చూశాను. ఆమె కలత పడుతుందేమో అనుకున్నాను. అటువంటి సూచనలేవీ ఆమెలో

నాకు కనపడలేదు. ఆమె బహు ఆసక్తితో ముందుకు వంగి కూర్చుంది.

"తరువాత చెప్పండి; వింటూనే వున్నాను" అంది.

"మొదటి విషయం-సహాయం. ఈ పని ఒక్కరివల్ల అయేదికాదు. నేరాన్ని ఒప్పుకుని, శిక్ష అనుభవించటానికి అంగీకరిస్తే తప్ప, ఒక్కరివల్ల పనిజరగదు. దీనికి ఒకరి కంటె ఎక్కువమందే వుండాలి. సమయం, స్థలం, విధానం ముందుగా తెలిసివుండాలి- ఈ తెలియటం మనకు మాత్రమే-అయనకు కాదుసుమా! ఇది రెండో విషయం. ఇక మూడోది: కార్యం నెరవేర్చటానికి ధైర్యం అవసరం. హత్యలు చేయటానికి కొత్తగా ప్రారంభించేవాళ్ళు ఇక్కడే మామూలుగా పొరపడుతూ వుంటారు; దోపిడిచేసేవాళ్ళు హత్యలు చేయటంలో నిపుణులు."

"ఔను వారి ధైర్యమే వారికి సహాయపడుతుంది."

"ధైర్యంవల్ల మనమూ కార్యం సాధించవచ్చు."

"తుపాకితో పని సాధిస్తే, అది ప్రమాదం కిందికి రాదుకదూ?"

"ఔను. సరిగా గ్రహించావు. కాల్చి చంపకూడదు. కాని నీ ఆలోచన సరైన మార్గానే నడుస్తోంది. చాలా సంతోషం. నీవు మాత్రం ధైర్యంగా వుండాలి."

"కాని అసలు పని ఎట్లా పూర్తిఅవుతుంది?"

"ఆ విషయమే చెపుతాను. కాల్చి చంపినందువల్ల మనకు ఎక్కువ డబ్బురాదు. ప్రమాదంవల్ల మృత్యువు తటస్థిస్తే, రెట్టింపు పరిహారం వస్తుంది. కొన్ని వృత్తులు, కొన్ని స్థలాలు, కొన్ని వాహనాలలో ప్రయాణాలు, ప్రమాదాలకు మరణాలకు కారణాలని నిర్ణయించారు. ఇటువంటి నిర్ణయాలలో నిజంగా ప్రమాదం వుండే స్థలాలు కొన్నిటిని ప్రమాదంలేని వాటిగా పరిగణిస్తున్నారు. రైలు ప్రయాణాలు సురక్షితమైనవని నిర్ణయించారు. రైలు ప్రమాదంవల్ల పట్టాల దగ్గరే మరణిస్తే, వాళ్ళు ప్రమాద భీమా ప్రయోజనాన్ని పూర్తిగా పొందవచ్చు. రైలుదారి ప్రమాదంవల్ల మరణించిన వాళ్ళకి భీమా కంపెనీ రెట్టింపు పరిహారం ఇవ్వటానికి అంగీకరిస్తుంది. ఈపనిని మనం పూర్తిచేస్తే ఇరవైఐదువేల రూపాయల పట్టామీద యాభైవేల రూపాయలు కంపెనీ వద్ద పొందవచ్చు. ఇందులో సందేహంలేదు. తెలిసిందా?"

"యాభైవేలు!"

"ఔను అద్భుతంగా లేదూ?"

"నిజమే."

"ఇంతకాలం నుంచి ఈ వ్యాపారం చేస్తున్న నాకు ఇందులో రహస్యాలు తెలియనివికావు. ఇటువంటి పట్టా తీసుకోవాలంటే, ఆయనకు తెలియాలి. తెలియకుండా కూడా కొంత తతంగం జరుగుతుంది. ఆయన దస్తూరితోనే భీమాకు దరఖాస్తు పంపిస్తాడు. కాని అసలువిషయం మాత్రం ఆయనకు తెలియదు. ఆయన దస్తూరితోనే ప్రీమియంకు చెక్కు కూడా రాసియిస్తాడు. అది ప్రమాద భీమా అని మాత్రం ఆయనకు తెలియదు. ఆయన మామూలుగా రైలులో ప్రయాణం చేస్తాడు. కాని అసలు రైలే ఎక్కడు."

"విచిత్రంగా వుందే!"

"కథ నడిచినకొద్దీ నీకే తెలుస్తుంది. మొదట మనం ఆయనచేత భీమాచేయించాలి. ఆయనచేత ఫారాలమీద సంతకాలు చేయించాలి. తెలిసిందా? దానిమీద సాక్షి సంతకం చేయటానికి ఒకరిని ఏర్పరచాలి. అనుకున్న పని పూర్తికాగానే అక్కడికి వచ్చిన వాళ్ళు భీమా కాగితంమీద సాక్షి సంతకం చేయాలి. అది చంద్రశేఖర్ చూస్తూనే వుంటాడు. వచ్చిన వాళ్ళఎదట మోటారు భీమాను గురించి మాట్లాడతాను."

"ఆయన సంతకం చేయకపోతే?"

"ఆ గొడవంతా నాకు వొదిలిపెట్టు ఈ మాత్రం కార్యం నైపుణ్యంతో సాధించలేకపోతే, నా పదిహేనేళ్ల అనుభవం నిరుపయోగమే నన్నమాట!"

"అయితే పనికి ఉపక్రమించడానికి ముహూర్తం నిర్ణయించండి."

"రేపు టెలిఫోన్‌లో చెపుతాను"

"అనేక కొత్త విషయాలు చెప్పారు. మీకు నాకృతజ్ఞత ఎట్లా తెలియపరచాలో అర్థం కావటంలేదు," అని ఆమె వెళ్ళిపోయింది.

* * *

నేను ఒక మొండిఘటంలాగా కనపడవచ్చు. సరే కానీయండి. పదిహేను సంవత్సరాలపాటు ఈ వ్యాపారంలో జీవితం గడిపాను. ఇదీ అన్ని ఇతర వ్యాపారాలలాంటిదే. కొన్ని విషయాలలో ఇతర వ్యాపారాలన్నిటి కంటె ఇదే మెరుగైనది. ఎందుచేతనంటే ఒక మిత్రుడు మరణిస్తే అతడి భార్యకు, పిల్లలకు కష్టసమయంలో ఆదుకోడానికి నా వృత్తి తోడ్పడుతుంది. ప్రపంచం అంతా ఒక పెద్ద జూదపు చక్రంలాంటిది. అగ్నికి ఇల్లు ఆహుతి అవుతుందేమోనని భయపడవచ్చు. నీ ఇల్లు కాలదంటాడు ఇంకొకడు. వాళ్ళకు నీకు ఇదే పందెం! ఈ పందెంలో నీవు గెలవాలంటే నీ ఇంటికి నీవే నిప్పు అంటించుకుని పందెపుడబ్బు గెలుచుకుంటావు. వాళ్ళదగ్గర పరిహారం పొందుతావు. ఆ సమయంలో నీకు ఇంటికంటె డబ్బు అవసరం అధికం. అప్పుడు ఏం చేస్తావు? కృత్రిమ సాధనంవల్లనే కృత్రిమాన్ని జయిస్తావు. నీవు నిజాయితీగా జీవించినంతకాలం, లోకం నీ కష్టాలు గుర్తించదు. నీ తెలివితేటలవల్ల జీవిస్తావంటే నీ వృత్తి నీకు సరైన ప్రతిఫలం ఇవ్వదు. నీ యోగ్యతను ప్రపంచం అవసరమైతే, ఒకసారి పొగుడుతుంది; నిన్ను చిరునవ్వులతో ఆహ్వానిస్తుంది. బాధలతో అణగారిపోతున్న జీవితానికి సుఖప్రియాలు, శూన్యహాస్యాలు ధైర్యం కలిగిస్తవా? ప్రతిక్షణం అప్రమత్తతతో లోకం పోకడను భూతద్దంలోనుంచి చూస్తుంటే, అందులో మిళితమైఉన్న అంతరంగ శక్తులు నీకు ద్యోతకమవుతవి. ధైర్యం కలుగుతుంది. నూతన ఉత్సాహంతో ప్రతీకారబుద్ధితో ముందడుగు వేస్తావు!

నేను భీమా ఏజంటు వృత్తి చేస్తున్నాను. ఇందులో కించపడవలసిన విషయంలేదు. లోకంలో మనుష్యులు చిత్తవృత్తి ఎలా వుంటుందో నాకు తెలుసు. అందరూ తమ కార్యసాధనకు ఎలాంటి మోసాలు చేస్తున్నది ఎరుగుదును. నీతిని, న్యాయాన్ని, ధర్మాన్ని, అవినీతి, అన్యాయం, అధర్మం, జయిస్తూన్నపుడు, కృత్రిమాన్ని ప్రతిఘటించలేక విషచక్రంకింద నలిగి చావవలసిందేనా? నా పన్నుగడ సాధించటానికి, పందెం గెలవటానికి ఒక సాధనం అవసరం. ఇప్పుడు కోమలం నాకు ఒక సాధనం. ఈ సాధనంద్వారానే పందెం గెలవాలి. కొంత డబ్బు రావాలంటే, చంద్రశేఖర్‌ని హత్య చేయక తప్పదు. ఈ యంత్రానికి చలనం కలిగించాలంటే నేను యంత్రపు చక్రానికి వెనుకే వుండాలి. అనేక గృహాలు అగ్నికి ఆహుతికావటం, మోటారు కార్లు కాలిపోవటం, అనేకమంది తుపాకిగుండ్లకు గురి అయి ప్రాణాలు పోగొట్టుకోవటం చూశాను. ఈ సంఘటనలన్నిటికీ కర్తలు అయినవాళ్లు కొందరు ఇప్పటికీ సురక్షితంగా ఉన్నారు. పెద్దమనుష్యులుగాను, ధర్మమూర్తులుగాను చలామణి అవుతున్నారు. వాళ్లుకూడా మంచి మంచి ఖరీదైన దుస్తులే ధరిస్తారు. నాగరక ప్రపంచంలోనే తిరుగుతూ వుంటారు. వాళ్లకి డబ్బు విలువ బాగా తెలుసు.

[ఇంకావుంది] 

# మంత్రాలు: నమ్మకాలు

# ఆంధ్రుల సర్పసంజీవి

[శ్రీ ఏ. సి. బార్బ్ ఆంగ్లేయుడు. భారత దేశంలో ప్రముఖ, వర్జీనియా పొగాకు వ్యాపారసంస్థ అయిన ఐ. ఎల్. టి. డి. కి చెందిన ఉన్నతోద్యోగి. కొంతకాలం క్రితం ఆయన ఆంధ్రదేశంలో కళ్ళారా చూచిన విచిత్ర సంఘటనఒకటి కలకత్తా, ఆంధ్రసంఘ వార్షిక సంచికలో ఆంగ్లంలో వ్రాశారు. దానికిది అనువాదం.]

1952 మేనెల మండు వేసవిలో ఒక నాటి నడిరేయి చీరాల రెయిలుస్టేషనులో మద్రాసు మెయిలుకోసం నిరీక్షిస్తున్నాను—ఉక్కకి తట్టుకోలేక ప్లాట్ ఫారం మీద కొచ్చేను. నిజానికి ప్రపంచంలో ప్రతిచోటా నిశీథసమయాల్లో రెయిలు స్టేషన్లు నిర్మానుష్యంగా బిక్కు బిక్కు లాడుతూ వుంటాయనే విషయం స్ఫురణకొచ్చి చేసేది లేక అటూ, ఇటూ పచారు చేస్తున్నాను. ఇంతలో "గణ-గణ" గంటల మ్రోత మద్రాసు మెయిలు రాక సూచించింది. సంతోషంతో ఆశుభవార్త రూఢిపర్చుకోటానికి కంట్రోలు గదిలో కాలు పెట్టేను. కాని ఆ సమయంలో ఎన్నో ఏండ్ల పర్యంతం నన్ను విభ్రాంతిలో ముంచెత్తే ఒక విచిత్రనాటకం నాకంటబడుతుందని సూచనప్రాయంగా కూడా నాకు తెలియదు.

కంట్రోలు గదిలో స్టేషను సిబ్బందికి చెందిన ఉద్యోగి ఒకాయన టెలిఫోనులో "పాముకాటు-పాముకాటు" అనే మాటలు గోలగాపదేపదే చెపుతున్నాడు. టెలిఫోను బల్లకి చేరువలో, నేలమీద ఒక బాలుడుపడి వున్నాడు. పద్నాలుగు—పదిహేనేళ్ల ప్రాయం వుంటుంది. స్పృహలేదు. కుడి కాలు పిక్క బాగా పొంగి వుబ్బెత్తుగావుంది. పరిశీలనగా పరికిస్తే పాము కరిచినందువల్ల యేర్పడ్డ రెండు చిన్నగాయాలు కన్పించేయి.

ఇద్దరు వృద్ధులు ఆ సర్పదష్టునిదగ్గర దీనంగా కుప్పపడి వున్నారు – ఆ అభాగ్యుని తల్లితండ్రులైవుంటారు అనుకున్నాను. తండ్రి ఆత్రుతగా టెలిఫోన్ చేస్తున్న వ్యక్తితో మాట్లాడుతున్నాడు. తల్లి పొంగి వచ్చే దుఃఖాన్ని తనలోనే దిగమ్రింగుతూ కన్నీరు మున్నీరుగా కారుతూంటే కుర్రవాని కాలు ప్రేమపూరితంగా పట్టుకుని విషం తీసివేయటానికి విఫలప్రయత్నం చేస్తోంది.

మోకాలుదగ్గరగా ఏదేనా తాడు బిగించి కడితే ఎట్లా వుంటుందో అనుకున్నాను. కాని అప్పటికే శరీరం బాగా విషకలుషితం అయినదనీ, రక్తనాళాల్లోకికూడా వ్యాపిస్తోందనీ, ఆసమయంలో ఇంక ఏవిధమైన ప్రథమచికిత్సా నిష్ఫలం అనీ తేలిపోయింది—మృత్యువు తథ్యం అనిపించింది.

## ఎ. సి. బార్బ్

అంతవరకూ ఆత్రుతగా టెలిఫోనులో అరుస్తూన్న ఉద్యోగికి అవతలిచివర్న ఆయనకు కావలసినవ్యక్తి అప్పటికి పలికినట్టయింది—క్షణంపాటు శ్రద్ధగావిని సర్పదష్టుడి తల్లిదండ్రులకేసి తిరిగి కుఱ్ఱవాని పేరు, వయస్సూ తెలుసుకున్నాడు—అవి ఫోనులో అతిబిగ్గరగా చెప్పేడు. టెలిఫోను అవతలి చివర్నివున్నది బహుశా ఒక వైద్యుడని వూహించేను. ఆయనగారికి ఈవివరాలతో ఏం ప్రయోజనం? అని నాలో నేనే నివ్వెరపడ్డాను. అసలు యింతకీ ఆ స్థితిలో వైద్యుడి ఉపయోగం నిజానికి వుందా? అనిపించింది. కాని ఆ, యీసందేహాలకి సమాధానం రావటానికి అట్టేకాలం పట్టలేదు.

నమ్మశక్యంకాని నిశ్చల వాతావరణం ఆగదిలో ఆవరించినట్లనిపించింది. అప్పటివరకూ అచేతనంగా పీనుగులాగా పడివున్న బాలుడు కొంచెం కాలు విదలించేడు. దాంతో చైతన్యరహితమైన అతనిశరీరానికి అంతటికీ కదలిక కలిగింది. తల్లి ఏడుపుమాని కుఱ్ఱాడిని తదేకంగా తిలకిస్తోంది. తండ్రి కొడుకుతలను చేతుల్లోకి తీసుకున్నాడు. అంతవరకూ టెలిఫోనుతో కుస్తీపట్టిన వ్యక్తి ధీమాగా ఫోను పెట్టేసి, ఆబాలుని తలదాకా వంగి రెండుసార్లు అతన్ని పేరు పెట్టి బిగ్గరగా పిలిచి "పాముల సత్యనారాయణ నీ శరీరంలోనుంచి విషం తీసివేశాడు-ఇప్పుడు నువ్వు బాగా తేరుకున్నావు ఇంక నువ్వు లేచి ఇంటికి వెళ్లాలి" అన్నాడు.—ఆ కుఱ్ఱవాడు నెమ్మదిగా కళ్లు తెరుస్తూవుంటే నన్ను నేనే నమ్మలేక రెప్ప వాల్చకుండా పరికించాను. సుమారు అయిదు నిముషాల పాటు ఆకుఱ్ఱవాడు అలా పడుండే గది నాలుగు మూలలా కలయచూశాడు. ఫోనులో మాట్లాడిన ఉద్యోగి ఇదివరకు చెప్పిన మాటలే తిరిగి చెపుతూవుంటే, నేనూ ఆ కుఱ్ఱవాని తండ్రీ ఇరుప్రక్కలా రెండు చేతులూ పట్టుకొని వూత ఇచ్చేం. కుర్రవాడు లేచి నిలుచున్నాడు. ఆతరవాత ఆ కుర్రవాడు నా బుజాన వ్రేలాడుతూన్న నీళ్లసంచీ ఆత్రుతగా అందుకుని వుక్కిరిబిక్కిరిగా సగం నీళ్లు ఖాళీచేసి వేశాడు.

స్టేషను సమీపిస్తూన్న మెయిలు ధ్వని అంతటితో నాకు ఆవిచిత్ర నాటకం విడిచి వెళ్లటానికి వేళఅయిందని గుర్తుచేసింది. టెలిఫోను చేసిన వ్యక్తికి ఆబాలుని తల్లితండ్రులు వెయ్యివిధాల కృతజ్ఞత తెలియచేస్తున్నారు. ఆ తల్లి కళ్ళల్లో తిరిగి నీళ్ళు సుళ్లు తిరుగుతున్నాయి—ఈసారి ఆనంద బాష్పాలు. బాలుడు లేచి బల్లచివర్న కూర్చున్నాడు. క్షణక్షణానికి కోలుకుంటున్న సంగతి స్పష్టంగా కన్పిస్తోంది—అంతవరకూ అచేతనంగా నేలపైన పడున్న వ్యక్తికీ, యితనికీ పోలికేలేదు. అతనేనా ఇతడు? అనిపించింది. ఆ వృద్ధ దంపతులనీ, మృత్యుముఖాన్నుంచి బయటపడి తేరుకుంటూన్న ఆబాలుడినీ చూసి నేను పొందిన ఆనందాన్ని వ్యక్తంచేయటానికి భాషచాలదు. పరస్పరం నమస్కారాలు మాత్రం చెప్పుకుని తొందరపాటుగా నేను ప్లాట్ ఫారం చేరేటప్పటికి మెయిలూ వచ్చి ఆగింది.

నా పెట్టెలో పడుండి క్షణం క్రితంవరకూ నేను చూసిన సంగతులు నెమరువేసుకుంటూ తీరికంగా వాటినిగురించి యోచిస్తూ యెంతకాలం గడిపేనో గుర్తులేదు. నిజంగామృత్యుదేవత వాడికోఱల్లో చిక్కుకున్న ఒక కుఱ్ఱాడిని నేను చూశానా? ఎక్కడో ఎన్ని మైళ్ళ దూరాన్నో వున్న ఎవడో ఒకవ్యక్తి

టెలిఫోనులో ఏదో చెప్పినంత మాత్రంగా ఆ బాలుడు బ్రతికి బయటపడటం యదార్థమేనా? టెలిఫోను అవతలి చివర్నవున్న వ్యక్తికి కోడెత్రాచు విషంవిరిచే శక్తివుందా?!—లేక—"పాముల సత్యనారాయణ" అన్న పేరులో ఆ బాలుడికివున్న అపారమైన విశ్వాసం కారణంగానే అతని చెవికి "పాముల సత్యనారాయణ" అన్న నామం సోకగానే పాము విషంతో పోట్లాడే స్థైర్యం కలిగిందా? అచేతనంగా పడివున్నాడే! ఏమో నిద్రాణమైన అతని అంతరాత్మకి ఆపేరు వినిపించి వుండకూడదూ?

కొన్నివారాల తరువాత చీరాల తిరిగి చేరినవెంటనే మిత్రులని భోగట్టా చేశాను. వేలాది సర్పదష్టులకి జీవంపోసిన ప్రాణదాతగా పాముల సత్యనారాయణకి ఆంధ్రదేశం అంతటా అపార పూజ్యభావం వుందని తెలిసింది. ఆయన స్టేషనుమాష్టరుగా పనిచేసి విశ్రాంతి తీసుకుని తూర్పుగోదావరి జిల్లా అనపర్తి గ్రామంలో వాసం ఏర్పరుచుకున్నాడని చెప్పేరు.

శ్రీ పాముల సత్యనారాయణవిఖ్యాత పురుషుడు. పాముకాటు వాతబడిన వ్యక్తి సన్నిహితులు తక్షణం చెయ్యాలిసింది ఒక్కటే—మదరాసు—కలకత్తా మార్గాన్నవున్న ఏదో ఒక స్టేషను చేరుకుని స్టేషను సిబ్బందికి తెలియచేస్తే చాలు. ఉత్తరక్షణంలో రెయిల్వే అధికారులు చేతిలో వున్నపని ఆపి అనపర్తికి ఫోను పిలుపు ఏర్పాటు చేస్తారు—అక్కడ పగలూ, రాత్రి అనకుండా పాముల సత్యనారాయణ సర్వేసర్వత్రా సిద్ధంగానే వుంటాడు.

వందల సంఖ్యలో వ్యక్తులు విషసర్పాల వాతపడి ఈయనకు తెలియచేసినంతమాత్రాన పునర్జీవులైన ఉదంతాలు విన్నాను. ఏదో ఒకనాడు యీ విచిత్రవ్యక్తిని దర్శించాలనిపించింది. ఆతరవాతి కొన్ని నెలలకు వ్యాపారరీత్యా అనపర్తి వెళ్ళినప్పుడు దానంతటదే ఆసదవకాశం లభించింది. "సత్యనారాయణ గారి గృహం ఎక్కడ?" అని అడిగీ అడగడంలోనే అనపర్తి వాస్తవ్యులు ఆయన నివాసం చూపెంచేరు సగర్వంగా—అంతటి విఖ్యాతి పురుషుడు వారి గ్రామస్థుడైనందులకు ప్రతిముఖాన్నా గర్వం ప్రస్ఫుటంగా ద్యోతకమైంది. నేను ఇంటికి వెళ్ళిన సమయాన ఆయన వరండాలో కూర్చుని ఏదో చదువుకుంటున్నాడు—నిరంతరం యోగాభ్యాసానికి అలవడ్డ వ్యక్తిలా పొడిగట్టుతాడు. అర్భకుడు. మోకాళ్ళ దిగని అంగవస్త్రం మాత్రం ధరించివున్నాడు. ఆయన మంత్రశక్తి గురించి నాకు గల కుతూహలం తెలుసుకుని నన్ను ఆదరపూర్వకంగా ఆహ్వానించి కూర్చోమని ఆసనం చూపాడు. నేను అడగబోయే ప్రశ్నలకి సమాధానాలు యియ్యటానికి ఆనందంతో అంగీకరించాడు. ఆయన సమాధానాలనుపట్టి, ఆ, యీ విషయాలు తెలుసుకున్నాను:-ఆయనకు అప్పటికి అరువది నాలుగేండ్ల వయస్సు. ఆయన చిన్నతనంనుంచీ పాముకాటువల్ల నరకయాతన అనుభవించి మృత్యుముఖానపడిన అభాగ్యులని అనేకమందిని చూసి హృదయం ద్రవించి అట్లాంటి అభాగ్య సర్పదష్టులబాధానివారణకి తానే ఒకనాడు తరణోపాయం సాధించి తీరాలనే కృతనిశ్చయానికొచ్చేడు. అక్కడక్కడా కొద్దిపాటి మహనీయులకుండే మంత్రశక్తి పాము విషానికి తిరుగులేని విరుగుడుగా పనిచేస్తుందని ఆయన విని వున్నాడు. కాని అట్లాంటి దివ్యశక్తిగల వ్యక్తిని దర్శించేసదవకాశం ఆయనకి 1928-వ సంవత్సరంవరకూ తటస్థించలేదు. ఆ సంవత్సరంలో ఒక సన్యాసి ఆమంత్రశక్తి ఆయనకి ఉపదేశించటానికి అంగీకరించేడు. అత్యల్పకాలంలోనే ఆయనఆమంత్రశక్తినిగ్రహించాడు. కాని అది ప్రయోగించుటకు ఆయన 1935వ సంవత్సరం వరకూ ఎట్లాంటి ప్రయత్నం చేయనేలేదు.

అందుపైన నేను వేయబోవుప్రశ్న పసిగట్టి శ్రీ సత్యనారాయణ ఆ మంత్రశక్తిని వినియోగించుటకు తాను చేసిన జాప్యానికి కారణం యీ విధంగా వివరించాడు: "చూడండి! ఒక కుఱ్ఱవానికి ఒక తుపాకీ ఇచ్చేరే అనుకోండి. ఆ బాలుడు అడవికి పోయి పులిని కొట్టేముందు కొన్ని నెలలో, సంవత్సరాలో నిదానించి లక్ష్యాన్ని గురి చేయటం, ఆ పైన తుపాకీ సవ్యంగా ప్రయోగించటం అభ్యసించాలి కదా?" అన్నాడు నవ్వుతూ. అందుచేత ఆయన ఏడు సంవత్సరాల అవిరామ ప్రార్థనా, పునశ్చరణలవల్లా తాను పొందిన మంత్రశక్తికి సిద్ధి కలుగజేసుకొన్నాడు.

1935వ సంవత్సరంలో గుంటూరుజిల్లా బాపట్లలో అసిస్టెంటు స్టేషనుమాష్టరుగా వున్నప్పుడు శ్రీ సత్యనారాయణ మంత్రప్రయోగం మొట్టమొదటి సారిగా చేసి విజయం సాధించాడు—ఒక వ్యక్తి ఆ రోజు స్టేషను ఆవరణకి సమీపంలో పడుండి మయిమరచిన నిద్దురలో ఒక్కసారి ఒత్తిగిలి ప్రక్కనుంచి ప్రాకిపోతూన్న ఒక కోడెత్రాచు కోఱలకి చెయ్యివిసిరాడు. ఆ పాము కసితీరా అతని అరచేతిపై కాటేసింది. తక్షణం అతను స్పృహతప్పి పడిపోయాడు. అదీ! శ్రీ పాముల సత్యనారాయణ మొట్టమొదటి మంత్రప్రయోగం. పదినిముషాల్లోఆ సర్పదష్టుడుపూర్తిగా కోలుకుని ప్రజల్లోపడ్డాడు.

ఆనాటి తొలివిజయం తరువాత విషసర్పాలవాతబడిన అభాగ్యులు అనేకులు ఆయన్ని చుట్టుముట్టజొచ్చేరు. అటుపైని కొద్ది నెలల్లోనే ఆయన తన మంత్రశక్తి ఇతర ప్రాంతాలకి టెలిఫోనుద్వారాకూడా ప్రసరించ మొదలెట్టేడు. అప్పటినుంచి అనేక సంవత్సరాలుగా శ్రీ సత్యనారాయణ, మంత్రశక్తివల్ల వాస్తవంగా కొన్ని వేలమందికి ప్రాణదానం జరిగిఉంటుంది. ఆయన ఉద్యోగం విరమించి విశ్రాంతి తీసుకుంటున్నా, ఈ నాటికీ విసుగు అనేది లేకుండా రోజుకి ముగ్గురు నలుగురినైనా విషసర్పాలవాతబడినవారిని కాపాడుతూ వుంటాడు.

నేను అడిగిన మరికొన్ని ప్రశ్నలకి సమాధానంగా శ్రీ పాముల సత్యనారాయణ యీ విధంగా సమాధానం ఇచ్చేడు. "ఈ మంత్రశక్తి సత్యవర్తనా, సంకల్పబలం గల ఏ మానవుడేనా సాధించ గలుగుతాడు......మనోవాక్కాయ కర్మలా ఎట్లాంటి మినహాయింపులూ లేకుండా సర్వకాల సర్వావస్థలయందూ అనృతం పలకనని త్రికరణశుద్ధిగా మనోబలం కలిగిఉండాలి. సర్వదా పరోపకారానికి సంసిద్ధుడై ఉండాలి. ఏ పరిస్థితులలోనూ ఈ మంత్రశక్తిని ధనార్జనకుగాని, మరే విధమైన ప్రత్యుపకారమునకుగాని వినియోగించరాదు. అట్లాంటివారికే పరాత్పరుడు యిట్లాంటి దివ్యశక్తి ప్రసాదించుతాడు. సంపూర్ణముగా ఐహిక కాంక్షలు త్యజించి అనునిత్యం ఈశ్వరప్రార్థనా, తపోనిష్ఠద్వారా మంత్రశక్తి స్థిరంగా, దృఢంగా అజేయంగా నిల్చివుంటుంది. దైవానుగ్రహం లేనిది ఏదీ సాధించలేముకదా?" అంటూ మందహాసంతో ముగించాడు.

స్వార్థం అనేమాట లేకుండా సర్వదా పరోపకారముకొఱకు తన తనువంతా అంకితంచేసిన ఆ మహనీయుని పజ్జను కూర్చుని ప్రసంగిస్తూన్నంతసేపూ, ఆయన నిర్దేశించిన నియమాలలో ఏ ఒక్కదానికైనా కట్టుబడి వుండే మనోబలం, ఆత్మనిగ్రహం మనలో కొద్దిమందికేనా వుంటుందా, అనిపించింది. ఆసమయాన సుమారు నాలుగేండ్లక్రితం చీరాల స్టేషను కంట్రోలు గదిలో ఒకనాడు నేను చవిచూచిన నిశ్చల వాతావరణం, ప్రశాంత తిరిగొక్కసారి నా అనుభూతిలోని కొచ్చేయి. ఆ మహనీయుని ఖ్యాతి వేనోళ్ల సగర్వంగా కొనియాడుతూన్న ఆంధ్రప్రజలు వేనవేలు నా మనోనేత్రానికి గోచరించారు.

[చిరకాలంగా ఆంధ్రదేశంలో "పాముల నరసయ్య" అనే ఒక మాంత్రికుని పేరు బహుళ ప్రచారంలోవుంది—ఐతే ఈ పై వ్యాసంలో శ్రీ ఎ. సి. బార్బ్ పేర్కొంటూన్న శ్రీ పాముల సత్యనారాయణా, నరసయ్యా ఒకరేనా? లేక వేరు వ్యక్తులా? దయచేసి ఆ ప్రాంతపు పాఠకులు ఎవరేనా ఈ సందేహము "ఆంధ్రపత్రిక" ద్వారా నివృత్తి చేయగోర్తాను.]

"ఉపాధ్యాయుం"

—విజయనగరం.

# పిచ్చి శంకరం

పెళ్ళి చేసుకోకుండా ఉంటే...ఇన్ని కష్టాలు రాకపోను అనుకున్నాడు శంకరం. తాను మొదట్నుంచీ మొత్తుకుంటూనే ఉన్నాడు, ఇప్పట్లో తనకి పెళ్ళి చెయ్యవద్దని. కానీ...అమ్మా, నాన్నా విన్నారా?...నాయనమ్మకి నీపెళ్ళి చూడాలని ఉంది కాబట్టి, చేసుకొని తీరాలి అన్నారు.

సరే... పెళ్ళి నాయనమ్మ చూడ్డంకోసం చేస్తున్నారు, బాగానే ఉంది. చేస్తూ... చేస్తూ... ఆ మేనరికమే చెయ్యాలా?... నాలుగురాళ్లు ఉన్నవాళ్లతో, పదిరాళ్లు కట్నంగా నయినా ఇచ్చేవాళ్లతో చెయ్యరాదూ! పిల్ల పుట్టకముందే పసుపు - కుంకం పుచ్చుకున్నాం, మాట తప్పడానికి వీల్లేదు అని, గంపెడు పిల్లలతో సతమత మవుతున్న ఆ మేనమామ కూతుర్నే చేశారు.

పెళ్లి చేస్తున్నారు, బాగానే ఉంది. పెళ్లికి అప్పులెందుకూ చెయ్యడం?...ఉన్న దాంట్లోనే చేసేస్తే సరి పోదూ?...అలా వీల్లేదుఅన్నారు. వంటలూ, సదుపాయాలూ బాగుండకపోతే... బంధువులు బ్రతికి ఉన్నంతకాలం దెప్పి పొడుస్తారట! బ్రహ్మాండంగా ఐదు రోజులు వరసగా వివాహ మహోత్సవం జరిపించారు!

పెళ్లి చూడకుండా ఛస్తున్నా...ఛస్తున్నా అన్న నాయనమ్మ దుక్కలాగే ఉంది! కానీ, నాలుగు కాలాలు బతికి నలుగురి అప్పులూ తీర్చి, నలుగుర్ని పోషిస్తాడు అన్న తండ్రి హఠాత్తుగా తనువు చాలించాడు. పరిస్థితులు విషమించాయి. శంకరం బియ్యే పూర్తి చేయకుండానే... ఉద్యోగాన్వేషణలో మునిగిపోయాడు.

ఇంతకీ, పెళ్ళివల్ల జరిగిన నష్టాలు ఏమిటంటే—ముఖ్యంగా అప్పులు. అటుపైన-- మరి ముగ్గుర్ని పోషించాల్సిరావడం ... శంకరం, శంకరం తల్లీ, నాయనమ్మా కాకుండా, భార్యా, ఇద్దరుపిల్లలు ఎక్స్ట్రా అయ్యారు. పిల్లలతోవచ్చిన చిక్కేమంటే, వాళ్ళకి ఘడియఘడియకూ డాక్టర్లు కావాలి! మందులు కావాలి!! వీళ్ళతో సమానమయిన మనిషి...నాయనమ్మ! ఈవిడ చావనూ చావదు! బతకనూ బతకదు! ఇదీ తన కథ!!

పోనీ, ఉద్యోగం అన్నా ఉంటే ఎలాగో అలాగ సంసారాన్ని ఈడ్చెయ్యవచ్చు. కానీ, అదీ లేదు.

భారంగా మెట్లు ఎక్కి లోపలకు వెళ్లాడు. గంటల తరబడి అతనికోసరం కూచున్నాడు—

ఆయన తాపీగా వచ్చాడు. నిదానంగా అడిగాడు-"ఎంతవరకూ చదువుకున్నావ్?" అని.

"బియ్యేవరకూ..." అంటూ సమాధానం యిచ్చాడు శంకరం. గుండె బిక్కు... బిక్కు మంటోంది. వెయ్యిమంది దేవుళ్లకు మొక్కుకున్నాడు ఖాళీలు లేవు అనకుండా చూడమని.

"బియ్యే ప్యాసయ్యావా?"—అదోలా చూశాడతను.

"లేదండీ!...కానీ, హిందీ, ఇంగ్లీషు, బెంగాలీ...మూడు భాషలూ బాగా వచ్చునండి!"—బ్రతిమాలుకున్నట్టుగా అన్నాడు శంకరం.

## పిల్లా సుబ్బారావుశాస్త్రి

అతను చలించాడు.

"ఎన్ని భాషలు వచ్చినా, ఎన్ని డిగ్రీలున్నా...ఈ రోజుల్లో ఉద్యోగాలెక్కడివయ్యా?"... ఇంతకి ... నువ్వెలాటి ఉద్యోగం చెయ్యగలవు?" అని అడిగాడతను.

"ఏ ఉద్యోగం అయినా చేస్తానండీ...!" అన్నాడు శంకరం.

"సరే — ఖాళీలు ఉన్నప్పుడు చూస్తాన్లే...!"

"అలా అనకండి! ...పిల్లలు గలవాణ్ని..." అన్నాడు శంకరం దీనంగా, నిరాశగా!

"అరె...! అప్పుడే నీకు పిల్లలా?" అని, ఆశ్చర్యంగా అడిగాడతను.

"ఔనండీ..." అన్నాడు సిగ్గుతో కుంగిపోయి శంకరం.

"ఎంతమందేమిటి?"

"ఇద్దరే లెండి...!" అన్నాడు శంకరం.

"ఏమయినా, నువ్వు నన్ను వదిలేలా లేవు!"అంటూ, సిగరెట్టు ముట్టించాడతను.

"ఏదో బియ్యేవరకూ చదివినవాణ్ని!... పిల్లలు గలవాణ్ని! ఏదో ఒక ఉద్యోగం యిప్పిస్తే...మీ మేలుమర్చిపోను!"అన్నాడు శంకరం.

"అది నిజమేనయ్యా, అసలు ఉద్యోగం అంటూ ఖాళీఉంటే అలాగే చేద్దును— కానీ, ప్రస్తుతం నీకోసం ఓ ఉద్యోగం కల్పించాలి,...అంతేనా..."

"శ్రమ అనుకోకుండా..." ఆశగా చూశాడు శంకరం.

"ఇంతకీ నీకెంత జీతం కావాలి?..."అడిగాడతను.

"నేనడిగినంత జీతం మీ రిస్తారా?... అది మీరే నిర్ణయించాలి" అన్నాడు, రవ్వంత ఆనందంతో.

"అహ...అదికాదు నీఉద్దేశ్యం ఏమిటో తెలుసుకుందాం అనీ—అయినా చెప్పడానికేముందీ? చెప్పు—" అన్నాడాయన.

"ఏముందండీ! నేనూ, నావాళ్లూ రెండు పూటలా యింతగంజి అయినా తాగాలంటే వందాయాభై రూపాయలయినా ఉండాలండీ...! గత్యంతరం లేదు కాబట్టి— ముప్ఫయి రూపాయలు యిస్తే న్నా ఉద్యోగం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నా!" అన్నాడు శంకరం, అమాయకంగా.

"ఐతే, నీకు ముప్ఫయి రూపాయలమీద ఉద్యోగం వేయిస్తాను" అన్నాడతను శంకరం కళ్ళల్లోకి చూస్తూ.

"ముప్ఫయ్యా? ..." ముఖం మాడిపోయింది. దీనంగా చూశాడు శంకరం!

"ఒక్క ముప్ఫయికాదు! మూడు ముప్ఫయిలు... తొంభై రూపాయలమీద ఉద్యోగం వేయిస్తాను..." అన్నాడతను. శంకరం ముఖం గంపంత అయింది.

"ఐతే, ఒక్క విషయం" అన్నాడతను ఏమిటన్నట్టుగా చూశాడు శంకరం.

"రహస్యం..." అన్నాడు అతను.

"చెప్పండి..." అన్నాడు శంకరం.

"ఐతే, విను-నీకు బెంగాలీ, ఇంగ్లీషు బాగా వచ్చునన్నావు కగూ..."

"హిందీ కూడా వచ్చునండీ" అన్నాడు శంకరం.

"ఏం లేదు. నేను కొన్ని బెంగాలీ పుస్తకాలూ, ఇంగ్లీషు పుస్తకాలూ యిస్తాను. వాటిని జాగ్రత్తగా అనువాదం చెయ్యాలి" అన్నాడతను.

"తెలుగులోకా?"

"ఔను-ఒక్క విషయం. ఆ అనువాదం పుస్తకాలన్నింటికీ...నా పేరే ఉంటుంది."

"మీ పేరా అండీ?" అని అడిగాడు కొద్ది ఆశ్చర్యంగానే.

"ఔను, నా పేరుకానీ, మరొకరి పేరు కానీ...అవన్నీ నీకు అనవసరం. నీకు ఇచ్చిన బెంగాలీ, ఇంగ్లీషు పుస్తకాలన్నీ అనువాదంచేసి యివ్వడం వరుకే నీ పని. ఆ

(43-వ పేజీ చూడండి)

# వనితా లోకం

మంచీ చెడ్డా:

బొప్పన గంగాభవాని
(కనుమూరు)

## యక్షప్రశ్నలు

తెలంగాణాలోవున్న మా బంధువుల ఇంటికి వెళ్ళినపుడు లంబాడీ స్త్రీల సంవాదం విన్నాను. దాన్ని గురించి ఆలోచిస్తే అజ్ఞానులనుకునే వాళ్ల ప్రశ్నలకు సమాధానం చెప్పటం జ్ఞానులకు కూడా సాధ్యం కాదని పిస్తుంది.

ఆ లంబాడీ స్త్రీలు అత్తా కోడళ్ళు పోట్లాడుకుని మా గృహస్థు ఇంటికి తీర్పు కోసం వచ్చారు. వారి తగాదా ఇదీ:

అత్తమామలకు నీళ్లుపోయటం వండి వడ్డించడం, వాళ్ళ కాళ్ళువొత్తి వాళ్లను నిద్రపుచ్చి ఆ తరువాత భర్తకు సేవ చేయడం కోడలి విధులు. ఇది లంబాడీలలో అనాదిగా వస్తున్న ఆచారం. దీనిని ఆ కోడలు పాటించటం లేదట.

### "సాటెక్కడ?"

"వూరిలో షావుకారిగారి కోడలు, అత్తకు కాళ్ళు పిసకదూ, నీళ్ళుపోయదూ, ఏదో కాస్త ఇంటిపనిచేసి, చీకటి పడగానే భర్తదగ్గరకు చేరుతుంది. షావుకారిగారికోడలు అలా చేస్తే ఏమీ అనరు, గాని నేను కూడా అలా చేస్తుంటే నన్నెందుకు తిడతారో" అని కోడలు వాదిస్తూంది.

అక్కడితో అత్తగారు ఒంటికాలిమీద లేచింది "నీకూ, ఆ పిల్లకు సాటెక్కడ" అంటూ.

"షావుకారిగారి కోడలు తినటానికి పాలం తెచ్చింది, తాగటానికి ఆవు తెచ్చింది పై ఖర్చుకు డబ్బు తెచ్చింది. నీవేమి తెచ్చావ్? పైగా నీకోసం నేను నీ అయ్యకు రెండు నూర్ల పైకము ఇచ్చాన్, రెండు ఆవులు ఇచ్చాన్, పాతిక గోనెలు ఇచ్చాన్, మొతం దాకు రెండువాస్తాల్ పెట్టికల్లుపోయించాన్. ఆవిడగారు అన్నీ తెచ్చింది కాబట్టి అత్తగారికి కాళ్లు పిసకకుండా మొహ పిసికినా తప్పులేదు. అసల్ ఆవిడగార్కి అత్తగారే చేయాలే ఎదవఖానా! నీకోసం ఇన్నీ ఇచ్చి తెచ్చుకున్నాక నువ్విపుడు చాకిరిచేయనంటే ఎలా వూరుకునేదే భాడ్కావ్? మా అత్తమామలకు నేను చేయలేదంటే" అని గదమాయించింది అత్తగారు.

పాపం, ఆయనగార్కి, ఏం తీర్పు చెప్పాలో తెలియక పని వుందని తప్పించుకున్నారు. దీనికి మనమేమి సమాధానం చెప్పగలము?

### "నన్నెవరు సాకేరు?"

ఇట్లాంటిదే ఇంకో సంఘటన. వీళ్ళు హరిజన స్త్రీలు. కుప్పనూర్పిళ్ళలో పని చేయటానికి వచ్చారు.

కొడుకు కోడలంటే ప్రేమచూపి, తల్లిని సరిగా చూడటం లేదని తల్లికి కోపం.

''ముంగువచ్చిన చెవులకంటే వెనుక వచ్చిన కొమ్ములువాడిట అయితేనేం గడ్డ పెటికొత్తే కొమ్మేవిరుగుతుంది కొని, చెవులు పోతాయా? అలాగే తల్లి ప్రేమగట్టిది. మధ్య వచ్చిన కోడలు పైపైకి ప్రేమచూపినా, మనసుకు నచ్చకపోతే, మధ్యలో చెట్టుమీద పిట్టలా ఎగిరిపోతుంది. అదే తల్లి అయితే కొడుకు ఎటువంటివాడైనా వదిలిపోతుందా! ఇంతకూ మన బంగారం మంచిది కాకపోతే ఏం చేస్తాం దొరసానిగారూ" అని కళ్ళనీళ్లు తుడుచుకుంది!

కోడలువాదన:- ''నీకొడుకులాగా నాకూ తల్లివుంది. దానిదగ్గరనుండి దూరం చేసి ఇక్కడకు తీసుకొచ్చారు. నీకొడుకూ ప్రేమచూపకుండ, నీవు, చూపకుండా వుంటే; ఇంకనన్ను లాలించే దెవరు? అంతా నన్ను దూషిస్తే, నేను ఏనుయ్యో గొయ్యో చూచుకో వలసిందేగా దొరసానిగారూ" అంది.

మరి వీళ్ళకేమి సమాధానం చెప్తాం? మన అవిభక్త కుటుంబాలలో ద్వేషాలు అంతరించాలంటే వీళ్ళ ప్రశ్నలకు సమాధానం ఆలోచించి ఆచరించితే చాలు.

### ధర్మ సూక్ష్మం

మావద్ద పనిచేసే నౌకరుకథ: వాడిపెళ్లాం, తిక్కపిల్ల. మొగుడికి వేళకు అన్నం పెట్టదు. వాడు తిన్నాడ మానాడా అన్నసంగతే పట్టించుకోకుండా అలక్ష్యంగా తిరుగుతుంది: ఈ గొడవంతా చూసి మావారు వాడికి సలహా చెప్పారు." దాన్ని వదిలిపెట్టి ఇంకో దాన్ని చేసుకోరాదటరా" అని.

వాడు వేదాంతిలా నవ్వాడు;

"మీకేమి దొరగారూ; మీరు అలా వదిలిపెట్టినా కట్నంఇచ్చి ఇంకొకరు పిల్లనిస్తారు. మాకు ఆగనేది! దీన్ని చేసుకోటానికి నాలుగు సంవత్సరాలు రెక్కలు విరుగ్గొట్టుకొని జీతం దాస్తే ఆమూడుముళ్ళూపడి ఇది ఇంటికి వచ్చింది. దీన్నివిడిచిపెట్టితినా! మళ్ళీ అన్ని సంవత్సరాలు కష్టపడి డబ్బు చేర్చాలి. అప్పుడొచ్చే కొత్తపిల్లమటుకు మంచిదే అవుతుందని నమ్మకమేమిటి? కొన్నాళ్ళు పోతే కుంటే దీనికడుపున నొకకాయగాస్తే అదే దారికొస్తుంది. అందాక తలవొంచుకు సర్దుకుపోతే సరిపోయింది", అని అన్నాడు.

దీనిని గురించైనా ఆలోచిస్తే నాటుగ్రామాల్లో నిల్వన్న కుటుంబాలలో దంపతుల పొరపొచ్చాలు సరియైన త్రోవలో సరిదిద్దుకో వచ్చును కుంటా.

చదువుకున్నామని విర్రవీగ వారంతా వీళ్ల భావాలను అర్థం చేసుకుంటే తల వంచుకు తిరగాలి. అజ్ఞానులు కారు వీళ్లు; బురదలో పుట్టిన పద్మాలు.

# స్త్రీలు - వ్యాయామం

నాగరికత వలన అసంఖ్యాకమైన సత్ఫలితాలతోపాటు కొన్ని దుష్ఫలితాలు కూడా కలిగాయి. ముఖ్యంగా శరీరానికి అవసరమైన వ్యాయామం క్రమంగా తగ్గిపోయింది. ఈ విషయంలో పురుషులకంటె అధికంగా స్త్రీలు ఈ అలవాటును మానుకుని ఆరోగ్యం పోగొట్టుకొంటున్నారు. ముఖ్యంగా పట్టణంలో నివసించే స్త్రీలలో చాలా కొద్దిమందికి మాత్రమే శరీరాన్ని ఆరోగ్యకరంగా ఉంచుకొనేందుకు తగిన వ్యాయామం చేసే అవకాశాలు ఉన్నాయి.

శరీరానికి వ్యాయామాన్ని కలిగించడానికి అనుసరించతగు పద్ధతులు చాలా ఉన్నాయి. వాటిలో నడక, ఆటలు ఉత్తమమైనవి. సామాన్యంగా గ్రామాలలో నివసించే మనకు ఇది సాధ్యమైనపని కాదు. అందుకు సామాజిక, ఆర్థిక కౌటుంబికాది కారణాలు చాలా ఉన్న విషయం మన కందరకూ తెలిసినదే!

గృహకృత్యాలను అన్నింటిని స్వయంగా నవరించుకోగలిగిన సోదరీమణులు అదృష్టవంతులనే చెప్పాలి. అంట్లు తోమడమూ, పగుపులు ఘుప్పట్లు గులుపుకోవడమూ, వంటా వార్పు మొదలైనపనులు చేసుకోవడమే ఒక వ్యాయామము. మన శరీరానికీ, అందానికి ఈ వ్యాయామం దోహదం చేస్తుంది. కాని పనివాళ్లమీదా, వంటవాళ్లమీదా ఆధారపడే తరగతులవారికీ, ఆఫీసులలోనూ, స్కూళ్ళలోనూ పనిచేసుకొనే యువతులకు ఈ అదృష్టం లేదు.

బలంమాట అలాఉండగా, మామూలుగా తిన్నది హారాయించుకొని, జలుబులూ జ్వరాలూ దరికిరాకుండా ఆరోగ్యాన్ని కాపాడుకోవడానికి కూడా ఒకవిధమయిన వ్యాయామం అవసరమే. దానివలన యవ్వనమూ, సౌందర్యమూ, శరీర వికాసమూ సంరక్షించుకోగలము.

వ్యాయామంలో గుండె ఎక్కువమారులు కొట్టుకోవడం, ఊపిరి తిత్తులు చురుకుగా పనిచేయడం జరుగుతుంది. గుండె వేగంగా రక్తాన్ని పంపించకల్గుతుంది. కండరాలు, కదలిక వలన శక్తివంత మవగలవు. గుండె శక్తివంతమై అధికమైన పనిచేసేశక్తి కలిగిస్తుంది. మలినపదార్థాల విసర్జన సక్రమంగా జరుగుతుంది.

## సోమరితనానికి శిక్ష!

సోమరి తనానికి శిక్షగా శరీరం నీరుపట్టినట్టు సాగిపోతుంది. కండరాలు చాలా సున్నితమైపోయి ప్రతి క్రియకీ లొంగిపోతాయి. ఏ కొద్దిపనిచేసినా సొమ్మసిల్లేటంత ఆయాసాన్ని కలిస్తుంది. మలాశయం పెద్ద ప్రేవులుసాగే శక్తిని పోగొట్టుకొని మలబద్ధకాన్ని కలిగిస్తాయి. రక్త ప్రవాహం సవ్యంగా జరగక అనేక అవయవాలు సరిగా పెరగవు. ఆహారము సక్రమంగా జీర్ణంకాదు తగిన శక్తిగానూ వేడిగానూ మారదు. అక్కడితో క్రొవ్వుపొరలు దట్టంగా ఏర్పడతాయి. కీళ్లు బిగుసుకుపోయి ఉంటాయి. చర్మంసాగే శక్తిని పోగొట్టుకొంటుంది.

## జి. సావిత్రి

(మద్రాసు.)

నరాలు చైతన్యం కోల్పోయి మొద్దుబారుతాయి. అది అనేక వికారాలకు దారితీస్తుంది. శిరస్సు, శరీరం నడుము చురుకుగా ఎటుపెడితే అటు కదలేశక్తిని పోగొట్టుకుంటాయి. నరాల ప్రమత్తతవలన నడకలో మేలికలయిక లభ్యంకాదు. తూకం, సౌలభ్యం, సొంపు, సోయగం పోతాయి. నడకలో ఆనందం పొందలేము. క్రమంగా ఆనందంతోపాటు అందంకూడా దూరమవుతుంది!

ఊరిబయట పరిశుభ్రమైనగాలిలో నడవటం కంటె చౌకగా లభించే శరీరవ్యాయామ సాధనం మరొకటిలేదు. ఇది శరీరానికి తగిన శ్రమను కలిగిస్తూ అటు మనసుకు విశ్రాంతి కలిగిస్తుంది. ఇటు బడలికను సడలిస్తుంది.

## ఆటలు

ఆటలు శరీరానికి చురుకుతనం కలిగించి శక్తిని పెంపొందించడంలో సాటిలేనివి. ఎదుగుతున్న పిల్లలకు ఆటసంజీవనివంటిది. యుక్తవయస్సు వస్తున్న సమయంలో శరీరంలో త్వరితంగా మార్పులువస్తూ ఉంటాయి. ఆసమయంలో శరీర పరిశ్రమ ఆటలు వ్యక్తియొక్క శక్తిని అనుసరించి ఉండాలని కొందరి అభిప్రాయం. సొమ్మసిల్లిపోయేటంత వ్యాయామం చేయడంమటుకు ఎల్లవేళలా ప్రమాదమే.

నడక చక్కటి వ్యాయామ సాధనమే కావొచ్చు. అయినా ప్రత్యేక పరిస్థితులలో ప్రత్యేకమైన వ్యాయామ, క్రీడలను సూచించి చేయించవలసిన బాధ్యత కూడా మనపై ఉంది. ఉదాహరణకు: ఒక యువతి చిన్న వయసులోనే లావుగా ఉంటుంది. ఎలా తగ్గించడం? ఆమెకు శరీరం యొక్క బరువును తగ్గించే వ్యాయామ క్రీడను సూచించాలి! మరొక వనిత బక్కచిక్కి ఉంటుంది ఈమెకు కండపుష్టిని కలిగించే వ్యాయామ క్రీడను సూచించాలి. ఏ వ్యాయామం కానీయండి. కొద్ది రోజులయినా వరుసగా చెయ్యాలి. మధ్యలో విడవటం శాస్త్రీయం కాదు, మంచిదీ కాదు. వ్యాయామం కోసం అధికంగా కాలాన్ని వ్యయం చేయడం కూడా కూడనిపని. సామాన్యంగా ప్రొద్దుట, సాయంకాలం పదిహేను నిముషాల చొప్పున వ్యాయామంచేస్తే చాలును. చాలా సూక్ష్మమైన క్రియలతో ప్రారంభించి ఘనమైన క్రియల్ని అందుకోవడం శాస్త్రీయం. అందువలన కండరాలు, కీళ్ళు, నరాలు తాపీగా క్రమక్రమంగా అదుపాజ్ఞల లోకి వచ్చి సక్రమమైన అభివృద్ధి పొందుతాయి.

## ఉదయం

నిద్రమేల్కొనగానే పరున్న పరుపుమీంచే మనం వ్యాయామం ప్రారంభించవచ్చు. చేతులు ప్రక్కలనే ఉంచి, నడుం మీద ఆధారపడి కాలిబొటన వ్రేలినుండి భుజాల వరకు సాగాలి. పిమ్మట ఒక్క నిముషం మాత్రం విశ్రాంతి నివ్వాలి. అప్పుడు రెండు చేతులను రెండు ప్రక్కలకు చాచాలి. క్షణం విశ్రాంతి. మళ్లీ చేతులను నుదిటి మీదకు క్రమంగా తీసుకురావాలి. మళ్ళీ క్షణం విశ్రాంతి. ఇంతకంటె అధికంగా ప్రక్కమీంచి లేవక ముందు వ్యాయామం చేయ నవసరం లేదు.

ప్రక్కమీంచి లేచిన తరువాత శరీరానికంతకూ వ్యాయామం. ఒక కుర్చీ తీసుకొని దానిని ముందు పెట్టుకొని దానిపై కుడిచెయ్యి ఆనించాలి. ఎడమ మోకాలిని పొత్తికడుపు వరకూ ఎత్తాలి. అప్పుడు కాలిని ఎంతవరకూ ఎత్తగలిగితే అంతవరకూ ఎత్తాలి. ఇప్పుడు కాలిని ముడిచి క్రిందుగా వెనుకకు పోనివ్వాలి. అంతేకాకుండా కుర్చీమీద ఉన్న కుడిచెయ్యిని అలాగే ఉంచి తలను వెనుకకు వ్రేలాడేసి వెన్నెముకను వెనుకకు వంచి వెనుక కండరాలూ, పెరుదుల కండరాలూ బిగబట్టుకొనేటట్టు చేయాలి. ఇప్పుడు ఎడమ కాలిని యథాస్థానంలో ఉంచి ఎడమచేతితో కుర్చీని పట్టుకొని కుడికాలుకు పని కల్పించాలి. ఈ విధంగా నాలుగుసారులు వ్యాయామం చేయాలి.

# పరాభవం

ఎమ్. అన్నపూర్ణాదేవి,
ముదునూరు, గన్నవరం తాలూకా.

శంఖచక్ర గదాపాణే
ద్వారకా నిలయాచ్యుత
గోవింద పుండరీకాక్ష
పాహిమాం శరణం గతాం.

పంచపాండవులకు భార్య ఐనటువంటి ద్రౌపదీదేవిని దుశ్శాసనుడు సభకు ఈడ్చుకువచ్చి చీరలొలిచేటప్పుడు. పైవిధంగా ప్రార్థించినది. ఆసమయంలో శ్రీకృష్ణ పరమాత్మ శ్రీ రుక్మిణీదేవితో పాచీక లాడుతున్నారు. అప్పుడే పందెం వెయ్యబోతున్నారు, శంఖచక్ర గదాపాణే! అని వినిపించగానే నా ఆయుధములను ధ్యానం చేస్తున్నారెవరా! అని పందెం వెయ్యకుండా తలవంచి ఆలోచిస్తున్నారు. ఆటనాదేలెండి. మీరెంత ఆలోచించినా వెయ్యండి పందెం! అంటూ అమ్మవారు. తొందరచేస్తున్నారు వెంటనే 'ద్వారకా నిలయా! అచ్యుత! గోవింద! అని వినబడినది.

నేను నివసించే పట్టణాన్ని, నన్ను ధ్యానంచేస్తున్నారే అంటూ కొంచెం తలపైకెత్తి చూచేటప్పటికి పుండరీకాక్ష పాహిమాం శరణంగతామ్. రక్షమామ్ అని వినిపించినది. వెంటచే చేతిలోఉన్న పాచికలను అక్షయం అంటూ విసరికొటారు. ఒక్కపందెంతో అమ్మవారి ఆటకట్టింది. అక్కడ ద్రౌపతీదేవికి అక్షయ వస్త్రాలు లభించినవి. ఇన్నివిధాల ప్రార్థించేటప్పుడు నేను ఇచ్చేది వస్త్రాలేనా. ఎంతో రుణపడినాను. అని అనుకున్నారు పరమాత్మ. ఎలాంటి కష్టదశలోనైనా ఎవరైనా ఈ శ్లోకాన్ని నిశ్చలమైన మనస్సుతో ధ్యానం చేస్తే ఆ కష్టాలు ఇట్టే పోతాయట!

మహా పతివ్రత, భక్తురాలు, ఐన ద్రౌపదీదేవి అవమానాన్ని చూచి ఆనందించటానికి, ధుర్యోధనునిభార్య, భానుమతి తోడికోడళ్ళను దాసీలను మేడమీదకు తీసుకొని వచ్చింది. అప్పటికే దుశ్శాసనుడు చీరలు లాగుచు ఆయాస పడుచున్నాడు. ఆ చీరలనుచూచి ఇన్నిలా కట్టిందా అని ఆశ్చర్య పడింది. ఆ చీరలు ధగధగ మెరసిపోతున్నాయి. బంగారపుజరీ అంచులు నవరత్నాల్లా మెరిసే పువ్వులు! కండ్లకు మిరిమిట్లు గొల్పుతూ జిగజిగా మెరిసి పోతున్నాయి. 'మనం ఎన్నడూ ఇలాంటి చీరలు కట్టుకొనిగాని చూచిగాని ఎరుగం. ఆహా ఇవి కట్టుకొంటే ఎంతబాగుంటామో కదా! అని అందరి మనస్సుల్లోను. ఒక్కసారి అభిప్రాయం కలిగింది. అబ్బ ఎంతబాగున్నై మానాన్న పెట్టలేదు. మాఆయన తేలేదు. ఇలాంటిచీరలు అంటూ వాటి యొక్క అందాన్నిచూచి బహు మోహ పడుతున్నారు కొందరు. అప్పుడే నారద మునీంద్రుడు హరినామ సంకీర్తన చేస్తూ అచ్చటికి వేంచేసినారు.

ఏం అలాచూస్తారేం అలాంటి చీరలు ఎప్పుడైనా కట్టగాని ముట్టిగాని ఎరుగుదురా! నాకే గనుక భార్యఉంటే ఒకటి మిగలకుండా తీసుకుపోయేవాణ్ణి. రాసులు రాసులుగా పెరిగిపోతున్నాయి. చూస్తారేం మీ దాసీలను పంపి తెప్పించుకోండి. సభలోకి అశేషప్రజవచ్చి కూర్చున్నారు. ఎప్పుడు తీసుకుపోదామాఅనిగుటకలుమింగుతున్నారు. వాళ్లులేచారాఅంటే ఒకటి మచ్చుకైనా దొరకదు. అని వాళ్లను రెచ్చగొట్టాడు. ఇంకేముంది అసలే కోర్కగా ఉంది. అందరు తీసుకుపోతారనేటప్పటికి పదండి పోయి తీసుకురండి అని అందరు దాసీలకు ఆజ్ఞాపించారు.

దాసీలు ఒక్క పరుగున మేడమీదనుండి క్రిందకు ఉరికేరా అన్నట్టు వచ్చిపడ్డారు. మనంకూడా కట్టుకుందాం అని ఆశకొద్దీ. మోయలేనన్ని చీరలు తెచ్చి మేడమీద పెట్టారు. నారదమునీంద్రుడు ఇక అక్కడ నిల్చోకుండా హరినారాయణ గోవింద, హరిమాధవ గోవిందా, అంటూ ధుర్యోధనుడు నిల్చిన సభలోకి వచ్చాడు. ఇక్కడ మహారాణులందరు వంటిమీద చీరలు విప్పి అవతల పారవేశారు. ఈ మాయచీరలమీద ఉంతే మోజుకొద్దీ. తొందర తొందరగా చీరలు కట్టుకున్నారు. కుచ్చెళ్ళు పోస్తున్నారు. కాని ఒకరిచేతికి కుచ్చెళ్లు పోసినట్టుగాని చీర ముట్టుకున్నట్టుగాని ఏమీ లేదు. ఈ అగ్గిపుల్లగారు (నారదుడు) సభలో వారందర్నీ చూచి మీకేమైనా మతిపోయిందా ఏమిటి ద్రౌపతీదేవి అక్షయవస్త్రాలేం చూస్తారు. ద్రౌపతీ వస్త్రాపహరణం చూడండి! ఎంతమంది ఎత్తుకుపోయి కట్టుకుంటున్నారో అలా కొంచెం తలఎత్తి ధుర్యోధన చక్రవర్తిగారి మేడవంక చూడండి అనేశాడు. ఏమిటా అని అందరూ ఒక్కసారి తలలు పైకెత్తారు. ఏం చెప్పమంటారు. సిగ్గు. సిగ్గు. ఒకరి వంటిమీదా బట్టలేదు! విడిచిన బట్టలు కట్టుకుందామని తహతహ లాడుచు తిరుగుచున్నారు. అవి ఎంతదూరాన పడ్డయో కనపడ్డం లేదు.

మహాభక్తురాలైన ద్రౌపతిని అవమానం చెయ్యాలని, పెద్దసభలోకి లాకొచ్చారు. కాని అంతరిక్షాన్ని అందుకొనే మేడమీద వందలాది స్త్రీలకు వస్త్రాలు లేకుండాచేసి వర్ణించడానికి వీలులేకుండా వగచి వగచి వాపోయేట్టు చేశాడు కృష్ణపరమాత్మ. భక్తుల బహిఃప్రాణాన్ని అని రుజువుచేశాడు.

## మెడకూ: బుగ్గలకూ

1. తిన్నగా నించోవాలి. చేతులు పిరుదుల మీద ఉంచాలి. మెడను సాధ్యమైనంతగా ముందుకు వంచాలి. మళ్లీ ఆ మెడ పైకెత్తి వెనుకకు సున్నితంగా వంచాలి. ఇప్పుడు వెనుకకు వంచిన తలను కుడికీ ఎడమకూ తాపీగా సున్నితంగా కదపాలి. ఈ విధంగా నాలుగు, అయిదుసార్లు.

2. వెనుకకు వంచిన తలను అలానే ఉంచి నోరు తెరవాలి. తెరచిన నోరును మెల్లగా ముయ్యాలి. ఈ విధంగా నాలుగైదు సార్లు చేయాలి.

## ఊపిరి వ్యాయామం

ఊపిరి వ్యాయామం, గుండెకు బలం చేయడంలోనూ ఊపిరి తిత్తులకు శక్తినివ్వడంలోనూ సాటిలేనిది. ఊపిరితిత్తులు చక్కటి ఆకారంలో పెరిగి నడుముకంటె రొమ్ము విశాలంగా పెరిగేటందుకు ఇది తోడ్పడ గలదు.

(1) ఊపిరితో వ్యాయామం చాలా సునాయాసమైనది. గాలీ వెలుతురూ ప్రసరించే కిటికీముందు నిలబడడం. ఊపిరి తిత్తులలో నిండుగా గాలిని పీల్చడం క్రమేపి పూర్తిగా వదలడం ఈ విధంగా అలవాటు చేసుకొని పీల్చే కాలాన్ని వదిలే [illegible] క్రమేపి వృద్ధిచేయాలి.

కొద్ది రోజుల తర్వాత:

గాలిని విడిచే సమయంలోనూ, గాలిని పీల్చే సమయంలోనూ చేతులను పైకెత్తి శరీరాన్ని క్రమేపి ముందుకు వంచి కాలి బొటన వ్రేలిని అందుకోవాలి.

(2) నిలబడి రెండు చేతులనూ భుజాలకు సమటంగా కుడి ఎడమలకు చాచాలి. మెల్లగా గాలిని పీలుస్తూ చేతులను వెనుకకు వంచాలి. చేతులు భుజాల మట్టానికి క్రిందికి [illegible]

(42-వ పేజీ చూడండి)



కిళాంబి జానకమ్మ
విజయవాడ

# ముగ్గులు



ఎ. అలమేలు
[illegible]

# నీరు మంజూరుమీద పోరు

మా ఎదురింటివాళ్ళు వాళ్ళ ఇంట్లో అద్దె కున్న వాళ్లు దెబ్బలాడుకుంటున్నారు. ఇంటావిడ తమిళంలో ఏదో గట్టిగా గబ గబ అరుస్తోంది. అద్దెకుండే ఆమె "ప్రొద్దుట నుండి ఒక బిందెనీళ్ళు పట్టుకోలేదు. అప్పుడే ఎనిమిది అయింది. ఎప్పుడు వంట చేసేది. పదింటికి ఆఫీసు కెళ్ళాల్సినవాళ్ళ నిలా యిబ్బందిపెడ్తే ఎలా?" అని అడుగుతోంది.

ఈ వూళ్ళో అంటే మెడ్రాసులో ఈ ఇంటివాళ్ళ పోరు పడడం చాల కష్టం. ఇంటివాళ్ళంటె ఇల్లుగలవాళ్లు అంతా ఇలా చేస్తారని కాదు. కొందరు మాత్రమే.

ఇంటి వాకిట్లో బోర్డు (to let) చూసి, ఇల్లు చూచుటకు వచ్చిన రోజున అంత తియ్యగా మాట్లాడిన వాళ్ళేనా, ఇప్పుడు ఇలా సాధిస్తున్నారు? అని తరువాత ఆశ్చర్యం వేస్తుంది.

ఇంట్లో రెండు కుళాయి లున్నాయి. మీకు నీళ్ళకేం ఇబ్బంది ఉండదు. 24 గంటలూ నీళ్లువస్తాయి అని ఇంకా తియ్యటి కబుర్లు చెప్తారు. చూసేవాళ్లు కాబోలు అనుకుంటారు. "దిగితేగాని లోతు తెలియదు" అన్నట్లు ఇంట్లో దిగితేగాని దాని సంగతి బయట పడదు. అసలు రెండు కుళాయి లున్నప్పటికి రెండు కుళాయిలలో ఒకే మారు నీళ్లు రావు. ఇంటివాళ్ల యింట్లో కుళాయి కట్టేగాని అద్దెవాళ్ల ఇంట్లో నీళ్లు రావు. ఈ సదుపాయము ఇల్లుగలవాళ్ళకే వుంటుంది. ఇంట్లో దిగిన కొన్నాళ్ళవరకు నీళ్లకు యిబ్బందిపెట్టరు. క్రమంగా ఈ మర్యాద సన్నగిల్లి వాళ్లకు అవసరము లేకున్నను పట్టి నీళ్ళను వృథాగా పారపోసి అయినా అద్దెవాళ్ళను ఇబ్బంది పెట్టుటకు వెనుదీయరు.

పోనీ ఇలా చేస్తారని ఇరుగు పొరుగు వాళ్ల యింట్లో నీళ్లు పట్టుకుందామా అంటే, వీరికి వారికి చుక్కెదురు. అందుకని అద్దె కున్నవారుగూడ ఇరుగుపొరుగు వాళ్లతో మాట్లాడకూడదు!

ఇక పోతే లైట్లదగ్గర మరో రభస. రాత్రి 10 అయేటప్పటికి లైట్లు ఆర్పేయాలి. (ఇది షరతు-ముందు చెప్పరు. ఇంట్లో దిగిన ఓ నెలకు చల్లగా బైటపెట్తారు.) పోనీ కరెంటుబిల్లు వారు కడ్తున్నారా అంటే అదీ లేదు. లైటుకు రూపాయీ, రేడియో వుంటే ఏ నాలుగో పుచ్చుకుంటారు. కాని

కోకా శ్యామల,
(మద్రాసు.)

రేడియో సాధ్యమైనంతవరకు పెట్టుకోకూడదు. వాళ్ల పిల్లలు చదువుకుంటారనో, పెద్దలు నిద్రపోతున్నారనో ఏదో ఒక వంక పెట్తారు.

ఇంకో రకం వారున్నారు. వీళ్ల పిల్లలకు. అద్దెకుండేవాళ్లు ఊరికే ట్యూషను చెప్తే మంచిది. ఆ మధ్య మాకు తెలిసిన ఓ టీచరు పాతిక రూపాయలు ఇచ్చి ఓభాగంలో అద్దెకుండేది. ఇంట్లో దిగిన పదిరోజులకు ఇంటావిడ తనపిల్లలు ముగ్గిరికి ప్రైవేటు చెప్పమని అడిగింది. ఈ టీచరు ఇంట్లోనే గదా అని తీరిక చేసుకొని ఓ గంటసేపు చెప్పితే అద్దె అయినా కలిసివస్తుందని ఒప్పుకుంది. ఒక నెల ప్రైవేటు చెప్పాను గదా అని ఆ నెల అద్దె ఇవ్వకపోయేసరికి రెండు రోజులవగానే ఆ ఇంటావిడ అద్దె ఇవ్వండి, అని చల్లగా అడిగింది. ఈవిడకి ఎక్కడలేని కోపమొచ్చింది. అదే బయట ఎవరికైన చెప్తే 30 రూపాయిలైనా వచ్చేవి. ఇంట్లో వున్నాను గదా అని తనివ్వాల్సిన పాతిక సరిపెట్టుకుంటే సంతోషించక ఇంకా అద్దె అడుగుతుందా అనిపిస్తుందిగదా.

ఆ మాటలే ఆవిడతో అనేసరికి ఇంటావిడ తారాజువ్వలా లేచింది. "నువ్వేం చెప్పావ్ నీ ముఖం. రోజుకి ఐదుగంటల సేపు చదువు చెప్తారు బడిలో. మేము కాని గూడ జీతం కట్టం" అంటూ అడిగేసింది. ఇంకేముంది! ఆ బడిపంతులమ్మ మరో చోటికి మకాం మార్చేసింది.

వీళ్లందరికన్నా మంచివాళ్లు మరొకరున్నారు. అద్దెకున్నవాళ్లు అజాగ్రత్తగా వదిలేసిన వస్తువులు వాళ్లు జాగ్రత్త చేస్తూంటారు. ఈ సంగతి దరిమిలా తెలుసుకున్నా అడగడానికి ఆధారాలేమీ వుండవు. పిల్లలాడుకునే బొమ్మలు, గ్లాసులు, రిబ్బన్లు, పెన్సిళ్లు, చిల్లర డబ్బులు వీళ్ళు తమ ఇంట్లో దాచి ఉంచుతారు. వీరిలో కొందరు రెండు, మూడు మెట్లు పైకి వెళ్ళి పెద్దవాటినే అంటే రిష్టువాచీలు, కమ్మలు, ముక్కుపుడకలు చక్కపెడ్తుంటారు. వీళ్ళే వీలైనపుడల్లా దొంగలనుగురించి ఉపన్యాసాలిస్తుంటారు.

అలా అద్దెకున్నవాళ్లను నానా బాధలు పెట్టుటకు వాళ్ళు చేసిన నేరమేమిటి ? అని వీరెప్పుడూ ఆలోచించరు. ఆలోచిస్తే వీళ్లిలా చెయ్యరేమో? అందుకే మా పిన్ని అంటూంటుంది. "పగవాళ్ళకుగూడ వద్దు ఇంటివాళ్ల పోరు" అని. ★

## చాదు చేయు విధము

పసిపిల్లలకు నీళ్ళుపోయగానే ముఖాన, బుగ్గన చాదుచుక్క పెట్టటం ఆచారం. పసిల్లలకు తిలకం పెట్టకూడదుట. నేనుచాదు చేయటం చెపుతాను.

కావలిసిన వస్తువులు: ఒక సవాపావు సగ్గుబియ్యం, గిద్దన్నర నీళ్ళు చాలు.

ముందు సగ్గు బియ్యాన్ని రాయీ రప్పా, లేకుండా శుభ్రంగా బాగు చేసుకోవాలి. కుంపటిమీద వెడల్పాటిగిన్నె పెట్టి అందులో ఈ బాగుచేసిన సగ్గుబియ్యాన్ని పోసి వేయించాలి. ఈ సగ్గుబియ్యం బాగా ఎర్రగా వేగి నలుపురంగుకు తిరిగే సమయానికి కొద్దిగా పొంగుతయి. అలా పొంగిన సమయంలో ముందే కొలిచిపెట్టిన నీళ్ళుపోసి కలపాలి. నీళ్ళు జాగ్రత్తగా కొలిచి పోయాలి.

నీళ్ళు ఎక్కువయితే చాదు పల్చనై బాగుండదు. నీళ్ళు పోగానే కిందకుదించి పప్పుగరిటతో సగ్గుబియ్యాన్ని మెత్తగా ఎనపాలి. పది నిముషాలపాటు ఎనిపేసరికి సగ్గుబియ్యం నీళ్లలో కలిసిపోయి తుమ్మగోదుకు మల్లే తయారవుతుంది.

అప్పుడు కావలసినవారు అందులో 4 సెంటుచుక్కలు వేయవచ్చు. ఇష్టమయిన వారు కచ్చూరాలుకూడా మెత్తగా కొట్టి వేయవచ్చు: తరువాత దీనిని చిన్నడబ్బాలో కాని కొబ్బరి చిప్పలోకాని పోసి రెండు రోజులపాటు ఎండలోపెట్టి ఎండనివ్వాలి. రెండురోజులు ఎండేసరికి బాగా గట్టిపడిపోతుంది.

తరువాత కావాల్సినప్పుడల్లా ఒక్కచుక్క నీళ్లుచల్లి అరగదీసి వాడుకోవచ్చు. ఈ చాదు తళతళ మెరుస్తూ చాలా బాగుంటుంది. ముఖ్యంగా పసిపిల్లలకు ఉపయోగం. ★

నిర్మల, (గుంటూరు)

ఉత్తరాలు:

# సవాలూ; జవాబూ

ఎంతయిన మనందరమూ ఆంధ్రులము. నాకేమై గొప్పవస్తుందా ఆనందం కలుగుతుందా మనరాజధాని అయిన హైదరాబాద్ నునిందిస్తే. ఉన్నదిఉన్నట్లువ్రాస్తే ఉలుకెక్కువట. నేను వ్రాసింది జరగపోతే ఊహించి రాసేననా ఛాయాదేవిగారి ఊహ. ఈ 'గిరాకీ' గురించి ఎంతోమందిని మంచీచెడ్డా వివరంగా తెలుసుకొని వ్రాశానే కాని నా ఊహ ఏమాత్రము కాదు. ఇంతెందుకు కావాలంటే ఇప్పుడు ఇతర ప్రదేశముల నుండి వచ్చిన వారిని అడిగి చూడవచ్చును. ఎంతోమంది మా ఇంటికి వచ్చినవారు, ఇంకా మేము వెళ్ళిన వాళ్ళ ఇంటిదగ్గర, అడిగితే మా ఇంట్లో 'ఇట్లా ఉందంటే, మా ఇంట్లో ఇట్లా ఉందని' ప్రతివారు ఏదో ఒక ఇబ్బంది గురించి చెప్తూనే వచ్చారు. నిజంగా నాకు చాల ఆశ్చర్యమే ఛాయాదేవిగారింట్లో పనిమనిషి అంతపని చేస్తోందంటే.

మా ఇంట్లో చిన్నపిల్లలు లేరు. పై పనులు చూడ్డానికి అంతకన్నా అక్కరలేదు. ఎందుకంటే దానికి వేరే పనివాళ్ళు ఉంటారు. ఇంక బట్టలు ఉతకడము మాటకొస్తే మా ఇంట్లోనే ఒకచాకలి ఉన్నాడు. వాడు ఏరోజు బట్టలు ఆ రోజు ఉతికి, ఇస్త్రీ చేస్తాడు, కాబట్టి పనిమనిషి బట్టలు కూడ ఉతకనక్కరలేదు.

సరే ఇంక "చాయ్, నాస్తాలివ్వడము మాట కొస్తే ఒక్క మా పనిమనిషే కాదు మా ఇళ్ళు ఉన్నవాడ హిమాయత్ నగర్ లో ముఖ్యముగా మా వీధిలో ఉండేవాళ్ళంతా కూడ అట్లాగే చేస్తున్నారు. వాళ్ళంతా ఇక్కడ స్థిరనివాస మేర్పరచుకొన్న వారే. వారు మేమిచ్చేటంత జీతము ఇవ్వరు, ఎందుకంటారేమో, వారి ఇళ్లలో అధమము 5 లేక 6 సం॥ల నుండి ఉంటున్నవారు ఎట్లాపోతారు చెప్పండి. కాబట్టి మేము 20 రు 25 ఇస్తే వారు 16 రు 18 ఇస్తున్నారు. వారందరికీ తోటపనికి వేరేపనివాళ్లుఉన్నారు. పనిమనిషి నెయ్యదట. అందుకని విధిలేక తోటవానికి తాహతుకొద్ది ఇచ్చిపెట్టికొంటున్నారు. ఇంక వాళ్లుకూడ విధిగా ప్రొద్దున్న 'చాయ్, నాస్తా' మధ్యాహ్నము భోజనము, సాయంత్రము టీ తప్పక ఇస్తున్నారు. ఇదంతా నేను అందరిని అడిగి బాగా తెలుకొని వ్రాసిందికాని ఊహాలు పోగేసి వ్రాసిందికాదు.

మా పనిమనిషి రోజంతా ఉండదు. ఏ పూటకాపూట రెండు లేక మూడుగంటలలో పూర్తిచేసుకొని పోతుంది. మరి దానికేమంటారు.

పోతే మాపక్కింటివారు పనిమనిషికి మజ్జిగలో ఇచ్చిన గిన్నె ఛాయాదేవిగారి ప్రకారము, పోలేదని అర్థము. మరిగిన్నె పోయింది. అడిగితే అసలు ఇవ్వలేదంది. పాపము! ఆవిడ చేతితో ఇచ్చిన గిన్నె. అందులోను ఆయిల్లాలు చాల జాగ్రత్త అయినది. ఏదో పని తొందరలో ఉండి వంటవాడు ఎక్కడికో వెళ్ళితే తానే పోసి ఇచ్చింది. మరుసటిరోజు అడిగితే గిన్నె లేదంది. పనిమానుకుని వెళ్ళింది. కావలంటే చాయాదేవిగారు అడగవచ్చును.

చింతపండు బహుశ చాయాదేవిగారి ఇంట్లోను, ఆవీధిలోను అడగక పోవచ్చును. నాకు తెలిసినంతమటుకు మావీధిలో అందరు వేస్తారు. బిందెలకీ వాటికి చింతపండు ఇవ్వకపోతే వాటి తెలుపు వర్ణించ నవుసరము లేదు. సరే ఛాయాదేవి గారన్నారని ఆరోజు చింతపండు వేయటము మానివేసినాము. అదంది గదా చింతపండు వెయ్యకపోతే సామాను ఎలా తెల్లపడుతుంది అని ఎదురు ప్రశ్న వేసింది. అవును మట్టిలో తోమితే గిన్నెలు గీతలు పెట్టుతారు అంతేగా లేడా! చింతపండు ఇవ్వకపోతే?

బహుశ కొన్ని కొన్ని పేటలలో పనిమనుషులు చవకగా దొరకవచ్చును. కాని మా వాడలో నాకు తెలిసిన వారికి ఎవ్వరికి చవకగానూ, ఛాయాదేవిగారింటి దగ్గర చేసినన్ని పనులు చేయుటకూ ఎవ్వరు ఒప్పుకోలేదు. వాళ్లకేం ఈఇల్లు లేకపోతే ఇంకొక ఇల్లు.

బహుశ ఛాయాదేవిగారింట్లో . చెట్లకినీళ్లి పోస్తుండవచ్చు. కాని ఇక్కడ ఎవ్వరింట్లోను పొయ్యటము లేదు. ఈవాడలో కొత్తగా దిగిన ఉద్యోగుల మంత్రుల శ్రీమతులందరికీ ఈ సంగతి తెలుసును.

ఇంకా బజారు కెళ్లండి. వాళ్ళు చెప్పతారు "చాలు లేవమ్మ! మీరంతా వచ్చి ఈ రేట్లు ఎక్కువచేసి నారు" అంటారు. వాళ్లే కాదు. ఇక్కడ స్థిరనివాస మేర్పరచుకొన్న వాళ్లంతా అదేమాటంటారు. ఏది కొనపోయినా గిరాకీ "మీరు వచ్చేరు; మా హైదరాబాదులో ధరలు పెంచేశారు" అని. ఇది నిజమా కాదా! ధరలు పెరిగినమాట?"

నేను ఈ వాడలో నాలుగిళ్ళ పరిస్థితులూ చూచి, వినీ తెలుసుకొనీ వ్రాసినాను. కాని ఒక్క మా గురించి మాత్రమే వ్రాయలేదు. ఛాయాదేవిగారు నేను ఏదో గొప్పకి, దర్జాకి వ్రాశాననటం అంతకన్నా విడ్డూరము.

కె. అన్నపూర్ణ రామారావు,

—(హైద్రాబాదు)

*　　*　　*

## అక్షరాలా నిజం

23-1-57 ఆంధ్ర వారపత్రికలో శ్రీమతి ఛాయాదేవిగారు రాసిన వ్యాసం చదివాను. ఛాయాదేవి గారు రాసింది అక్షరాల నిజం. కానీ అన్నపూర్ణగారు మరి ఎందు కట్లా రాశారో తెలియదు. మేము పుట్టింది ఇక్కడ, పెరిగింది ఇక్కడ. మా తాతగారు ఇప్పటికి 30 ఏండ్ల నుండి యిక్కడ ఉంటున్నారు. మాది పెద్ద కుటుంబం. పెద్ద ఇల్లు. ఇంటి ముందు తోట ఉంది. మేము మా పనిపిల్లవానికి నెలకు ఇరవై రూపాయలు ఇస్తాము. అన్నపూర్ణగారు రాసినట్లు, వాడు గిన్నెలు తోమి ఇల్లు ఊడ్చిపోడు. ప్రొద్దుట. 5 గంటలకు వస్తే రాత్రి 7 గంటల వరకూ అన్ని పనులూ చేసి అప్పుడు ఇంటికి పోతాడు. అంట్లు తోమటానికి బట్టలు ఉతకటానికి వేరే ఆడమనిషిని పెట్టుకున్నాము. 10 రూపాయలే ఇస్తాము. ఇక నెలరోజులకే 80 రూ॥ సామాను పోయాయని రాశారు. మా ఇంట్లో ఇంతవరకూ ఒక గిన్నె గాని, ఒక్క సొమ్ము గాని పోలేదు. మరొక సంగతి. అన్నపూర్ణగారు శేరు మిరియాలు తొమ్మిది రూ॥లకు కొన్నారని అని రాశారు. ఊరంతా కనుక్కున్నా అంత ఖరీదు ఎవరూ చెప్పలేదు. 6-0-0 శేరు. ఏదో పాలూ కూరలు ధరలు పెరిగాయికాని అంత అన్యాయంకాదు. ఎప్పటికి అన్ని ఊళ్ళకంటే మన రాజధానే నయం.

కామేశ్వరీ భగవాన్లు,

(హైద్రాబాదు).

*　　*　　*

## అంత కోపమా?

శ్రీమతి ఛాయదేవిగారు చాల విడ్డూరంగా మాట్లాడినారు. ఉన్న పరిస్థితులను చూసే ఛాయదేవిగారు, అంతకోప

 ఒళ్ళు వొంచి చాకిరికి మళ్ళితే? 

పడడం సబబుకాదు అనిపిస్తుంది. హైద్రాబాదులో పరిస్థితి అదేగా? ఛాయదేవిగారికి అంత చవుకగా, ఎక్కువపని చేయడానికి అలాటి పనిమనిషి దొరకడం అదృష్టమే. అలాటివారు ఒకరు వుంటారు కాని అందరు అలా వుండరు. ఈమాత్రము దానికే హైదరాబాదువాళ్లు ఏమనుకుంటారు?

* * *

## ఇది న్యాయము కాదు

ఆంధ్రప్రదేశ్ రాజధానియైన 'హైదరాబాద్'లో పనిమనుష్యులగురించి' ఇతరుల గురించీ ఈమధ్య నిజంగానే విడ్డూరంగా వ్రాశారు. ఈ విషయంలో నేనూ శ్రీమతి ఎ. ఛాయాదేవిగారితో ఏకీభవిస్తున్నాను. వారు అయిదారేళ్లనుంచి నివసిస్తున్నామని వ్రాశారు కాని మేము అంటే నేను హైదరాబాద్ నగరంలోనే పుట్టాను. పెరిగాను. చదువుచున్నాను కాని వారు వ్రాసిన విషయాలు నిజంగా జరుగుతున్నాయా? అని నాలో నేనేఆశ్చర్యపోయానంటేనమ్మండి. 'అదిగో పులి అంటే ఇదిగో తోక అంటారు కాబోలు' పైవూరివారు. కాని హైదరాబాద్ లో పై ఊరువారుభయపడవలసినంతగా మోసగాళ్లు లేరని నేను ఘంటాపథంగా చెప్పగలను. ఆమాట కొస్తే తక్కిన స్థలములో మనుష్యులకంటే మెరుగే ననుకుంటాను. ఇతర స్థలములలో నేను చూచి తెలుసుకున్న దానినిబట్టి ఇలా వ్రాస్తున్నాను.

ఇక పనిమనుషుల సంగతి. మా ఇంట్లోను పనిమనిషికి 10 రూ ఇస్తాము. ఛాయాదేవిగారు చెప్పినట్లే అన్ని పనులూ చేస్తారు. మాపనిమనిషీ చీకటితోనే వచ్చిపనిచేస్తుంది. కాని వారిలో చెప్పదగిన మోసము లేదంటాను. వారు పదియిళ్ళూ చేసుకుంటారు. ఒకమనిషి అంట్లుతోమి నెలకుక నీసం 30 లేక 40 రూపాయలు సంపాదించి కుటుంబానికి సాయంగా వుంటుంది. కాని రోజంతా ఒక్క యింట్లోనే ఉండాలంటే నిజంగానే రూ 25 తీసుకుంటారు. అందుకు సందేహము లేదు.

(కుమారి సరస్వతి సికింద్రాబాద్)

## అదే సబబు

శ్రీమతి అన్నపూర్ణ రామారావుగారి రచన మీద ఏ. ఛాయాదేవిగారి అభిప్రాయం చూచేసరికి చాలా ఆశ్చర్యమేసింది. ఛాయాదేవిగారు హైదరాబాదులో ఐదుఏళ్ళబట్టి ఉన్నారు. కాబట్టి వారికి హైదరబాదులో ఇప్పటి పరిస్థితి అర్థమయినట్టు లేదు. హైదరాబాదుకు నవంబరు ఒకటినుండి విపరీతమైన విలువ వచ్చింది. ఒక్కసారిగా మా సనత్ నగర్ లో వెయ్యికుటుంబాలు వచ్చిపడేసరికి ఒకపనిమనిషేగాదు, డబ్బు రాబడిగల ప్రతివాడూ పైకెక్కి కూర్చున్నాడు. అసలు చెప్పొచ్చేదేమిటంటే, ఇక్కడికి వొచ్చింది నేను, మాఅన్నయ్య, మా వదినగారూ ను. సనత్ నగర్ కి వచ్చి ఒక చిన్న ఇంట్లో దిగాము. ఆరోజే ఎవరోఒక ఆడమనిషివచ్చి పనిమనిషి కావాలా అనిఅడిగింది. కావాలని చెప్పాము. మరునాడు వస్తానని చెప్పి వెళ్లింది. మరురోజు ఎవరో మొగాడితో వచ్చింది. భర్తకాబోలు, మాట్లాడేందుకు. సరే ఎంతివ్వాలిఅని అడిగాము. చెయ్యవలసినపనేమిటి-అంట్లు తోమడం, కసువు ఊడ్చడం-అంతేనాండి? అలా, ఇద్దరు కొనే పాలోచించారు. ఇరవైమీద ఐదురూపాయలమ్మగారు అన్నారు. మావదినకి గుండె ఆగినంతపనైంది. ఇంకేమి మాట్లాడాలి అదిఅంత అడిగినప్పుడు, క్లియర్ గా చెప్పాము చేయవలసినపని నీపని అక్కర్లేదు. నీవు అక్కర లేదు వెళ్ళిపొమ్మన్నాను. పోనీలే బీస్ (20) రూపాయలిమ్మంది. 4 రూపాయలిస్తామని చెప్పాము. అంతే ఆపనిమనిషి ఇంతవరకు తిరిగిచూళ్ళేదు. ఇంతవరకు నేను మావదిన

ఇంటిపనంతా చేసుకొనిపోతున్నాము. ఇరుగు పొరుగులవారు ఒక వంట సామాను తోమ డానికి ఏపదో ఇస్తున్నారు.

ఒక్క పనిమనిషులేమిటి అంతా కాస్టీగా తయారయింది. ఇదివరకు టొమాటో శేరు అర్ధణా ఉండేదట. ఇప్పుడు శేరు 4 అణాలయింది. అన్నీ అంతే. కానికి 4 తమలపాకులు. ఇక ఛాయాదేవిగారికి ఐదు వీళ్ళనుండి చక్కని పనిమనిషి అంత చవకగా (వారిదృష్టిలో) దొరికిందంటే నిజంగా వారు అదృష్టవంతులే. కర్నూలునుంచి వచ్చిన తరువాత ఇక్కడ ఖర్చులన్నీ ఒకటికి నాలుగింతలు పెరిగిపోయాయంటే నమ్మండి.

కె. ఎస్. సువర్ణ, (హైదరాబాదు.)

* * *

## ఒళ్లువొంచి చాకిరి మళ్లితే?

"పెరిగిన గిరాకీ" అనే వ్యాసంలో అన్న పూర్ణా రామారావుగారు కేవలం వారి పని మనిషెలా ప్రవర్తించిందో చెప్పారంతే. దానివల్ల యితర వనితలు నేర్చుకోగల నీతి, అనుసరించతగు మార్గం ఏమిటి? కనీసం "పని మనుషులవల్ల నిటువంటి కష్టనష్టాలుంటాయి గనుక, సాధ్యమయినంతవరకూ పనిమనుషులవ సరం లేకుండా, మనమే గృహకృత్యాలు నిర్వ ర్తించుకోవాలి" అని గ్రహించటం మంచిది పనిమనుషులతో పరితపించే వనితలంతా ఒళ్ళువొంచి చాకిరికి మళ్లరాదా? ఇంతకి గృహకృత్యాలేమేమిటి? అంట్లు తోమటం, వాకిళ్ళు వూడ్చి కళ్లాపు చిమ్మటం. ఇల్లు తుడుచుకోటం. ఇవి పాచిపనులు. తర్వాత వంట, వడ్డన. పిల్లలని శుభ్రంచేయటం. ఇంకా సమయానుకూలంగా సంభవించే చిట్టి పొట్టి పనులు. పనిమనిషితో బాధపడేవాళ్ళు, పనిమనిషివల్ల కలిగే కష్టనష్టాలని తట్టుకోగల ఆర్థికస్తోమత లేనివాళ్ళు, పనిమనిషిని పెట్టు కోటం దేనికి? చింతించటం దేనికి? గృహ కృత్యాలంటే మనమింత జడిసిపోతాంగాని, పాశ్చాత్యులు గృహకృత్యాలనతి చిన్న పనిగా భావిస్తారట.

5 గంటలకు లేస్తే కాలకృత్యాలు తీర్చు కొని, అంట్లు తోముకొని, వాకిళ్ళు వూడ్చు కోటానికి 1 గంటఎక్కువే. అప్పటికి భళ్ళున తెల్లవారుతుంది. పక్కలు తీసేసి, యిల్లు స్వయంగా, శుభ్రంగా వూడ్చుకొని 7 గం. లకి ఎంత మందగొడి మనుషులయినా వంట లో దిగొచ్చు. వంట చేసుకొంటూనే చిన్న పనులు, పిల్లలికి నీళ్లు పొయ్యటం తలలు దువ్వటం, స్కూలుకి పంపటంలాంటివిచేసు కోవచ్చు. 10 గంటలలోపులో వంట తేలిగ్గా చేసెయ్యొచ్చు. అసలు బస్తీ వాళ్ళకిచెప్పాలో దగ్గపనులే వుండవు. ఊడవటానికి పెద్ద పెద్ద వాకిళ్ళుండవు. అలకటానికి మట్టినేలలుండవు సాధారణంగా బస్తీలలో వుమ్మడి, సంసారా లసలే వుండవు. ప్రతీసంసారం చిన్నదిగానే దాదాపు పదిమంది లోపుగానే వుంటుంది. ఒకవేళ, పెద్ద కుటుంబాలున్నా, అందరూ తలాకపనీ చేసుకొంటే ఎంతసేపు?

అసలు పల్లెటూళ్ళలో పని మనుషుల గొడవే ఉండదు. వందెకరాల మాగాణీవున్నా స్వయంగా అన్ని పనులూ చేసుకొంటారు. మనకింతాస్తి వుందనే ధ్యాసేరాదువాళ్ళకి. పల్లెటూరిపనులుచెప్తే బస్తీ సుకుమారులు వాడలిపోవచ్చు. ప్రతీయిల్లూ విశాలంగాపెద్ద పెరడుతో వుంటుంది. రోజువారీ, చేసు కొనే గృహకృత్యాలే గాక, కనీసం నెలకో సారయినా యిల్లంతా అలుక్కొంటారు. వేసంకాలంలో ఏడాదికి సరిపోయే చింత పండు బాగు చేసుకొంటారు. కొందరు కారాలుకూడా కొట్టుకొంటారు. ఇంకా కందులు, పెసలు, మొదలైనఅపరాలని సమ యానుకూలంగా బాగుచేసికొని డబ్బాలలో (బూడిదకలిపి) పోసుకొంటారు. ఇదేవిధంగా చెయ్యగలవన్నీ చేసుకొంటారు. అందరూ యింతేననిగాదు. నూటికి తొంభైమంది. అసలిప్పటికే పూర్వపు పద్ధ తులు పోయాయని గోల పెడుతుంది నాయ నమ్మ. పల్లెటూరివాళ్ళు స్వయంగా చేసే పనులు, బస్తీ వాళ్ళు డబ్బిచ్చి చేయించు కొంటారు. ఇదే తేడా.

పనులు చేసుకోవటానికభిమానపడతారు కొందరు. ఎవరైనా చూస్తారేమోనని సిగ్గు పడతారు. చూచినా తప్పేముంది? వాళ్ళూ సంసారులు కారా? మనం చేసుకోటానికి బొత్తిగా కుదరనిపనే ఇంకోళ్లచేత చేయించుకోవాలి. అత్యవసరంగా ఇతర్ల సహాయం కావలసిన వాళ్ళకి, అంటే గృహకృత్యాలు చేసుకోటా నికి వీలుపడని వుద్యోగస్థులకి, చేసుకోగల ఓపిక లేని బలహీనులకి పనిమనుషులు కావాలి గాని, ప్రతీ యిల్లాలికీ పనిమనిషి దేనికి?

మన దినచర్యలో గృహకృత్యాలకి మించి చేయవలసిన రాచకార్యం వుండదు. ఇటు వంటప్పుడు లేనిపోనిదుబారాఖర్చులెందుకు? తాహతుంటే ప్రతీ సఖాన్నీ అనుభవించు. అలా తాహతు గలవాళ్ళు "మేము పనిమనిషి వల్ల చిక్కులు పడుతున్నామని" చెప్పాలో నక్కర్లేదు.

కొందరు బాధ్యతంతా పనిపనిషిదేనన్నట్లు ప్రవర్తిస్తారు. ఓసారి నే నొకరింటికెడితే సమయానికి ఆ ఫ్రెండు లేక, ఆవిడ తల్లి ఆహ్వానించింది. నేనా కుటుంబానికి చిరపరి చితురాలనే. చావడిఅంతా నానా కంగా ళీగానూ ఉంది. నన్ను చూస్తూనే, "పని మనిషింకా రాలేదమ్మా. సాయంత్రం గాని రాదు. అవతల గదిలో కెడదాం, రా" అని ఇంకో గదిలోకి తీసికెళ్ళింది.... ఇంతకీ ఏమి టంటే పనిమని షొచ్చేవరకూ అలా వుండవల సిందే చావిడి! పనిమనిషికోసం ఎదురు చూస్తామా? మనింటిని మనమే శుభ్రం చేసు కొంటామా? నీకు లేని బాధ్యత, డబ్బుకోసం పనిచేసే పనిమనిషి కొస్తుందా?

మన యింటి పనులు మనమే చక్కబెట్టు కుంటే ఆరోగ్యం, సంతృప్తి, చురుకుతనం, శుభ్రత లభిస్తాయి. పనంటే భయపడ కూడదు. లేనిపోని గొప్పలకి పోకుండా ఆర్థిక స్థితి నవగతం చేసుకొంటూ ప్రవర్తించటం శ్రేయస్కరం. ఖానిసలా కష్టపడి రాణిలా అనుభవించడం నేర్చుకోవాలి. కష్టే ఫలీ. ★

—దద్దనాల రంగనాయకమ్మ,

(బొమ్మిడి).

## స్త్రీలు—వ్యాయామం

(36-వ పేజీ తరువాయి)

రాకూడదు. మళ్లీ చేతులు శరీరానిక్కి ఇరు ప్రక్కలకూ వచ్చేసమయంలో గాలిని మెల్లగా విడవాలి.

(8) రెండు చేతుల మధ్యా ఒక తుండు గుడ్డ ఉంచుకొని చేతులు రెండూ కలిపి ముందు ఉంచుకొని గాలిని మెల్లగా పీలుస్తూ క్రమంగా చేతిని ముందుకు తీసుకొని తదుపరి పైకెత్తి తర్వాత వెనుకకు మళ్లించాలి. చేతులు పూర్తిగా వెనుక భాగంలోకి వచ్చిన తర్వాత క్రమంగా గాలిని విడుస్తూ సక్ర మంగా చేతులు పైకి తర్వాత ముందుకూ మళ్లించాలి. రోజుకు 5 సార్లు ఇలాచేయాలి.

(మిగతాది వైవారం)

# ★ పిచ్చి శంకరం ★

(34-వ పేజీ తరువాయి)

తర్వాత ఆ పుస్తకాలతో నీ కెటువంటి సంబంధమూ లేదు. తెలిసిందా? అన్నాడతను సీరియస్‌గానే!

శంకరం క్షణం నిరుత్తరంగా నుంచొని, 'సరే నండీ!' అన్నాడు.

"ముఖ్యమయిన విషయం-ఈ రహస్యం ఎవరికీ తెలీనివ్వకు."

"సరే నండీ."

"నీ పేరు?"

"శంకరం."

"ఇదో-శంకరం! నీకు చాలాగట్టిగా చెబుతున్నాను. ఈ అనువాదాలు నువ్వు చేస్తున్నట్టుగా-నీకూ, నాకూ తప్పితే మరెవ్వరికీ తెలీనివ్వకు. అలా తెలిసినందువల్ల నా కేమాత్రం నష్టంలేదు. నీకే" అన్నాడాయన అధికార స్వరంలో.

"నే నెవరికీ చెప్పనండీ," అన్నాడు శంకరం.

"ఉ(-నిన్నెవరయినా, ఏం ఉద్యోగం చేస్తున్నావని అడిగితే, నా దగ్గర సెక్రటరీనని చెప్పు. తెలిసిందా" అన్నాడతను.

తర్వాత-"ఇదో, ఈ పదిహేను రూపాయలూ తీసుకువెళ్ళు...పాలడబ్బా అంటున్నావుగా," అంటూ మూడు ఐదు కాయితాలు అందించాడతను. అంత ముఖం చేసుకొని, మెట్లుదిగాడు శంకరం.

అతనొక ప్రచురణకర్త. తెలుగు నవలలూ, కథలూ అవీ ప్రచురిస్తూ ఉంటాడు. వ్యాపారం కిటుకులూ అవీ తెలిసిన గడుసరి. పట్టలేని సంతోషంతో సిగరెట్టు ముట్టించాడతను.

* * *

కొద్దిరోజుల్లోనే ఎన్నో బెంగాలీ, ఇంగ్లీషు అనువాదాలు బయటకు వచ్చాయి. ఆ అనువాదాలు ఎంతో బాగున్నాయి. కానీ, అవి శంకరంఅనువాదాలని ఎవరికీ తెలీదు. అంతా ప్రచురణకర్తనే మెచ్చుకున్నారు. అందరూ అతని అనువాదమే అనుకుంటున్నారు.

మరికొన్ని అనువాదాలు 'అతని' కూతురు పేర వెలువడ్డాయి. బాగా అమ్ముడుపోయాయి. శంకరం ఒక విధంగా రవ్వంత బాధపడ్డాడు. తానూ ఒకప్పుడు రచయితే. తననీ అందరూ మెచ్చుకుంటారని అనుకున్నవాడే. కానీ-అతనికి బానిసఅయ్యాడు. ఐతే, తన పెళ్ళాం పిల్లలూ కొంతవరకూ సుఖపడుతున్నారని సంతోషించేవాడు శంకరం.

* * *

కొద్ది రోజుల తర్వాత-శంకరం ఆరోగ్యం చెడిపోయింది! పదిరోజుల్నుంచీ మంచం మీదనే ఉన్నాడు.

అతనే శంకరం యింటికి వచ్చేడు.

"ఇంకా నీ జబ్బు నయంకాలేదా?" అని అడిగాడు.

"లేదండీ!" అన్నాడు శంకరం.

"ఇంకా ఎన్నాళ్ళయ్యా...ఈ రోగం?" అని అడిగాడతను.

"మరోవారం మంచంమీద ఉండాలని డాక్టర్ అన్నాడండీ!" అన్నాడు శంకరం.

"ఎలాగయ్యా!...జీతం మాత్రం కరెక్టుగా పుచ్చేసుకుంటావు. ఈ నెల సగం జీతమే యిస్తాను. మీలాటి వాళ్ళకి ఉద్యోగాలే యివ్వకూడదు" అంటూ, కూకలేశాడు అతను.

శంకరంకి మండిపోయింది—

"ఏమిటండీ......మీరు వెలగబెడుతున్నారు?...మీకు వందలకు వందలూ లాభాలు వస్తూంటే, తొంభై రూపాయలే కదా...యిస్తున్నారు. మీకు వచ్చిన వందలూ ... నాకు మీరిచ్చిన తొంభైలూ లెక్కపెట్టండి...వెయ్యోవంతయినా ఉందా? మీకు ఒక్క రూపాయలేకాదు. పేరుకూడా వస్తోంది! పైగా, రోగంతో తీసుకుంటే ... సగంజీతం యిస్తారా?" అని నూటిగా అడిగాడు శంకరం.

"అదికాదు—"

"ఏదికాదండీ!...ఉన్నపళంగా అసలు విషయం బయటపెడితే......మీగతేమవుతుంది?..."—కోపం పట్టలేక పోయాడు శంకరం.

"శంకరం! శాంతించవయ్యా...! ఏమిటాకోపం?...పదిరోజులు అయింది కదా, ఇంకా జ్వరం తగ్గలేదా...అని డాక్టర్‌మీద వెయ్యాల్సిన కేకలు నీమీద వేశాను. అంతే—అమ్మా! కొంచెం జాగ్రత్తగా చూసుకో...! ఇదో, ఈనెల జీతం మీ ఆయన పట్టి దుడుకుమనిషి... నే వెళ్ళి మా ఇంటిడాక్టర్‌ని పంపిస్తాను. ఎంబీ ... బియ్యెన్నూ; మంచివాడు. బిల్లుకూడా తర్వాత తాపీగా చేస్తాడు. అతన్ని పంపిస్తాను. వస్తానమ్మా!" అంటూ, ఎంతో అభిమానంగా, ఎంతో తియ్యగా చెప్పి, తొంభై రూపాయలూ ఇచ్చి బయటకు వచ్చాడు అతను.

వీడు ఎలాఅయినా పీకెలమీద కత్తే అనుకున్నాడు.—జీతాలిచ్చి, అనువాదాలు చేయిస్తాడని కొందరు అనుకుంటూనే ఉన్నారు. "ఈ విషయం 'శంకరమే' బయటపెట్టి ఉండాలి!" అనుకున్నాడు అతను. కానీ, శంకరం ఆ విషయం యింతవరకూ ఎవ్వరితోనూ అననేలేదు.

అతను ఏదో ఎత్తువేశాడు. నిశ్చింతగా వచ్చేశాడు.

అతను పంపిన డాక్టర్ వచ్చి, శంకరానికి ఇంజక్షన్ ఒకటి యిచ్చి... "పర్వాలేదమ్మా! తగ్గిపోతుంది!" అని, ఓ విషపు నవ్వు నవ్వేడు.

కొద్దిరోజులు మంచంమీదనే ఉన్నాడు శంకరం.

శంకరం పిచ్చివాడు! అతనికేమీ తెలీదు. బుర్ర పూర్తిగా చెడిపోయింది! చాలా తక్కువ కాలంలోనే... వీధి ఎక్కిపోయేడు!

పెళ్లాం, పిల్లలూ ... అందర్నీ మరిచిపోయాడు! గతం ఏమాత్రం గుర్తులేదు...

అతను ఉన్నాడు; శంకరం ఉన్నాడు. శంకర్ధం అనువాదాలూ ఉన్నాయి. కానీ అవి శంకరం అనువాదాలని ఎవరికీ తెలీదు. శంకరం పిచ్చివాడవడానికి కారణం 'అతనే' అని ఎవరికీ తెలీదు. అతని పేర ఉన్న అనువాదాలు 'పిచ్చిశంకరం'వి అంటే...ఎవరూ నమ్మరు! సరికదా... నవ్వుతారు. ★




# ఒప్పందం

పెరటిలోని జామచెట్టు
పైన చిలుక ఉండెను
చెట్టు క్రింద పైకి చూస్తు
చిట్టిపాప ఉండెను.
పైకి చూచుచున్న పాప
పలికె నిట్లు చిలుకతో

"రామచిలుక నీవు చాల
రమ్యమైన దానవు
చిక్కనైన రంగులతో
చక్కనైన దానవు

చిట్టిపాపలంటె నీకు
ఇష్టమందు రందరు
చిట్టిపాప పలుకుచుండ
చిలుకపలుకు లందురు.

కాన నీకు నాకు ఇపుడు
కలిగ చెలిమి మిత్రమా!
చెలిమి నిలువ చిరకాలము
కలదు ఒక్క మార్గము-

ఒప్పందము నొకదానిని
చెప్పకొంద మిప్పడే:
చెట్టు ఎక్కలేని నాకు
చక్కనైన పండు చూచి
కొమ్మపైన ఉన్న నీవు
కోసి క్రింద వేయుము.

నేను నీదు పెండ్లినాడు
నీదు మేలు మరువక
నాట్యమాడ వత్తునోయి
.నమ్ముమోయి మిత్రమ!

చిలుక ఒప్పకొన్నదేమొ
చెలిమిమీర జార్చెను
పండు నొకటి క్రింద నున్న
పాప సంతసించగ!

# కొంగపిల్ల

అనగా అనగా ఒక కొంగపిల్ల. భలే అందంగా ఉంటుంది. ఆవాళ కొంగపిల్ల ఒక్కటే గూట్లో ఉంది. దాని అన్నలిద్దరూ చెల్లెలూ ఇదివరకే ఎగిరిపోయారు. మన కొంగపిల్లమాత్రం ఎరగడానికి భయపడుతోంది. అసలు దానికి ఎగరడం అంటేనే భయం. ఇంతవరకు అసలు ఎగరనే ఎరగలా, గూడు ఆ చివర నుండి ఈ చివరకు, ఈ చివరనుండి ఆచివరకు మెల్లగా నడవడం తప్పిస్తే.

నిన్న వాళ్ళనాన్న ఖచ్చితంగా చెప్పేశాడు. నువ్వు ఎగరడం నేర్చుకోకపోతే రేపటినుండి నీకు అన్నం పెట్టం అని. అమ్మ జాలిగా చూసింది. అంతే. అప్పటినుండి ఇవ్వాళ సాయంకాలంవరకు అసలు అన్నమే లేదు మన కొంగపిల్లకు.

చెల్లి, అన్నయ్యల రెక్కలు తన రెక్కలకన్నా పెద్దవేంకాదు. మరి ఎట్లా ఎగురుతున్నారో! హాయిగా చేపల్ని మెక్కుతున్నారు వాళ్లు. తాను గూట్లో ఆకల్తో చావాల్సివస్తోంది.

చెట్టు కింద చెరువులో చేపలు పైకెగిరి కింద పడినప్పుడల్లా ఆకలెక్కువవుతోంది. ఇంకా ఎక్కిరింపుగా చెల్లెలు నోటిలో చేప కరచుకొని తనవేపు చూస్తూ గుటుక్కున మింగేస్తోంది. చెల్లెలిమీద భలేకోపం వచ్చేస్తోంది. అదిగాని ఇక్కడుంటేనా!

అక్కడికెళ్ళడం ఎలా! ఆకలి మండుకుపోతోంది. అందరూ తన్ను వెక్కిరించేవాళ్లే. ఒక్క అమ్మ తప్పిస్తే. అమ్మ వంక జాలిగా చూసింది. నాన్న చూడకుండా అమ్మ చేప తెస్తోంది. వెధవ! అన్నయ్య అడ్డుపడి లాక్కుని వెక్కిరిస్తున్నాడు. ఉహుఁ! వీడినా! ఇక్కడకు రానియ్యి చెప్తా!

**కనకమేడల భారతి**

అబ్బ ఆకలి! గూడు అంతా వెతికింది. ఏముంది. పొద్దున్నుండి వెదికిన గూడేగా! చేపల ముల్లు; డొక్కులు. ఒక్క పిసరు మాంసంకూడా లేదు వాటిల్లో. ఏడు పొస్తోంది. ఏమిటి చెయ్యడం?

నిన్నటినుండి నాన్న, అన్నయ్యలకూ చెల్లెలికి ఎగరడం, చేపల్ని ఎలాపట్టాలో నేర్పుతున్నాడు. తన వేపే చూడ్డంలేదు.

చెరువు గట్టుమీద చిన్న చిన్న చేపలు ఎగిరి పడుతున్నాయి. అక్కడికి వెళ్లడం ఎలా! తన కాళ్ళు చూసుకుంది కొంగపిల్ల. చాలా బారున్నాయి. గూడు చివర కూర్చుని కాళ్లు చాచింది. ఉహుఁ! గట్టు అందలా! ఈసారి మెడ చూసుకుంది. చాలా పొడుగుగా ఉంది. మెడ చాపి గట్టు మీది చేపల్ని అందుకోబోయింది. ఉహుఁ! ఈసారి అవి అందలా!. ఇంకేం చెయ్యడానికి తోచలా.

నిద్రపోయేదానిలా ఒంటికాలి మీద నిలబడి సగంకళ్లు మూసుకుంది. నాన్న వాళ్లు చూసి వస్తారేమోనని. అసలు వాళ్లు యిటు చూస్తేగా ఒక్క అమ్మతప్పిస్తే. ఇక మన కొంగపిల్ల ఉండబట్టలేకపోయింది. ఒక్కసారిగా పెద్దగా ఏడుపు లంకించుకుంది. ఆ ఏడుపు కూడా ఈసారి ఎవరికీ వినపడలా, ఒక్క అమ్మకు తప్పిస్తే.

అమ్మ. ఏడుపువిని రెండు చిన్న చేపల్ని నోటితో కరచుకొని ఎగిరి వస్తోంది. కొంగపిల్ల అమ్మ చేపలు తెస్తోందని ఏడుపు మానేసింది. తొందరగా అందుకోవాలని మెడ చాపింది. ఇంకా అమ్మ దగ్గరకు తొందరగా వెళ్లాలని మెడ ఇంకా

(48-వ పేజీ చూడండి)

# అమాత్యుని చాతుర్యం

ఆర్. జి. శాస్త్రి

ఒకప్పుడు చంద్రచూడదేశాన్ని సుందరసేనుడనే రాజు పాలించేవాడు. 'అన్నీ వుండి అయిదవతనం లేద'న్నట్టు, ఆ రాజుకు భోగభాగ్యాల కేలోటూ లేదుగాని, వంశోద్ధారకుడు లేడనే చింత మాత్రం బోలెడంత వుండేది. 'తన తర్వాత రాజ్యం పరాక్రాంత మవుతుందనే ఆలోచన' వంశోద్ధారకుడు లేడనే చింతను ప్రజ్వరిల్లజేసేది.

ఇలావుండగా ఆ రాజ్యానికొక మహానీయుడు, ఎక్కడినుంచో తెలియదుగాని వచ్చి, ఆశ్రితుల కోరికలన్నిటినీ అవలీలగా తీర్చి ఆనందింపచేసేవాడు. రాజు ఒకనాడు మంత్రి సామంతులతో కొలువుతీర్చివుండగా ఈ మహానీయుని ప్రసక్తి వచ్చింది. ప్రభువులా మహాపురుషుని దర్శించి, మనరాజ్యం పరాక్రాంత మవకుండా, పుత్రప్రాప్తి కలిగేటట్టు వరం కోరమని ప్రధానామాత్యులు వినయంతో పలికారు.

రాజు మారుపలకక ఆ మహనీయుని దర్శించాడు. సాష్టాంగ నమస్కారం చేసి, వెంట తెచ్చిన కానుకలాతని పాదసన్నిధినుంచి చేతులు కట్టుకుని నిలబడ్డాడు. 'అభీష్ట ఫలసిద్ధిరస్తు-సుసంతాన ప్రాప్తిరస్తు' అని ఆ మహనీయు డతిగంభీరంగా ఆశీర్వదించేసరికి, అమితానంద కందళిత హృదయారవిందులైనారు ప్రభువులు-అసమాన మోద భరితులయ్యారు పరిజనులు.

మహనీయుని ఆశీర్వాద ప్రభావంచేత, మహారాణి గర్భం ధరించి చక్కని పుత్రుని గన్నది. లేకలేక కలిగిన ఆ బిడ్డకు శశాంకుడని నామకరణం చేసేరు.

శశాంకుడు పెరిగి పెద్దవాడవుతున్నాడు గాని చదువుసంధ్యల కతీతుడై తిరుగ నారంభించాడు. గారాబు బిడ్డ కావడంచేత, చదువు చెప్పే గురువులు వానిని మందలించి మంచిత్రోవను పెట్టడానికి జంకేవారు. అదుపాజ్ఞలులేక శశాంకుడు విద్యావిహీనుడై వనవిహారిగా మారిపోయాడు. దేవాలయాల శిల్ప సౌందర్యాలను చూసి ఆనందించడమూ, ఉద్యానవనాల్లోని మయూర నృత్యాలకు తన్మయుడయి అక్కడే శయనించడమూ శశాంకుని దినచర్యగా మారింది. కొన్నేళ్లు గడిచినవి. శశాంకుడు యుక్తవయస్కుడయినాడు. వాని దిన చర్యలో మార్పులేదు. యౌవనంతోపాటు సౌందర్యోపాసన సిద్ధించింది.

'పుత్రుడు కలిగాడు, వంశాన్ని ఉద్ధరిస్తాడు' అనుకున్న రాజూ—రాణుల ఆశలు అడియాశ లైనాయి. పుత్రుడు పుట్టకముందు పుట్టలేదన్న చింత, ఇప్పుడు పుత్రుడు నిష్ప్రయోజకుడన్న చింత! వీటితోపాటు - తనయుడు సౌందర్యోపాసకుడై అడవులపాలైతే రాజ్యం పరాధీన మౌతుందనే చింత, ఆ వృద్ధ రాజదంపతులకు భరింపరానిదైంది. వివాహంచేస్తే యువరాజు శశాంకుడు దారిలోకి వస్తాడని మనవిచేసుకున్నారు మంత్రులు. మహారాజు బాధ్యత మహామాత్యునకప్పగించారు.

## 2

ప్రకృతిదృశ్యాలను తన్మయత్వంతో తిలకించి, నిద్రించడానికి శయనాగారం చేరిన శశాంకుడు, ఆ రాత్రి సమయాన, తన మందిరంలో దీపాల వెలుగున ఒకచిన్నదాని చిత్రపటం చూశాడు. ఆమె శరీరచ్ఛాయ, ఉద్యానంలోని చంద్రకాంతశిలల తెల్లదనంతో లీనమయింది; కాని తుమ్మెద రెక్కల్లాటి ముంగురులు, తూర్పు కొండల్లో ఉదయించే బాలభానుని అరుణిమను బోలిన ఆమె అధరాలు, మూర్తీభవించిన వనసౌందర్య మన్నట్లున్న ఆమె వలువలు—ఆమెను చంద్రకాంతశిలనుండి వేరుచేస్తున్నాయి.

సౌందర్యోపాసకుడైన శశాంకుడు రెప్ప వాల్చకుండా కొన్ని క్షణా లలాగే నివ్వెరపడి చూశాడు. మరునాటి ఉదయం మహామాత్యుడు చిన్నదానిని గూర్చిన ఆలోచనలతో శశాంకుడు నిద్రపోలేదని గుర్తించేడు. "ప్రభువుల రాజ్యానికి చాలాదూరంలో వుండే విజ్ఞానపుర దేశాధీశుని ఏకైక పుత్రిక

"తారాదేవిగారి దీ చిత్తరువు!" అని విన్నవించి, సకలశాస్త్రపారంగతుని గాని ఆమె వరింపదని కూడా మనవి చేసుకున్నాడు ప్రధానామాత్యుడు. ఈ మాటలు విన్న శశాంకుడు ఎన్నిశ్రమలు పడియైనా తారను పెండ్లాడకపోతే తన జీవితము వ్యర్థమని నిశ్చయించుకున్నాడు

## 3

ఊరికి దూరాన, ప్రశాంత వాతావరణంగల రాజమందిరంలో, యువరాజు విద్యాభ్యాసానికి సమర్థులైన విద్యావేత్తలు నియమింపబడ్డారు. ఆహార శయనాదులలో తప్ప తక్కిన అన్నివేళలా యువరాజు విద్యాభ్యాసంలోనే కాలం గడపసాగాడు. ఏకదీక్షతో కృషి చేసి రెండేళ్ల తర్వాత యువరాజు మందిరం బయటకు వచ్చేడు. అతనికేదో కొత్తప్రపంచంలో ప్రవేశించినట్టయింది. ఈ రెండేళ్ళ కాలంలోనూ సౌందర్యోపాసకుడైన శశాంకుడు విజ్ఞానసంపన్నుడై, రాజోచిత విద్యలలోకూడా ఆరితేరేడు.

## 4

ఆనాడు శశాంకుని పట్టాభిషేక మహోత్సవము. దేశదేశాల ప్రభువులు, శశాంకునకు శుభాకాంక్షలందజేయడానికి వచ్చి తమ కేర్పరచిన ప్రత్యేక ఆసనాలలో కూర్చున్నారు. ఆ మహోత్సవం చూడ వచ్చిన ప్రజలు ఇసుకవేస్తే రాలనట్టున్నారు. మంగళవాద్యాలు మారోగ్మ్రోగుతుండగా, మంత్రి పురస్సరముగా శశాంకుడు కిరీటధారియైనాడు.

మహామాత్యుడు, పిలుపు అందుకొని ఉత్సవం జయప్రదంగా కొనసాగింపజేసిన ఆహూతు లందరికీ అభివందనాలు చెప్పి కూర్చున్నాడు. శశాంకుడు మేఘ గంభీరస్వరంతో "మహా చతురులు, మేధావులు అయిన సుధర్మామాత్యులకు మేము చాలా ఋణపడి వున్నాము. బాధ్యతలను మరచి, నిరంతర మూ సౌందర్యోపాసనలో మునిగి తేలుతున్న నాకు విజ్ఞానపురంలోని తారను చూపెట్టారు. ఆ నిరుపమాన సౌందర్యవతిని చక్కటి ఉద్యానంలో నున్నట్టు చిత్రకారునిచే చిత్రింపజేశారు. చిత్రములో ఉద్యానవనము విజ్ఞానపురమని, అందులోని చిన్నది ఆ దేశాధీశుని పుత్రిక తారయనీ భ్రమ కలిగించారు. ఆ చిన్నదాన్ని చేపట్టాలని ఉవ్విళ్లూరుతున్న నాకు, విజ్ఞానపురం చాలా దూరాన ఉందనీ, సకలశాస్త్ర పారంగతునిగాని ఆమె చేపట్టదనీ చెప్పారు. ఆ కన్యమీది మక్కువచేత ఏకాగ్రతతో విద్యాభ్యాసం చేశాను. ఈ విధంగా నన్ను విజ్ఞానసంపన్నునిగా జేసిన ఆ సుధర్మామాత్యులకు నా కృతజ్ఞతాపూర్వక వందనాలు. వారి చాతుర్యంవలననే నేనీనాడు చంద్రమూడ దేశాధీశ్వరుడనై మీ అందరి ఆశీస్సులూ అందగలిగేను."

ఈ పలుకులకు అటు రాజదంపతులు, ఇటు సుధర్మామాత్యులు ఆనందాశ్రువులు రాల్చారు. తమకు మహోపకారం చేసిన సుధర్మామాత్యుని కొనియాడకుండా వుండలేకపోయారా రాజదంపతులు.

★

## కొంగపిల్ల

(45-వ పేజీ తరువాయి)

చాపింది. కాళ్లు గూడా చాపింది. అంతే గూట్లోనుంచి జారింది. కింద చెరువుకు పైన గూటికి మధ్యగా ఉంది.

వాటికవే రెక్కలు అటూ ఇటూ కొట్టుకుంటున్నాయి. గాలి పొట్ట కిందికొచ్చి తన్ను పైకి లేపేసింది. తల కిందుగా పడిపోతా ననుకుంది. ఊహుఁ! పడలా. ఉషారుగా రెక్కల్ని బాగా అటూ ఇటూ ఆడించింది. మెడ పైకెత్తింది. నాన్న, అమ్మ, అన్నయ్యలకంటే ఎత్తుగా ఎగిరిపోయింది. అందరూ ఎగురుతూ వచ్చి తనచుట్టూ చేరి "భలే, భలే" అంటూ పొగిడారు. తనూ 'భలే భలే' అనుకొని గర్వంగా చూసింది. ★

## న్యూఢిల్లీలేఖ

[46 వ పేజీ తరువాయి]

ముగా లభించవలసిన బహుమతులుగా భావిస్తున్నట్లు అనిపిస్తోంది. తమకు మంత్రిపదవి ఇవ్వాలని కొందరు కాంగ్రెసు వాదులు వత్తిడి తీసుకురావడంలో తప్పులేదని వారి అభిప్రాయం. మంత్రిపదవులు అనేవి ప్రజలకు సేవచేయడానికి ఉద్దేశించిన పదవులు మాత్రమేనని, మంత్రులుగా నియమించబడినవారు శక్తివంచనలేక సంతోషపూర్వకంగా సేవచేయవలసిందేనని నేను భావిస్తున్నాను. ఈ పదవులకోసం కుమ్ములాటజరగడానికి వీల్లేదు. వాళ్ళనీ వీళ్ళనీ సమాధానపరచడానికి మంత్రి పదవులను సృష్టించడం చాలా తప్పు. నేనే ప్రధాన మంత్రినైనా, నా మీదికే గనుక అటువంటి వత్తిడివస్తే, నన్ను వదిలేసి ఇంకో నాయకుణ్ణి ఎన్నుకోండని ప్రజలకు చెప్పేస్తాను. ఈ పదవులను అనాసక్త భావంతో స్వీకరించాలిగాని, పట్టుకుని వేళ్ళాడకూడదు. ఆ పదవులను ముళ్ళ కిరీటాలుగా ధరించాలిగాని కీర్తి కిరీటాలుగా కాదు. మన లక్ష్యాన్ని త్వరగా చేరడానికి ఈ పదవులు సహాయ పడతాయో లేదో చూడడానికే వాటిని స్వీకరించాము గాని అన్యథా కాదు. స్వార్థపరులు, అపమార్గవర్తులు ప్రధాన మంత్రులమీద ఈ విధంగా ఒత్తిడి తీసుకువచ్చి అభివృద్ధిని ఆటంక పరుస్తున్నట్లయితే అది చాలా విచారకరమైన విషయం... కాంగ్రెసు వాదులు తమ ప్రవర్తనలో తగినంత స్వార్థరాహిత్యం, క్రమశిక్షణ, లక్ష్య సాధనకు కాంగ్రెసు సూచించిన విధానాలలో విశ్వాసము కనపరచక పోయినట్లయితే ప్రస్తుతం భారతదేశం సాగిస్తున్న పోరాటం విజయం పొందదు.

కరాచీ తీర్మానాన్ని బట్టి చూస్తే, కాంగ్రెసు మంత్రిపదవులు ఆర్థికంగా లాభసాటి బేరాలు కావు. 500 రూపాయల జీతం కనిష్ఠ పరిమితి కాదు. గరిష్ఠ పరిమితే. దేశంలో పెద్దపెద్ద జీతాలు ఇచ్చే ఆనవాయితీ ఉంది గనుక 500 రూ॥ లు తక్కువనుకుంటున్నాము; లేకపోతే నిజంగా 500 రూ॥ లు జీతం ఎక్కువే. కనీసం, గడచిన 17 ఏళ్లలోనూ మొత్తంమీద చూస్తే కాంగ్రెసు వాదుల జీతాలు నెలకు 75 రూ॥ లకంటె మించిలేవు. కాంగ్రెసుకు చెందిన నిర్మాణాత్మక శాఖల్లో జాతీయ విద్య, ఖాదీ, గ్రామ పంశ్రమలలో అధికారరీత్యా నిర్ణయించిన జీతరి నెలకు 75 రూ॥ లే. ఆయా శాఖల్లో సమర్థత దృష్ట్యా చూస్తే ఏ రోజైనా మంత్రులు కాదగినవారు అనేకులున్నారు. వారిలో ప్రతిభగల విద్యావేత్తలు, లాయర్లు, కెమిస్టులు, వర్తకులు ఉన్నారు. వీరు తలుచుకుంటే తేలికగా నెలకు 500 రూ॥లు సంపాదించుకో గలరు. మరి మంత్రిపదవుల మీదే వ్యామోహం ఎందుకు? కాని జరగవలసిందేదో జరిగింది. ఇవన్నీ నా వ్యక్తిగతాభిప్రాయాలు మాత్రమే. నాకు ప్రధాన మంత్రులమీద విశ్వాసం ఉందిగనుక వారి విచక్షణజ్ఞానాన్ని నేను శంకించను. ఇప్పుడున్న పరిస్థితుల్లో వారు తాముచేసిందే ఉచితమని భావించి ఉండవచ్చును. ఇంతకీ నాకు ఉత్తరాలు రాసేవారికి నేను చెప్పదలచిందేమిటంటే, జీతాలకోసం మంత్రిపదవులను స్వీకరించడం జరగలేదనే.

తమ విధులను సమర్థంగా నిర్వహించగల పార్టీ సభ్యులకే ఈ పదవులను ఇవ్వడం జరిగింది. అయితే అలా పదవులు స్వీకరించిన వారు ప్రధాన మంత్రులను నామినేట్ చేసిన పార్టీసభ్యుల విశ్వాసానికి పాత్రులు కొగలిగి ఉండాలి. ఏ ప్రధాన మంత్రీ తన ఇష్టం వచ్చిన వ్యక్తిని మంత్రిపదవిఇచ్చి పార్టీపై రుద్దలేడు. ఎందుకంటే సమర్థుడనీ, మనుషుల్నిగూర్చి బాగా తెలిసినవాడనీ, ఇంకా ఇతర నాయకత్వ లక్షణాలున్నాయనీ పార్టీ విశ్వసించింది గనుకనే ఒక వ్యక్తి ప్రధాన మంత్రి కావడం జరుగుతుంది." ★

# సినిమాలు

## ఉత్తచిత్రం - ఉత్తమచిత్రం

సోవియట్ చలన చిత్రోత్సవాల సందర్భంలో మాస్కోనుండి మన దేశం వచ్చిన చలనచిత్ర ప్రతినిధివర్గం ఢిల్లీ, కలకత్తా, బొంబాయి నగరాలు సందర్శించి వెళ్ళారు.

మద్రాసులో ఈ ఉత్సవాలు ఏర్పాటు కానందున ఆ బృందం ఇక్కడికి రావడం పడలేదు. బొంబాయిలో రాజకపూర్ ప్రభృతులంతా విడివిడిగాను సమిష్టిగాను అతిథుల గౌరవార్థం విందులూ వినోద కార్యక్రమాలూ ఏర్పాటుచేశారు.



శర్వాణీ పిక్చర్స్‌వారి సాంఘికచిత్రం "అక్కాచెల్లెళ్లు"లో కృష్ణకుమారి.

### సి...ని...మః

"సిగరెట్లని మనం కాల్చటం లేదు, అవే మనని కాలుస్తున్నాయి.

"మద్యాన్ని మనం త్రాగటం లేదు. అదే మనని త్రాగివేస్తోంది." —దర్శక నిర్మాత

ఎం. వి. రామన్.

వీటికి మరొక్క ముక్కకూడా చేర్చితే సరిపోతుంది:

చలన చిత్రాలను మనం తయారు చేయటం లేదు; అవే మనని తయారుచేస్తున్నాయి.

ఇలా పరస్పరం మైత్రీభావం పెంపొందడానికి దోహదంచేసే సంకల్పంతో ఒక చలనచిత్రం నిర్మించాలనుకుంటున్నట్లు రష్యన్ బృందంలోని ప్రముఖ దర్శకుడు సెర్గియాట్‌కెవిచ్ చెప్పారు. అందులో ఒక భారతీయ నర్తకీ, ఒక రష్యన్ నర్తకి పాల్గొనేవిధంగా కథను అల్లాలనుకుంటున్నారు.

యుట్‌కెవిచ్ 30 సంవత్సరాలనుండి చలనచిత్ర పరిశ్రమలో ఉన్నారు. 20 పైచిలుకు చిత్రాలకు దర్శకత్వం నిర్వహించారు. ఈయన ఇటీవల తీసిన చిత్రం "ఒథెల్లో".

చలనచిత్ర కళపై తమ వ్యక్తిగత అభిప్రాయాలు తెలుపుతూ, ఇందులో రంగులూ, పెద్ద తెరలవంటి హంగులూ అత్యంత ప్రధానమైనవి కావన్నారు. "అలాగని సాంకేతిక పురోభివృద్ధి పనికిరాదంటున్నాను అనుకోవద్దు. చలనచిత్ర కళలో వాటిది ప్రధానస్థానం కాదని మాత్రమే నేనుచెప్పేది. చలనచిత్రానికి జీవం ఉండాలి. మానవత్వాన్ని ప్రబోధించగల శక్తిఉండాలి. కవిత్వ గౌరవం, కళాంశ ఉండాలి సాంకేతిక సదుపాయాలూ, హంగులూ వీటితరువాతే. మాటవరసకి (అమెరికన్ చిత్రం) "మార్టీ" చూడండి. కొన్ని ఇటాలియన్ చిత్రాలు చూడండి. వీటికి నేటి సినిమా హంగులు ఏమీ లేవు. అయినా, అవే కళాఖండాలుగా ఉత్తమ చిత్రాలుగా నిలచాయి." అని ఆయన అన్నారు

భారతీయ చిత్రం "పథేర్ పాంచాలీ" గురించి ప్రస్తావిస్తూ, ప్రపంచంలో ఉత్తమ చిత్రాలనదగ్గవాటికిదే విధంగానూ తీసిపోదని

(53-వ పేజీ చూడండి)

# బొంబాయి సినిమా లేఖ

రిపబ్లిక్ ఉత్సవదినాన ఇక్కడ మూడు కొత్త చిత్రాలకు ప్రారంభోత్సవం జరిగింది.



వీటిలో ప్రసిద్ధ దక్షిణ భారత దర్శక నిర్మాత శ్రీ ఎల్. వి ప్రసాద్ చిత్రం ఒకటి "సన్సార్" (జెమినీ) హిందీ చిత్రంతో అఖిల భారత ఖ్యాతి సార్జించు కొన్న ప్రసాద్ ఇప్పుడు స్వయంగా హిందీ చిత్రనిర్మాణానికి ఉపక్రమించి, ఇక్కడ ప్రసాద్ ప్రొడక్షన్స్ (ప్రైవేట్) లిమిటెడ్ పేరిట స్వంత సంస్థను నెలకొల్పుకొని చిత్రం ప్రారంభించారు అంధేరీ లోని స్టాండర్డ్ స్టుడియోస్‌లో జనవరి 26 ఉదయం 10 గంటలకు పూజ జరిగింది ఈతొలి చిత్రంలో మీనాకుమారి ప్రధానభూమిక నిర్వహిస్తున్నది (ప్రసాద్ దర్శకత్వాన ఎ వి ఎం వారు నిర్మించిన హిందీ చిత్రం "మిస్ మేరీ"లో ఈమే నాయకి) శ్యామ, అమితాగుహా, మనోరమ, ఆగా, గోప్, రాజ్ మెహ్రా, ఓంప్రకాశ్ ప్రభృతులు ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తారు సంగీత దర్శకుడు సి రామచంద్ర పాటలు రాజేంద్రకిషన్, మాటలు వి. ఎమ్. ఆదిల్, కళాదర్శకుడు మజీద్.

* * *

సరిగ్గా అదే ముహూర్తానికి రామన్ స్టుడియోలో "చల్తీ కానాం గాడీ" అనే మరో చిత్రానికి ప్రారంభోత్సవం జరిగింది కిశోర్ కుమార్ నాయకుడు. చిత్ర నిర్మాణ కార్యక్రమంలో కూడా ఇతడిదే ప్రధాన భూమిక అని అంటున్నారు. ఈ చిత్రానికి దర్శకుడు కమల్ మజుందార్. సంగీతం సి రామచంద్ర

ఆ రోజు మధ్యాహ్నం ఒంటిగంట వేళ ప్రకాష్ ("బూట్ పాలిష్") అరోరా కొత్త చిత్రం "దిపక్ సే దీపక్ జలే" కు ప్రారంభోత్సవం జరిగింది. ఇందులో నిమ్మి, భారత్ భూషణ్, నాయకీనాయకులు

కులదిప్ కౌర్, బేబీనాజ్, శ్యాములాల్ డెయిసీఇరానీ, ప్రభుఅరోరా ఇతర నటీనటులు సంగీత దర్శకులు మదన్‌మోహన్. పాటలు రాజేంద్రకిషన్ ఈ చిత్రం నిర్మాతలు అశోద్ భాంబ్రీ, త్రిలోక్ బక్షలు

* * *

రామన్ ప్రొడక్షన్స్‌వారి ద్విభాషాచిత్రం (ఆశా, వండర్‌గర్ల్) చురుకుగా తయారవుతుంది. ఔట్‌డోర్ దృశ్యాలు ఇటీవల చాలా చిత్రించారు వైజయంతిమాల రెండు చిత్రాలలోనూ నాయకి తమిళ చిత్రానికి నాయకుడు నాగేశ్వరరావు ఇప్పటికి 9 రీళ్లు తయారయ్యాయి ఈచిత్రంలో 9 పాటలుంటాయి వీటిలో నాలుగింటిని సెల్యూలాయడ్ మీద చిత్రించడం పూర్తి అయింది. మార్చి ఆఖరువారం, లేక్పితే ఏప్రిల్ ఆరంభంలో చిత్రం విడుదల కాగలదని దర్శకుడు ఎం. వి. రామన్ చెప్పారు.

ఈయన భారీఎత్తున నిర్మింప తలపెట్టిన వర్ణచిత్రం "జ్వాల"లో వైజయంతిమాల, కిశోర్‌కుమార్ నటిస్తారు. ఇందులో సొహ్రాబ్ మోడీ కూడా పాల్గొంటారు ఈ చిత్ర నిర్మాణానికి చురుకుగా సన్నాహాలు సాగుతున్నాయి



బొంబాయి రాక్సీ థియేటర్‌లో ఇటీవల "బసంత్ బహార్" చిత్రం తొలి ప్రదర్శనం జరిగినప్పుడు తీసినచిత్రం. భరత్ భూషణ్, నిమ్మి, ఉషాకిరణ్, సులోచన, కుంకుమ.



సోవియట్ చలన చిత్రోత్సవాలను పురస్కరించుకొని మనదేశంవచ్చిన చలన చిత్ర ప్రతినిధివర్గం ఢిల్లీ, కలకత్తా బొంబాయినగరాలను సందర్శించారు. బొంబాయిలోని చలనచిత్ర కళాకారులు, వివిధ సాంస్కృతిక సంస్థలవారూ, వారికి ఆతిథ్యం ఇచ్చారు. సోవియట్ బృందంనాయకుడు శ్రీ ఐగర్ రాచుక్ వీడ్కోలుసభలో మాట్లాడుతూ, ఈ విధమైన రాకపోకలవల్ల ఇరుదేశాలమధ్య స్నేహసద్భావాలు పెంపొందగలవని ఆశిస్తున్నామన్నారు బాల చలన చిత్ర సంస్థ నిర్మించిన తొలి చిత్రం "జల్ దీప్" (లైట్ హౌస్) లోని ఛాయాచిత్రాల ఆల్బంను, ఈ సంస్థ కార్యదర్శి శ్రీ మహేంద్రనాథ్ బహుమాన పురస్సరంగా శ్రీ రాచూక్‌కు అందచేసిన సందర్భంలో తీసిన చిత్రం ఇది. ఎడమ చివర నిలచిఉన్నది సోవియట్ నటి శ్రీమతి ఓల్గా జబోట్కినా.

## ఆసియా చలన చిత్రోత్సవం

చలనచిత్ర నిర్మాణం, డిస్ట్రిబ్యూషన్ ప్రదర్శన వ్యాపారాలు మూడిటిలోనూ అనుభవం, సామర్థ్యం గడించిన ప్రముఖ పారిశ్రామికుడు శ్రీ లోకేవాన్ తో ఇటీవల బొంబాయి వచ్చారు ఈయన సింగపూర్‌లోని "కాథే ఆర్గనైజేషన్" అధ్యక్షుడు దూర ప్రాచ్యదేశాలలో ఈ సంస్థ క్రింద వందలాది సినిమా ప్రదర్శనశాలలున్నాయి. విదేశీయ, దేశీయ చిత్రాల డిస్ట్రిబ్యూషన్‌తో పాటు, ఈ సంస్థ, మలయన్, చైనీస్ భాషలలో చలనచిత్రాలు నిర్మిస్తున్నది ఇప్పుడు శ్రీ తో ఇక్కడ చలనచిత్రాలు నిర్మించడానికి రాలేదుగాని, అంతకన్న ముఖ్యమైన తగిన పనిమీదనే వచ్చారు రేపు మే నెలలో టోక్యోలో అఖిల ఆసియా చలన చిత్రోత్సవం ఒకటి ఏర్పాటు చేయాలన్న సంకల్పంతో అందుకు సన్నాహాలు ప్రారంభించిన శ్రీ తో బొంబాయిలోని ఫిలిం ప్రముఖులు పలువురితో ఈవిషయం మాట్లాడారు. ఇక్కడి వారంతా, ఆఉత్సవంలో పాల్గొని సహకరించగలమని మాట ఇచ్చారు

ఇతఃపూర్వం ఈ ఉత్సవాలను దూర ప్రాచ్య చలనచిత్ర నిర్మాతల సంఘం నిర్వహించేది. అందువల్ల భారత దేశం తదితర ఆగ్నేయాసియా దేశాలూ వీటిలో పాల్గొనడం జరిగిందికాదు ఇప్పుడు "దూరాన్ని", "ప్రాచ్యాన్నీ" తొలగించి 'ఆసియా' ఉత్సవాలు అని పేరు పెట్టడంతో ఆసియాలోని దేశాలన్నీ ఇందులో పాల్గొనడానికి వీలు కలుగుతుంది

ఇప్పుడు శ్రీ తో ఆధ్వర్యాన నడచే ఈ కాథే సంస్థ కొన్నాళ్ళ క్రితం భారతీయ చిత్రాలను తన థియేటర్లలో విడుదల చేయడం జరిగింది అలా ప్రదర్శించిన తొలి చిత్రం "ఝనక్ ఝనక్ పాయల్ బాజే"

# ★ బొంబాయి సినిమా లేఖ ★

తరవాత "తూఫాన్ ఔర్ దీయా" తీసు కున్నారు. ఈ రెండూకూడా విజయవంత ముగా సాగాయి.

## హిందీ చిత్రసీమకు కొత్త హీరో

బెంగాలీ చిత్రాలలో మంచి నటుడుగా పేరు తెచ్చుకున్న ఉత్తమ్‌కుమార్ ఇపుడు హిందీ చిత్రసీమ నాయక నటశ్రేణిలో చేరు తున్నాడు. ఇటీవల బొంబాయి వచ్చిన ఉత్తంకుమార్‌ను ఇక్కడి నిర్మాతలు చాలా మంది తమ చిత్రాలలో నటించ గోరు తున్నారు. ముఖ్యంగా బిమల్ రాయ్ ప్రొడక్షన్స్, ఆర్. కె. స్టూడియోస్‌ల తరఫున రాయబారాలు గట్టిగా జరుగుతున్నాయి.

కొత్త నటులకోసం చాలమంది ఇలా తాపత్రయ పడడానికి ముఖ్యకారణము, ఉన్న ప్రముఖనటులు, విపరీతమయిన రుసుము కోరడం, ఇచ్చుకున్నా తీరిక లేక వారూ వీరూ అవస్థ పడడం.

ఇప్పటికీ చాలమంది నిర్మాతలు, సమర్థులయిన కొత్తవారిని పైకి తీసుకురావడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. ఈ కోవకు చెందినవారిలో అమిత, మహబూబ్, (ఫిలిం స్థాన్‌వారి "అభిమాన్"లో నటీనటులు). మెహబూబ్ ప్రొడక్షన్స్ వారి "మదర్ ఇండియా"లో నటిస్తున్న రాజ్‌కుమార్ అగ్రగణ్యులు.

* * *

నాయికి ఎవరో నిర్ణయించుకోకుండా, సగం పైచిలుకు చిత్రం నిర్మించిన బసుచిత్ర మందిర్‌వారు ఇపుడు ఆ భూమికకు మీనా కుమారిని తీసుకొన్నారు. చిత్రం పేరు "సవేరా." ఇందులో మీనాకుమారి ఒక నర్సు భూమిక నిర్వహిస్తుంది. సాధువు వేషం వేసుకుని అసాధు కార్యాలు సాగించే నేరస్థుడుగా అశోక్‌కుమార్ నటిస్తున్నాడు. ఈ నేరస్థుడి టోకరాకి బోల్తాపడిన జనం, ఇతణ్ణి నిజమైన సాధువుగా భావించి పూజించడంతో, అతగాడికి మతిపోయి, చివరకి, తను చెప్పే నీతులనూ, సూత్రాలనూ తనే మనసారా నమ్మి తరిస్తాడు. ఈ చిత్రానికి దర్శకుడు సత్యేన్‌బోస్. కామా, బిపిన్, గుప్తా, శాంసన్ ప్రభృతులు ఇతర భూమికలు నిర్వహిస్తున్నారు. సంగీత దర్శకుడు శైలేష్.

## గీతశకం

గతవారం విడుదలయిన చిత్రాలు: షేక్‌ముక్తార్ నిర్మించిన "మిస్టర్ లంబు," ఈగిల్ ఫిలింస్‌వారి "ఖైదీ."

ఈ రెండు చిత్రాలకు ప్రత్యేకాకర్షణ సంగీతం. రెండిటికీ సంగీత దర్శకుడు ఓ. పి. నయ్యార్.

తల్లీ, అక్కచెల్లెళ్ళ శ్రేయస్సుకోసం, తన సౌఖ్యాన్ని త్యాగంచేసిన ఒక యువకుడి కథ "మిస్టర్ లంబూ". హృదయాన్ని కదలించే సన్నివేశాలు, ఇందులో చాలా ఉన్నాయి. మొదటినుండి తుదివరకూ, దర్శకుడు ఎస్. ఎ. అఖ్తార్ ఉత్కంఠతను చక్కగా పోషించారు. ఇందులో విలన్‌గా ఆయనే నటించాడు. లంబూ భూమికను షేక్‌ముక్తార్ నిర్వహించాడు. లంబు సోదరిగా సురయా నటించింది. విజయలక్ష్మి, భగవాన్‌ల హాస్యం ఆకర్షణీయంగా ఉంది.

రెండో చిత్రం "ఖైదీ"కి "ప్రిజనర్ అఫ్ జెండా" ఆధారం. ఎటొచ్చీ, ఇందులో కథా స్థలాన్ని, కాలాన్నీ "అలనాటి అరేబియాకు ఫిరాయించారు.

ఈ చిత్రంలో నయ్యార్ సంగీతం, పద్మిని నృత్యాలూ ప్రత్యేకాకర్షణలు. దర్శకత్వం బాగాలేదు. నాయకుడు, అతగాడి నటనా కూడా అలాగే ఉన్నాయి.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)





సత్యేన్‌బోస్ దర్శకత్వాన తయారవుతున్న "బందీ" చిత్రంలో కొత్తనటి కామా నృత్యం ఇందులో అశోక్‌కుమార్, కిశోర్, బీనారాయ్ నటిస్తున్నారు.



రాజశ్రీ వారి "దాంపత్యం"లో రేలంగి, జూనియర్ లక్ష్మీరాజ్యం.

## అదీ - ఇదీ

1956 లో మనదేశం తయారుచేసిన కథా ప్రధాన చిత్రాలు 296 ఇన్ని చిత్రాలు ఇదివరకెన్నడూ తయారుకానట్లు, ఈవివరాలు సేకరించిన ఐ. ఎం. పి పి. ఎ. ప్రకటించింది.

ఈ పెరుగుదల, ప్రధానంగాతమిళ చిత్రాల సంఖ్యలో గోచరిస్తుంది నిరుడు తయారైన తమిళ చిత్రాలు 46 కాగా ఈసంవత్సరం 51 విడుదల అయ్యాయి.

బొంబాయిలో తయారైన చిత్రాలసంఖ్య 185 దక్షిణ భారతంలో తయారైనవి 102, బెంగాల్ నిర్మించినవి 59.

వీటిలో హిందీచిత్రాలు 118, బెంగాలీవి 54, తమిళం 51, తెలుగు 27, కన్నడం 14, మరాటీ 18, మలయాళం 5, గుజరాతీ 3, అస్సామీ 3, ఒరియా 2, పంజాబీ ఒకటి.

దక్షిణాది పరిశ్రమలో విశేషం ఎక్కువ చిత్రాలు రెండు భాషలలో తయారుకావడం. ఇక్కడ తయారైన హిందీ చిత్రాలన్నీ అఖిలభారత స్థాయిలో ఆర్థిక విజయాన్ని సాధించాయి పరిశ్రమ పరిమాణం, విఫణులపరిధి ఈ విధంగా విస్తరించడం ముదావహం.

"మాదేశపు చలనచిత్ర పరిశ్రమ ప్రపంచంలో ద్వితీయస్థానాన్ని ఆక్రమిస్తుంది" అన్నది లండన్‌లో భారత హైకమిషనర్ శ్రీమతి విజయలక్ష్మీ పండిట్

కెనడా వెళ్ళిన సందర్భంలో అక్కడి పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ ఆవిడ ఈవిషయాన్ని వెల్లడించారు.

"కాని," ఒకవిషయం గమనార్హం. సాధారణంగా రాజకీయ నాయకులు, పెద్ద సైజు ఉద్యోగులూ ఏ విషయం గురించి మాట్లాడినా,(ముఖ్యంగా చలన చిత్రాల గురించి) వాళ్లు ప్రవచించే ప్రతివాక్యానికీ ఒక "కానీ"యో అర్థణానో చివర్ని తగిలించక మానరు

శ్రీమతి విజయలక్ష్మి కెనడాలో భారత చలన చిత్ర పరిశ్రమగురించి మాట్లాడినపుడు కూడా అపనే చేశారు

"మాదేశపు పరిశ్రమ చాలా పెద్దదే, 'కాని' ఆచిత్రాలన్నీ ఘోరంగా ఉంటాయి. మహా ఘోరం. అన్నీ హాలీవుడ్ చిత్రాలకు అనుకరణలే అనుకరణకూడా ఘోరంగాఉంటుంది" అని ఆమె చీదరించుకున్నారు

శ్రీమతి విజయలక్ష్మి మాటలు, పచ్చి అబద్ధాలు కావు. అలాగని అక్షరాలా నిజమూ కాదు.

హాలీవుడ్ ఫక్కీలో ఆలోచించడంకూడా నేర్చుకుని, అది తలమునుకుని మురిసిపోయే బొంబాయి చలనచిత్రకారులు చాలామంది హాలీవుడ్‌ను అనుసరిస్తున్న మాట నిజమే. అందునిక దేశం అంతటి నెత్తినా ఆ నింద వెయ్యడం భావ్యం కాదు

శ్రీమతి విజయలక్ష్మి వంటి వారు ఇటువంటి విమర్శలు మనదేశంలో ఉండిచేస్తే, అవి శిరోధార్యాలు అవుతాయి. ప్రయోజనకరమైనవి కూడా అయితే కావచ్చును కాని, పరాయి దేశంమధ్యనిలబడి మేం నిష్ప్రయోజకులంఅని ఎలుగెత్తి చెప్పుకోవడం ఘనవిషయం కాదు రాయబారి హోదాలో విదేశాలకు వెళ్ళే పెద్దలు స్వదేశం తీరుతెన్నులను స్థితిగతులనూ ఎదటివారికి తెలియ చెప్పినపుడు, ఇక్కడి లోపాలను, సాధకబాధకాలనూ, కష్టనిష్ఠురాలనూ సానుభూతితో పరిశీలించి బోధపరచుకొని, నిజమే చెప్పినా సముచితమైన రీతినచెప్పి సద్భావం పెంపొందడానికి దోహదం చేయాలి కాని, మూక ఉమ్మడిగా కొట్టి పారవేయడం వాంఛనీయం కాదు.

"మన వాళ్లు వట్టి వెధవాయ"లన్న ముక్క మనలో మనం, మనతో మనం అనుకుంటే అదో ముచ్చట. "మా వాళ్లు వట్టి వెధవాయలని" మరొకళ్ళ మధ్య అనడం అమోఘమైన విషయం కాదు ★

## ఉత్తచిత్రం - ఉత్తమ చిత్రం

(49-వ పేజీ తరువాయి)

ప్రశంసించారు.

* * *

చలనచిత్ర కళావికాసానికి, నిజానికి రంగులూ, వెడల్పు తెరలూ ఏవిధంగానూ ప్రతిబంధకాలు కావు. సాధనం ఏది అయినా, చెప్పే విషయం, చెప్పే పద్ధతీ మాత్రమే ప్రధానం.

అయితే జరుగుతున్నది ఏమిటీ అంటే, ఈ సాధనాలు ఉపయోగించడంలో కథకు, కళకూ ఉండవలసిన ప్రాధాన్యం లేకుండా పోతోంది. దీన్ని సమర్థించుకోవడానికి సవాలక్ష కారణాలు ఉంటాయి; ఉన్నాయి కూడా.

మార్పులెన్ని వచ్చినా మంచి చిత్రాల దారి వేరుగానే ఉంటోంది సలక్షణంగా గౌరవ పురస్సరంగా ఉపక్రమించి నిర్మించిన చిత్రాలు ఉత్తమ చిత్రాలవుతున్నాయి; తదన్యమైనవి ఉత్తచిత్రాలవుతున్నాయి. ★

# సినిమా వార్తలు

శార్వాణీ పిక్చర్స్‌వారి సాంఘిక చిత్రం "అక్కచెల్లెళ్లు" చురుకుగా తయారవుతోంది శ్రీరంజని, కృష్ణకుమారి, సూర్యకాంతం, లక్ష్మీకాంత, అమర్‌నాథ్, సి. ఎస్. ఆర్. రాజనాల రమణారెడ్డి, మొదలగువారు నటిస్తున్నారు దర్శకులు సార్వభౌమ, అమానుల్లా. పాటలూ మాటలూ శ్రీ శ్రీ, ఆరుద్ర వ్రాస్తున్నారు. సంగీత దర్శకులు పెండ్యాల నాగేశ్వరరావు. నిర్మాతలు గోపాలరెడ్డి, పద్మనాభరావు.

* * *

కంపరాజ్ ప్రొడక్షన్స్ వారి పౌరాణికం "నలదమయంతి" నిర్మాణం పూర్తి అయింది. ఇందులో భానుమతి, కంపరాజ్, నాగయ్య నటించిన ఈ చిత్రానికి కంపరాజే దర్శకత్వం నిర్వహించారు ఈ చిత్రం ఈ నెలలోనే విడుదల అవుతోంది.

* * *

త్వరలోనే విడుదల కానున్న మరో చిత్రం పొన్నలూరి బ్రదర్స్ వారు నిర్మించిన "భాగ్యరేఖ" బి. ఎన్. రెడ్డి దర్శకత్వాన రూపొందిన ఈ చిత్రంలో జమున రామారావు నటిస్తున్నారు పాలగుమ్మి పద్మరాజు మాటలూ, దేవులపల్లి కృష్ణశాస్త్రి పాటలూ వ్రాశారు.

* * *

అంజలీవారి జానపద చిత్రం "సువర్ణ సుందరి" కూడా విడుదలకు సిద్ధం కావస్తున్నది. అంజలి, నాగేశ్వరరావు, రేలంగి, సి. ఎస్. ఆర్, గుమ్మడి వెంకటేశ్వరరావు, బాలకృష్ణ, రాజసులోచన, గిరిజ, సూర్యకళ మొదలగు వారు నటిస్తున్నారు రచన మల్లాది రామకృష్ణశాస్త్రి దర్శకత్వం వేదాంతం రాఘవయ్య.

నందీవారి "కృష్ణగారడీ"లో కృష్ణవేషధారిగా అమర్‌నాథ్.

* * *

శ్రీ ధనసాయి ఫిలింస్ వారి "బలేబావ" మార్చి నెలాఖరులోగా విడుదల కావచ్చునని తెలుస్తోంది జానకి గిరిజ, జగ్గయ్య, రేలంగి, సి. ఎస్. ఆర్, గుమ్మడి నటిస్తున్న ఈ చిత్రానికి దర్శకుడు ఎస్. రజనీకాంత్, రచన కొండముది, అనిసెట్టి. సంగీతం, దక్షిణామూర్తి

* * *

ఫిబ్రవరి 1 వ తేదీన రెండు చిత్రాలు విడుదల అయ్యాయి ఒకటి సెల్వకోటి పిక్చర్స వారి "స్వయం ప్రభ" శ్రీరంజని అమర్‌నాథ్, రాజసులోచన, సి. ఎస్. ఆర్. ముక్కామల, ఆర్. నాగేశ్వరరావు చలం, శివరావు నటించారు. దర్శకుడు శోభనాద్రిరావు సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు.

రెండవది భాస్కర్ ప్రొడక్షన్ వారి సాంఘిక చిత్రం "రేపునీదే" జానకి, జగ్గయ్య, రాజసులోచన, కృష్ణకుమారి, రంగారావు, రేలంగి, ఆర్. నాగేశ్వరరావు పాల్గొన్నారు. దర్శకుడు భాస్కరరావు సంగీతం ఘంటసాల

అంతకు మూడురోజులక్రితం మాడర్న్ థియేటర్స్ వారి "రాణి రంగమ్మ" విడుదల అయింది సావిత్రి, జెమినిగణేశన్ నటించారు; దర్శకుడు టి. ఆర్. రఘునాథ్. రచన ఆరుద్ర. ★

 వెలితెరలు 

(10-వ పేజీ తరువాయి)

పుస్తకం తెరిచి]

నీడలేని
తోడులేని మనిషీ
నిలచి చూడు
పిలచి చూడు
పలుకని యీలోకంపై
పగను విడిచి, వగను విడిచి
నిలచిచూడు
పిలచి చూడు.

(రాస్తూ వుంటాడు.)

ఆనంద్ : కాఫీ పడగానే కవిగారి కవితావాహిని సెలయేరులా సాగిపోతోంది.

దండ : ఈ డింకర్ బాబుగారు పిచ్చోడిలా ఎప్పుడూ రాసుకుంటూనే కూచుంటారు బాబూ !

ఆనంద్ : కవిత్వానికీ పిచ్చికీ చాలా దగ్గర సంబంధం వుంది. ఏమంటారు మిస్టర్, దినకర్ ?— మా మేనమామకు యిద్దరు పిల్లలు వున్నారు. వారిలో ఒకడు కవి అయ్యాడు. మరొకడు పిచ్చివా డయ్యాడు.

(దినకర్ తలఎత్తకుండా రాసుకుంటున్నాడు.)

దండ : రండి బాబూ ! మేనేజరుగారి దగ్గరకు తీసికెళతాను.

(ముందు దండపాణి వెనుక ఆనంద్ కుడివైపు నిష్క్రమిస్తారు. దినకర్ దీర్ఘంగా ఆలోచిస్తూ రాస్తున్నాడు. మధ్యమధ్య పైకి చదువుతున్నాడు.)

దిన : (చదువుతూ)

నువు నిర్మించిన శానిసల శిబిరం
పునాదులతో కదులుతోంది
కదులుతోంది.

(కుడివైపునుంచి దామోదరం వస్తాడు. సిల్కుపంచె, కోటు, చేతులకు విలువైన ఉంగరాలు — ముఖంలో గర్వం, శేవి కనిపిస్తున్నాయి.)

దిన : [ఒకసారి తలయెత్తి దామోదరం కేసి చూసి తిరిగి రాసుకుంటూ]

నిరాశల రాసిలోని
"నిన్న"ను విస్మరించు
రేపటి ఉషస్సులో
నీ ఆశలు చిగురించును.

దామో : (దినకర్ కేసి పరిశీలనగా చూసి) వామన మూర్తిగారెక్కడ?

దిన : [వినిపించుకోకుండా తన ధోరణిలో]

ఎటునుండో వచ్చు నొకడు
ఎచ్చటికో పోవు నొకడు
వచ్చునపుడు తెచ్చినదేది?
పోవునపుడు గొనిపోవునదేమి?

దామో : [చుట్టూ కలయజూచి గత్యంతరంలేక దినకర్‌తో] ఏమయ్యా! నేను చెప్పినది వినిపించడంలేదూ?

దిన : [బాహ్య ప్రపంచంలోకి వచ్చి ఆఁ] ఏమిటి?

దామో : వామనమూర్తిగారు వున్నారా?

దిన : వున్నారు.

దామో : ఎక్కడ?

దిన : అదే తెలియదు.

దామో : (నిస్పృహతో కుర్చీలో కూర్చుని) నీకు కొంచెం మతి స్థిమితంలేదా?

దిన: లేదు. ఎంతమాత్రం లేదు. ఈ కల్లోల జగత్తులో మతి స్థిమితంగా వుండడానికి వీల్లేదు.

దండ: (నేపథ్యంలో) లేదు. యీల్లేదు. అంతకంటే దమ్మిడీ తగ్గదు.

[కుడివైపునుంచి మాట్లాడుకుంటూ దండపాణి ఆనంద్ వస్తారు.]

ఆనంద్: కళాకారులకు కన్సెషన్ లేదా?

దండ: బాబుగారు వుత్తినే వుండడానికైనా ఒప్పుకుంటారుగాని దర తగ్గించరు.

ఆనంద్: ఔరా! కళాకారుడు ఒక రాత్రి తల దాచుకునేందుకు వెల మూడు రూపాయల ముప్పావలా?

దిన: [రాసుకుంటూ]

ఇలాతలంలో అన్నీ వున్నా
వెలలేనిది ఏదీ దొరకదు.

దండ: (ఆనంద్‌తో) ఇంక మీ గదిలో కెళ్ళండి బాబూ! ఆరో నంబరుగది అదే!

[ఎడమవైపు చూపిస్తాడు. ఇంతలో ఆకస్మికంగా దామోదరాన్ని చూసి భయసంభ్రమాలతో] ఎంతసేపయ్యింది బాబూ మీరొచ్చి? మీ కోసమే బాబుగారు నూస్తన్నారు.

దామో : ఇదే రావడం. వామనమూర్తిగారెక్కడ?

దండ: పైనున్నారు. ఇప్పుడే తీసుకొస్తాను. [ఒక అడుగు ముందుకువేసి ఆనంద్, దినకరులకేసి తిరిగి] బాబూ! ఇంక మీ గదులలోకి మీ రెళ్ళిపోవాలి.

[మేడమీదికి వెళ్ళిపోతాడు.]

ఆనంద్ : [దినకర్‌తో] ఓ కవిరాజా! పొరబాటు! ఓ భావకవీ! ఈ పూట నాగదికి వచ్చి నా ఆతిథ్యాన్ని స్వీకరించు.

దినకర్ : [లేచి] వస్తాను. తప్పకుండా వస్తాను. ఎవరు పిలిచినా వస్తాను. "సిగ్గేలా భావకవికి సిరిసిరిమువ్వా!" అన్నా డొక సోదరకవి.

[ముందు ఆనంద్, వెనుక దినకర్ ఎడమవైపు నిష్క్రమిస్తారు.- మేడమీదినుంచి టకటక చప్పుడుచేస్తూ ముందు వామనమూర్తి వెనుక దండపాణి వస్తారు. వామనమూర్తి లావుగా, పొట్టిగా వున్నాడు. సూటు, బూటు, హేట్ - పూర్తి నవనాగరికునివలె కనిపిస్తాడు. అతని ముఖంలో వయసు మళ్లుతున్న చిహ్నాలు కొద్దిగా కనిపిస్తున్నై.]

వామనమూర్తి: మీ కోసమే చూస్తున్నాను దామోదరంగారూ! మీ రొక్కరే వచ్చారేం? అబ్బాయిని తీసుకు రాలేదా? [కుర్చీలో కూర్చుంటాడు.]

దామో: లేదండీ. వాడికి ఒక క్షణంకూడ యింట్లో కాలునిలవదు. ఎప్పుడూ పట్నంలోనే మకాం.

వామన: పెళ్ళయినతరవాత మహారాజులా దారికి వస్తాడు. అటువంటివాళ్లను మనం ఎందరిని చూడలేదుగనక. (దండపాణితో) యింకా యిక్కడే వున్నావేం?

[దండపాణి కుడివైపు నిష్క్రమిస్తాడు]

దామో: వాడికి స్నేహితు లెక్కువ. వాడి స్నేహితులలో పనికివచ్చే గుణాలు ఒక్కడికీ లేవు. ఏవో సినిమా లంటారు. నాటకా లంటారు. వాళ్ళ వ్యవహారాలేమిటో నాకు బోధపడవు.

వామన: ఈ కాలపు పిల్లలందరూ ఇంచుమించుగా అంతేనండీ. వాటిని మనమంతగా పట్టించుకో నక్కరలేదు.

దామో: చాలాకాలంనుంచి పెళ్ళిప్రయత్నాలు చేస్తున్నాను. చాలా సంబంధాలు చూశాను. కొన్ని నాకు నచ్చలేదు. అన్ని సంబంధాలు వాడికి నచ్చలేదు.

వామన: అయితే మనం యిద్దరం ఒకే దారిలో నడుస్తున్నా మన్నమాట. మా అమ్మాయికి యీ ఒక సంవత్సరంలోను అనేక సంబంధాలు చూశాను. ప్రతి పెళ్ళికొడుకునీ మా చిత్ర ఏదో పరీక్షచెయ్యడం, పనికిరాడు పొమ్మనడం జరుగుతూవచ్చింది.

దామో : మీ అమ్మాయి చిన్నప్పటినుంచీ మీ దగ్గర లేదని విన్నాను.

వామన : అవును. నిజమే. తల్లి పోయినప్పటినుంచీ 'కాన్వెంటు'లో వుంచి చదివించాను.

 # సిరితెరలు 

దామో : యూరోపియన్ స్కూళ్ళలో చదువుకున్న పిల్లలకు విచిత్రమైన అలవాటు వుంటాయి. వాటితో మనం సరిపెట్టుకోవడం కష్టం.

వామన : పెద్దకష్టం యేమీ కాదు. ఇంటిని అందంగా అలంకరించుకోవాలంటారు. సరిగా అనుకున్న సమయానికి నిముషం హెచ్చుతగ్గులు లేకుండా పని జరగాలంటారు.—ఇటువంటివి మొదటిలో మనకు కొంచెం కష్టం కలిగిస్తాయి.

దామో : మావాడి పెళ్ళిగురించి చాలా ప్రయత్నాలుచేసి విసిగిపోయాను. మీ అమ్మాయి బాగా చదువుకున్నదీ, తెలివైనదీ గనక చివరిసారిగా యీ ప్రయత్నం కూడా చేసిమాద్దామని వచ్చాను.

[కుడివైపునుంచి దండపాణి ట్రేలో కాఫీ తీసుకువస్తాడు. కప్పులు టేబిలుమీద పెట్టి కుడివైపు నిష్క్రమిస్తాడు. వామనమూర్తి, దామోదరం కాఫీతాగుతూ మాట్లాడుతూ వుంటారు.]

వామన : మీ అబ్బాయినికూడా తీసుకువస్తే యిప్పుడే ఏదోఒకటి తేలిపోయివుండేది.

దామో : తీసుకువద్దామనే అనుకున్నాను. వీలుపడలేదండీ, ఇవేళే మనిషిని పట్నం పంపించాను. సాయంత్రానికి వాణ్ణి తీసుకువస్తాడు.

వామన : మీవాడు పట్నంలో ఏంచేస్తున్నట్లు?

దామో : పనేమీలేదు. కష్టపడి సంపాదించాలన్న బెంగ వాడికిలేదు. స్నేహితులతో ఖులాసాగా తిరుగుతూ వుంటాడు.

వామన : ఈ పెళ్ళికి నాయిష్టం యేమీ లేదు. మా అమ్మాయికి వరుడు నచ్చితే నిముషాలమీద పెళ్ళిచేస్తాను. మీ అబ్బాయిని పంపండి. ఎప్పుడు పంపేదీ ముందుగా తెలియజెయ్యండి.

దామో : రేపుసాయంత్రం వాడేవస్తాడు. ముందు మనం అన్నివిషయాలు పరిష్కరించుకోవడం మంచిదని నేను ఒక్కడినే వచ్చాను.

వామన : పరిష్కరించుకోవడానికేమీ లేదు. నాకు ఒక్కతే కూతురు. నా ఆస్తి అంతా ఆమెకే చెందుతుంది.

దామో : ఆస్తిగురించి, కట్నం కానుకల గురించి నాకేమీ పట్టింపులేదు. మీ వంశం సంప్రదాయంచూసే మీ సంబంధానికి నేను పూర్తిగా యిష్టపడుతున్నాను.

[చిత్ర మేడమీదినుంచి తొందరగా దిగి వస్తుంది. చేతిలో పుస్తకం వుంది.]

చిత్ర : [వామనమూర్తిని సమీపించి] డాడీ! దినకర్ ఎక్కడ?

వామన : ఏమో? నేను చూడలేదమ్మా! ఎందుకు?

చిత్ర : ఈ పద్యానికి అర్థం కావాలి. [తొందరగా ఎడమవైపు నడుస్తూవుంటుంది]

వామన : చిత్రా!

చిత్ర : [ఎడమ చివర ఆగి] ఏండాడీ?

వామన : ఇలా రా అమ్మా! ఒక క్షణం కూర్చో!

[తిరిగివచ్చి సోఫాలో కూర్చుంటుంది]

దామో : [చిత్రతో] నీకు తెలుగు చదవడం రాయడం బాగా వచ్చునా అమ్మాయ్?

చిత్ర : [నిర్మొహమాటంగా] తెలుగు రాక పోయినంతమాత్రాన నష్టం యేమీలేదులెండి.

వామన : అయినా ఎందుకైనా మంచిదని యీమధ్యనే కొంచెం తెలుగు చెప్పిస్తున్నానులెండి.

దామో : [చిత్రతో] యింకా నీకేమేమి వచ్చును?

చిత్ర: [నూటిగా] అంటే మీ ఉద్దేశం?

వామన : నువ్వు స్కూల్లో ఏమి నేర్చుకున్నావో చెప్పమని వారి ఉద్దేశం.

దామో : అవును. అదే నే నడిగేది.

చిత్ర : నో! నో! ఐ కాంట్ టెల్ దట్ ఎట్ ఒన్స్. లేటెస్టు టైంటేబిలు తీసుకువస్తాను. దానినిబట్టి నేను చదివిన సబ్జెక్ట్సు మీరు తెలుసుకోగలరు. (లేస్తుంది)

దామో: వద్దు! వద్దు! నీకు జ్ఞాపకమున్నవే చెప్పు!

చిత్ర : ఇంగ్లీషు, అర్థమెటిక్సు, సివిక్సు, ఆల్ జీబ్రా, బ్రిటిష్ హిస్టరీ, డొమెస్టిక్ సైన్సు, డ్రాయింగ్ అండ్ పెయిటింగ్—యివిగాక రింగ్ టెన్నిస్, టేబిల్ టెన్నిస్, బాస్కెట్ బాల్, బాడ్ మింటెన్ కూడా వచ్చు. (చిరాకుతో) ఈ వివరాలన్నీ మీ కెందుకో నా కర్థం కావడంలేదు.

వామన : వట్టినే తెలుసుకోవడానికి అడుగుతున్నారమ్మా!

చిత్ర : డాడీ! కొంపతీసి యీయనే పెళ్ళికొడుకు కాదుగదా?

వామన : అలా తొందరపడి మాట్లాడకూడదమ్మా! వీరిఅబ్బాయి పెళ్ళికోసం ప్రయత్నాలు చేస్తూ యిక్కడకు వచ్చారు.

చిత్ర : ఐసీ! దెన్ వేరీజ్ హి? అతడు కనిపించడేం?

వామన : అబ్బాయి రేపు వస్తాడు. (దామోదరంతో) రేపు సరిగా ఎన్ని గంటలకు వస్తారో చెబితే మాకు యితర ఏర్పాటులు చేసుకోవడానికి వీలు వుంటుంది.

దామో: రేపు సాయంత్రం వస్తాడు.

వామన: మీరు కూడా రారా?

దామో: రేపు మా కంపెనీకి కొత్త ఏజెంట్సును సెలక్టు చెయ్యాలి. నాకు రావడానికి తీరిక వుండదు.

వామన: మీ అబ్బాయిని ఒక్కడినే పంపుతారా?

దామో: పెళ్ళిచూపులకు వచ్చేటప్పుడు ఒక్కణ్ణీ ఎలా పంపుతాను. మా అల్లుణ్ణి కూడా పంపుతాను.

వామన: సరే! అలాగే కానివ్వండి—మీ అబ్బాయి పేరేమిటన్నారు?

దామో: ఏమని చెప్పమంటారు? నేను పెట్టినపేరు వాడు పట్నం వెళ్ళగానే మార్చుకున్నాడు.

చిత్ర: చాలా బాగుంది. అప్పన్న, పుల్లయ్య మొదలైనపేర్లు పెడితే మార్చుకోక ఏంచేస్తారు? మీ అబ్బాయి చాలా మంచిపనే చేశాడు.

దామో: ఎవరైనా ఒకసారి మార్చుకుంటారు. కాని వాడు యిప్పటికి మూడుసార్లు మార్చుకున్నాడు.

వామన: అదంతా నాగరికత అండీ! మనం ఏమీ అనలేం. ప్రస్తుతం అమలులో వున్న పేరేమిటి?

దామో: నెలరోజుల క్రితం వరకూ నిరంజన్.

వామన: రేపు తప్పకుండా పంపండి. మీఅబ్బాయినిచూసినతర్వాత మానిర్ణయాన్ని మీకు తెలియజేస్తాం.

దామో: నాకు అన్నివిధాలా మీసంబంధం చెయ్యాలనే కుతూహలంగావుంది. అదృష్టం బాగుండి వాళ్ళిద్దరికీ ఒకరికి ఒకరు నచ్చితే మనశ్రమ ఫలిస్తుంది. (లేచి) మరి యిక నేను వెళ్ళివస్తాను వామనమూర్తిగారూ!

వామన: (లేచి) మీఅబ్బాయినిమాత్రం రేపు సాయంత్రం తప్పకుండా పంపండి.

దామో: ఈపెళ్ళిగురించి మీకంటే నాకే ఎక్కువ తొందరగావుంది. రేపు సాయంత్రం సరిగా 4 గంటలకు మాఅబ్బాయి మాఅల్లుడూ కలిసి వస్తారు.

వామన: సరే! వాళ్ళిద్దరకూ యిష్టమైతే మిగిలినవిషయాలు మనం కావలసినంత స్థిమితంగా మాట్లాడుకోవచ్చు. (కుడివైపు చూస్తూ) దండపాణీ! దండపాణీ!

దండ: (ప్రవేశించి) కారు సిద్ధంగా వుంది సార్.

[వామనమూర్తి, దామోదరం, వారివెనుక వినయంతో దండపాణి కుడివైపు నిష్క్రమిస్తారు—చిత్ర ఒకసారి పుస్తకం తెరచి చూసి ఎడమవైపు వెడుతూ వుంటుంది. —తెర.]

(ఇంకా వుంది)

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.

# “మీ దంతముల జాగ్రత్త పర్చండి!”

విజ్‌డమ్ దంత వైద్యుడు అదియెట్లో మీకు తెల్పును



















75A